సంపూర్ణ
పుష్టికరం-
అపరిమిత
ఆహ్లాదం!



సరికొత్త

# ఐస్‌క్రీం రుచి గల కాంప్లాన్®

తల్లులారా! పెదవులతో చప్పరించే ఐస్‌క్రీం వలె మీ పిల్లలకు చవులూరించే రుచిగల పోషక పానీయం, ఇదిగో! వేడికి పిల్లలు సరిగా తిండి తినరు. అలాంటప్పుడు ఐస్‌క్రీం రుచిగల, జిల్లుమనే కాంప్లాన్‌తో వాళ్లకు అవసరమైన పోషక ఆహారమివ్వండి!

ప్రోటీన్లు పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు—అనగా పాల ప్రోటీన్లు, ఎదిగే పిల్లలకు ప్రతిరోజూ అవసరమయ్యే మరో 22 ఇతర కీలక ఆహార పదార్థాలూ వున్నవి. మీ పిల్లలకి ఇవ్వడం మొదలెట్టండి కాంప్లాన్-రోజుకు రెండుసార్లు.

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, స్ట్రాబెరీ, ఏలక్కాయ-కుంకుమ పువ్వు సువాసనలలో దొరుకుతోంది. సాదా రకంలో కూడా.

పాలతో కలప
నవసరం లేదు.








**కాంప్లాన్® – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం**

GK&E.B84.GLC.2317.12.Tel.

ప్రారంభ సంచిక మే 9 విడుదల!

అభిరుచిగల పాఠకులకు అందాల పత్రిక!

# మయూరి

## సచిత్ర వారపత్రిక

**ఆంధ్రుల అభిమాన అగ్రనటి**
**జయసుధ అగ్రశ్రేణి సీరియల్!**

ఇంకా_ **మల్లాది వెంకట కృష్ణమూర్తి,**
**కొమ్మూరి వేణుగోపాలరావు,**
**చందు సోంబాబు** ల రసవత్తరమైన
సీరియల్స్‌తోపాటు_

కథలు, కొత్తతరహా శీర్షికలు, సినిమా విశేషాలు...

**అందరికోసం అన్నీ! వెల 2 రూపాయలే!**

— పోటీ కథలు చేరవలసిన ఆఖరు తేదీ 30.5.85




కాకతీయ పబ్లికేషన్స్
5-8-55/ఎ, నాంపల్లి స్టేషన్ రోడ్,
హైదరాబాద్-500 001




## ముఖచిత్రం

హీరోయిన్ "రేవతి" ముఖచిత్రం చాలా ముచ్చటగా ఉన్నది.

అర్వపల్లి ఆంజనేయులు, ఖమ్మం.

## చాలా బాగుంది

"చైతన్య దీపాలు" నవల చాలా బాగుంది. రచయిత గారికి నమస్కారములు.

ఎమ్. వి. ఇ. మహేశ్వరరావు, అత్తిలి.

## మనస్తత్వం

జయదుబాషి గారి లేఖలను గూర్చి 'నేస్తం' గారు వ్రాసిన విమర్శ సునిశితంగాను, దుబాషిగారి మనస్తత్వంని అద్దం పట్టినట్లు ఉంది. తన భావాలని సూటిగా, సోదాహరణంగా పత్రికా ముఖంగా తెలియచేసిన ప్రియ 'నేస్తం' గారు ఎంతయిన అభినందనీయులు.

డి. వి. వి. ఎస్. మూర్తి, నెయివేలి.

## జయదుబాషీ ధోరణి

"నేస్తం" గారి వ్యాసం "నామోషీలేని ద్విభాషి" జయదుబాషీ గారి గూర్చి చాలా చక్కగా వ్రాసారు. నిజమే! దుబాషీగారు ఎప్పుడూ భా. జ. పా. ను తె. దే. పా. ను పొగడటమే పనిగా పెట్టుకున్నారు. "నేస్తం" గారు రాసిన వ్యాసం మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకొంది. తరుచూ ఇటువంటి వ్యాసాలు ఆయన కలం నుండి వెలువడాలని ఆశిస్తున్నాను. సీరియల్స్ అన్నిటిలోను "రాగసంధ్య" భలే ఇంట్రెస్టింగ్‌గా ఉంది.

జె. దుర్గారావు, విజయవాడ.

## పంగనామాలు

తన పంగనామాలు ఎలాగున్నా ఎదుటివాడి పంగనామాలు చూసి నవ్వినట్లుగా వుంది 'నేస్తం' గారి చాదస్తం.

కార్యదీక్ష, సడలని పట్టుదల, గుండె ధైర్యం గల ప్రజల మనిషిని 'ఒక నటుడు' అనవలసిన దాపరికం వద్దే వద్దు. ఇదే గ్లామర్‌నే పణంగా పెట్టి ఆనాడు మెడలో జోలె వేసుకుని తన సాటి నటీనటులతో ప్రజల మధ్యకు వెళ్ళి జాతీయ రక్షణ నిధికి క్యాష్ అందించలేదా.

"రంగులు పూసుకున్న వాడికి రాజకీయమా?" అన్నవాళ్ళు అమితాబచ్చన్‌ని, సునీల్‌దత్‌ని, శివాజీని, కృష్ణని, జమునా, వయిజయంతిమాలలను ఎలా అనుకూలంగా సహించగలరు. "నల్ల డబ్బును తెల్లడబ్బు చేసుకోవడం సినిమా రాజకీయ వాదం" అవుతే పైవాళ్ళను ఆ కోవలోకి తేలికగా జమకట్టవచ్చు.

"ఏ ప్రజలు నన్ను అభిమానించారో...నా ఈ ఉన్నతికి కారకులో వారి కోసం ఒక యోగిగా ఈ రాజకీయాలను స్వీకరించాను." "ఈ కాషాయ గుడ్డలు నా సంకల్పాన్ని ఎప్పటికప్పుడు గుర్తు చేస్తాయి. క్రమబద్ధమైన జీవన సరళికి నన్ను పురిగొల్పుతాయి" అన్న అన్నమాటలు నమ్మేవారు లేకపోలేదు.

దేశసేవే పరమార్థ మనుకుని నమ్మి సింధు జీవితాలని త్యాగం చేసిన మహామనుషులను దేశం ఏనాటికి మరవదు మరవదు. దుబాషీ నిజానికి ఒకరకం చేయి తిరిగిన జర్నలిస్ట్ అయితే... పాఠకలోకం న్యూఢిల్లీ లేఖను ఆదరిస్తుందా?

మరీ...ఈ మధ్యన జరిగిన ఎన్నికల గురించి ఆంధ్రప్రదేశంలో సంభవించిన మిత్రపక్షాల విజయం గురించి ఆచార్య తిరుమలగారు "హైదరాబాద్ నోట్ బుక్"లో వివరించిన నిజానిజాల మాటేమిటి?

యం. మధు, హైదరాబాదు.

## సిగ్గు కాదు భయం

తమిళంలో 'అచ్చుమిల్లై' అంటే 'భయంలేదు' అని అర్థం.

29 మార్చి–4 ఏప్రిల్ వారపత్రికలో 41వ పేజీలో డి. కృష్ణమోహన్ గారు వ్రాసినట్లు సిగ్గులేదు అని కాదు. అది తప్పు.

ఎ. ఎం. గోవిందన్, పాకాల.

## కథలు

నటి రేవతి ముఖచిత్రంతో (5–11 ఏప్రిల్) వెలువడిన సంచికలో డబ్బు ముందు స్నేహం, బంధుత్వం, అధికారం ఏదీ నిలువలేవని నిరూపించే "సిఫార్సు" కథ వాస్తవానికి దగ్గరగా చాలా బాగుంది. రచయిత బెహరా వెంకట సుబ్బారావు గారికి నా ధన్యవాదాలు. అంతే కాకుండా ఈ వారం డా. జయదుబాష్ గారి "న్యూఢిల్లీ లేఖ"లో 'ఆధునీకరణ ఫలితాలు అందరికీ అందాలి' వ్యాసం చాలా బాగుంది.

హరిదాస్యం దేవానంద్‌బాబు, హనుమకొండ.

* * * *

'సిఫార్సు' కథ చాలా బాగుంది. నేటి సమాజంలో మంత్రిగార్లు, ఎమ్మెల్యేల సిఫార్సుల కంటే డబ్బే ముఖ్యమని నిరూపించారు. స్నేహితుడని దయ కూడా చూపలేదు. నేటి సమాజంలో అటువంటి వారు ఎక్కువ.

వడ్డాది ఉదయకుమార్, వారి కుటుంబ సభ్యులు, కొత్తవలస. □


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం - 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938 - 1972)

శుక్రవారం : 10-16 మే, 1985

శ్రీక్రోధన నామ సం. వైశాఖ బ. షష్ఠి

సంపుటము 77 : సంచిక 36

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: సుమన్

(ఫోటో : ప్రభుశంకర్)

# నెహ్రూ మౌంట్‌బాటన్‌ల మైత్రి!

జవహర్‌లాల్ నెహ్రూ, లేడీ మౌంట్‌బాటన్‌ల మధ్య నడిచిన వ్యవహారం ఆ రోజులలో లండన్‌లో అందరి నోటా వినిపించింది. ఆ తర్వాత చాలా రోజులకి గానీ ఈ పుకారు భారతదేశానికి వ్యాపించలేదు. దీన్ని దుష్ప్రచారం అనడానికి అంతగా వీలులేదు. ఎందువల్లనంటే అప్పటికే వారిద్దరూ ప్రేమ వ్యవహారాలు జరిపే వయసు దాటిపోయిన వారే. అయితే లేడీ మౌంట్‌బాటన్ మాత్రం ఇంగ్లాండులో పేరు మోగిన వ్యక్తి. అక్కడి సమాజంలో ఎందరికో ఆమె వ్యవహారాలు చక్కని కాలక్షేపంగా ఉండేవి. ఆ రోజుల్లో ఇండియా హౌస్‌లో పని చేస్తున్న మా బోటి వారికి అక్కడి విషయాలెన్నో చూచాయగా తెలుస్తూ ఉండేవి. లండన్ ఢిల్లీల మధ్య నడిచే ఉత్తరాలు మా చేతుల మీదుగానే వెడుతూ ఉండేవి. కృష్ణమీనన్‌తో కలిసి ఆయన సచివాలయంలో పని చేసిన నా సహచరుడొకతనికి నెహ్రూ లార్డ్ మౌంట్‌బాటన్‌కి రాసిన ఉత్తరాలలో ఓ రెండు గుర్తున్నాయి.




అందులో ఒక దానిని ఆయనే స్వయంగా ఒక పార్టీలో లేడీ మౌంట్‌బాటన్‌కి అందజేశాడు. మరొక దానిని లండన్ వెలుపల ఉన్న మౌంట్‌బాటన్ నివాసానికి ఒక దూత ద్వారా పంపాడు. కానీ మా యిద్దరికీ నెహ్రూకి లేడీ మౌంట్‌బాటన్ ఒక్క ఉత్తరం కూడా రాసినట్లు గుర్తు లేదు. అందువల్ల ఆమె అంత సుముఖంగా లేకపోయినా నెహ్రూగారే చొరవ తీసుకున్నట్లు మాకు చాలా-మందికి అనిపిస్తూ ఉండేది.

ఏది ఏమైనా జరిగింది మాత్రం వేరు. లేడీ మౌంట్‌బాటన్ మగపిచ్చి ఉన్న మగువ ఆమెకి నెహ్రూతోనే కాక అంతకన్నా ప్రముఖులైన వ్యక్తులతో కూడా పరిచయాలు ఉండేవి. యుద్ధ సమయంలో, అంతకి ముందు కూడా ఆమెకి ఎంతో మంది అభిమానులు ఉండేవారు. అమెరికాకి చెందిన సుప్రసిద్ధ నీగ్రో గాయకుడు పాల్ రాబ్‌సన్ కూడా వారిలో ఒకడు. అమేదో శీలవతి అయినట్లు ఈ వ్యవహారాలకి అంత హడావిడి ఎందుకు చేసేవారో నాకు అర్థం కాలేదు. యుద్ధానికి ముందు, తర్వాత కూడా లేడీ మౌంట్‌బాటన్ లాంటి స్త్రీలు ఎంతో మంది ఉండేవారు. అమెరికానించి బహిష్కరింపబడి ప్రవాసంలో ఉన్న రాబ్‌సన్ లాంటి వారికి మాత్రం సుఖంగానే ఉండేది. ఇలాంటి ప్రేమకలాపాల ప్రభావం మన చరిత్రపై చాలా స్వల్పంగా అయినా ఉంటుందని నేను అనుకోను. భారత్ వంటి దేశాల చరిత్ర ఇలాంటి మగపిచ్చి ఉన్న మగువల శయనాగారాలతో రూపుదిద్దుకుంటుందని నేను భావించను.

ఈ కథని మరో కోణం నించి పరిశీలించినా అందులో ఏమీ ప్రాముఖ్యం కనిపించదు. అసలు నెహ్రూకి తెలిసింది లార్డ్ మౌంట్‌బాటన్ కానీ లేడీ మౌంట్‌బాటన్ కాదు అని నా అనుమానం. దూర-ప్రాచ్యంలో యుద్ధం అయిపోయిన తర్వాత లాంఛనప్రాయంగా నెహ్రూ లార్డ్ మౌంట్‌బాటన్‌ని కలుసుకుని ఉండవచ్చు. భారతదేశానికి ఆఖరి వైస్రాయ్‌గా మౌంట్‌బాటన్ నియామకంలో నెహ్రూ ప్రమేయం ఉన్నది.

రాబ్‌సన్ కూడా కృష్ణమీనన్‌లా నామ్‌కేవాస్తే సభ్యుడో కాదో నాకు తెలియదు కానీ ఆ పార్టీకి చాలా దగ్గరి వాడు. యుద్ధానికి ముందు, యుద్ధం జరుగుతున్నప్పుడు కృష్ణమీనన్‌కి బాగా స్నేహితుడు. మీనన్ ఇండియా లీగ్ కార్యాలయంలో వారిద్దరూ కలిసి తీయించుకున్న చాలా ఫోటోలని నేను చూశాను. రాబ్‌సన్ వెంబడి తిరిగే లేడీ మౌంట్‌బాటన్ కృష్ణమీనన్‌కి కూడా సన్నిహితంగానే ఉండి ఉంటారు. యుద్ధానికి ముందు నెహ్రూ లండన్ వెళ్ళి వస్తూ ఉండేవారు. స్పెయిన్‌లో అంతర్యుద్ధం జరుగుతున్నప్పుడు కొందరితో కలిసి మీనన్ అక్కడికి వెళ్ళారు. నెహ్రూ, లేడీ మౌంట్‌బాటన్‌లు లండన్‌లోనే ఉండిపోయి ఒకరి కోసం ఒకరు పాకులాడి ఉండకపోవచ్చు. మరేవో కొన్ని కారణాల వల్ల నెహ్రూ ఇలాంటి చిక్కులలో ఇరుక్కోడం ఇష్టం లేక దూరంగా ఉండిపోయి ఉండవచ్చు. ఆమె విశృంఖలంగా శృంగారం సాగిస్తున్న ఆ రోజుల్లో నెహ్రూ లేడీ మౌంట్‌బాటన్‌ని కలుసుకోలేదంటే నమ్మడం కష్టం.

బ్రిటిష్ మంత్రివర్గంతో చర్చలకి 1946 లో నెహ్రూ, జిన్నాలు లండన్ వెళ్ళారు. అప్పుడు నెహ్రూ లార్డ్ మౌంట్‌బాటన్‌ని కలుసుకున్నారనే దానికి నిదర్శనాలు ఉన్నాయి. లార్డ్ మౌంట్‌బాటన్ భారతదేశానికి వైస్రాయ్‌గా నియమితులయ్యే వరకూ ఆయన పేరు అక్కడ ఉన్న మా విద్యార్థులెవరికీ తెలియదు. కృష్ణమీనన్ ఇండియా లీగ్ కార్యాలయంలో మాత్రం ఆయన పేరు తరచు వినిపిస్తుండేది. వేసవిలో క్రమం తప్పకుండా నేను ఆ కార్యాలయానికి వెళ్తూ ఉండే వాడిని. మీనన్ కార్యదర్శిగా బ్రిగ్గెట్ అనే ఆవిడ ఉండేది. ఆ కార్యాలయానికి వచ్చే అతిథులకి టీ తయారు చేసి ఇవ్వడమే ఆమె చేసే పనులలో ముఖ్యమైనది. అప్పట్లో మౌంట్‌బాటన్‌లలో ఎవరినీ నేను చూడడం తటస్థించలేదు. కానీ బ్రిగ్గెట్ మాత్రం వారిని గురించి తెగ చెప్తూ ఉండేది. తమ మధ్య రాకపోకలు కూడా ఉన్నట్లు మాట్లాడేది. పుకార్లతో చోటు చేసుకున్న అలాంటి స్త్రీతో మీనన్ కార్యదర్శికి అంతగా పరిచయం ఉండటం నాకు చాలా వింతగా తోచేది.

నెహ్రూ లండన్ వచ్చి వెళ్ళిన తర్వాతే లేడీ మౌంట్‌బాటన్ పేరు ఇండియా లీగ్ కార్యాలయంలోని వారి సంభాషణలలో వినిపించేది. ఆ పర్యటనలో నెహ్రూ లార్డ్ మౌంట్‌బాటన్‌ని కలుసుకున్నారా? నా అనుమానం వాళ్ళు కలిసే ఉంటారని. నెహ్రూ ఇష్ట పడటం వల్లనే లార్డ్ మౌంట్‌బాటన్ భారతదేశానికి చివరి వైస్రాయ్ కాగలిగారు. వారు అధికారంలోకి రాక ముందు నించే లేబర్ పార్టీ నాయకులు నెహ్రూకి తెలుసు. స్వాతంత్ర్యానంతరం నెహ్రూ భారత ప్రధాని అవుతారని లేబర్ వర్గాలలో వారందరికీ బాగా తెలుసు. స్వాతంత్ర్యం తరువాత భారతదేశం ఒకే ఖండంగా ఉండదనీ, విభజన తప్పదనీ అప్పటికే తేలిపోయింది. జిన్నా ఒప్పుకోరని కాదు అసలు బ్రిటిష్ వారికే భారతదేశం ఒకటిగా ఉండటం ఇష్టంలేదు. అసలు జిన్నా రంగంలోకే రాక ముందే దేశ విభజనకి పథకాలు రూపొందాయి. ఇలాంటి నిర్ణయాల విషయంలో పాశ్చాత్యదేశాలు అంత ఉదాసీనంగా ఉండవు. నిజానికి నిర్ణయాలు జరిగిన తర్వాతే మౌంట్‌బాటన్ రంగంలోకి వచ్చారు. భారతదేశం నాయకులతో ఆయన జరిపిన చర్చలు కేవలం ఒక నాటకంలో పాత్ర పోషణ వంటివి. జిన్నాకి ఈ విషయం తెలిసే ఉండవచ్చు. నెహ్రూకి కూడా ఈ సంగతులన్నీ తెలుసనే అనుకుంటాను. కాం నాయకులు అప్పటికే స్వాతంత్ర్య పో

అలిసిపోయి ఉండటం వల్ల, వృద్ధాప్యం పైబడుతున్న కారణంగా పోరాడే శక్తి నశించి అందుకు అంగీకరించారని తర్వాత ఒక సందర్భంలో నెహ్రూ అన్నారు.

లేబర్ పార్టీ నాయకులు నెహ్రూని తమ అంతరంగికుడిగా భావించారు. మౌంట్‌బాటన్‌ని భారత దేశానికి పంపడానికి పూర్వమే, స్వతంత్రం రాకముందే దేశ విభజన తప్పదనీ, భారతదేశంలోని హిందూ భాగానికి తాను ప్రధాన మంత్రి అవుతాననీ నెహ్రూకి తెలుసు. ఈ విషయం ఆయన మీనన్‌ద్వారా గానీ, నేరుగా గానీ తెలుసుకుని ఉంటారు. తర్వాత సిమ్లా, తదితరచోట్ల జరిగిన చర్చలన్నీ కేవలం ఇతరులని నమ్మించడానికి మాత్రమే.

ఇది తీవ్రమైన ఆరోపణే కానీ దానిని నిరూపించడానికి పరిస్థితుల కనుగుణమైన రుజువులు తప్ప మరేమీ లేవు. ఇక్కడి విషయాలన్నీ వదిలేసి యుద్ధం అయిన తర్వాత నెహ్రూ లార్డ్ మౌంట్‌బాటన్‌ని కలవడానికి సింగపూర్ వెళ్ళడం వింతగా తోస్తుంది. అక్కడ వారిద్దరూ బాగా సన్నిహితులై ఆ తర్వాత చివరివరకూ భాయ్-భాయ్‌గా ఉన్నారు. లేబర్ నాయకులతో చర్చల కోసం నెహ్రూ లండన్ వెళ్ళినప్పుడు మధ్యలో ఒకటి రెండు రోజులు తాము ఉంటున్న హోటల్‌కి రాకుండా గైరు హాజరయ్యేవారు. ఈ విషయం నా కెలా తెలుసంటే, అప్పుడు నేను గోవాపై ఒక సుదీర్ఘ

## ఋతువులు మారాయి

డిగ్రీల బళ్ళో మూడే మూడు కాలాలు.
ఎడ్మిషన్ల కాలం
ఎలక్షన్ల కాలం
ఎగ్జామినేషన్ల కాలం
మరి ఎడ్యుకేషన్ ఎప్పుడూ
అన్న ప్రశ్నకు
బ్రతుకు బళ్ళో ప్రవేశించినప్పుడు
అన్నది జవాబు.

— కొండముది శ్రీరామచంద్రమూర్తి

## న్యూఢిల్లీ లేఖ.....

మైన లేఖ రాసి నెహ్రూకి అందచేద్దామని ఆ హోటల్‌కి వెళ్ళాను— గోవాని నెహ్రూ ఒక మొటిమలాంటిదని అంటూ ఉండేవారు — ఆయన పిలుపు కోసం కింద ఉన్న లాబీలో చాలా సేపు వేచి ఉన్నాను. ఎంతో మంది ఆయనని చూడడానికి పైకి వెళ్లి వస్తున్నారు. కానీ మౌంట్‌బాటన్‌లు మాత్రం నాకు కనిపించిన గుర్తు లేదు. బహుశః వాళ్ళు లోపలికి వెళ్ళడానికి వేరే మార్గం ఏదైనా ఉందేమో! అప్పుడు లార్డ్ మౌంట్‌బాటన్ ఎక్కడున్నారు? ముక్కలైన భారత దేశానికి కాబోయే ప్రధాన మంత్రిని కలుసుకోడానికి ఆయనని ప్రత్యేక విమానంలో లండన్ రప్పించారా? ఎవరో ఒకరు పరిశోధించి ఈ లండన్ కథలోని రహస్యాన్ని కనిపెట్టాలని నా ఆశ. అసలు ఈసారి లండన్ వెళ్ళినప్పుడు నేనే ఆ పని చెయ్యాలనుకుంటున్నాను.

స్వాతంత్ర్యానికి ముందు ఉన్న అయోమయ పరిస్థితుల్ని కప్పిపుచ్చడానికి ఈ ప్రేమాయణం ఒక సాధనంగా ఉపయోగపడింది. అసలు దానికి అంత ప్రాముఖ్యత లేనే లేదు. తమ 58వ ఏట నెహ్రూ మొట్టమొదటిసారి లేడీ మౌంట్‌బాటన్‌ని కలుసుకుని ఉంటారు. అప్పటికి ఆమెకి కూడా వయసు ఉడిగిపోయింది. కానీ దానికి వాళ్ళు అంత హంగామా ఎందుకు చేశారనేదే ఎవరికైనా ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. దానికి కారణాలు వేరే ఉండవచ్చని నా అనుమానం... బ్రిటిష్ వారికి తాము తప్పు చేశామన్న నేర మనస్తత్వం ఉన్నది. భారతదేశ విభజన విషయంలో తాము కూడా అలాంటి తప్పే చేశామన్న భావం నెహ్రూకి కూడా ఉండి ఉండవచ్చని నా అనుమానం. ఎందుకంటే ఆయనకి కూడా అందులో పాత్ర ఉండటమే కాకుండా అది జరుగుతుందని ముందుగా తెలిసి కూడా దానిని రహస్యంగా ఉంచడం, దానికి అంగీకరించడం చేశారు కాబట్టి.... □

# వారఫలం

## 10–5–1985 శుక్రవారం మొదలు 16–5–1985 గురువారం వరకు

★ **మేషం** : గడచిన కొన్ని వారాలుగా ఉన్న యిరుకు యిబ్బందులు నిస్సందేహంగా తొలగిపోతాయి. వృధా ప్రయాసకు మాత్రం గురి కాకండి. మనోవాక్కాయ కర్మల ఉద్యోగం చూచుకోండి. వ్యాపారం కూడా అంతే. స్త్రీలకు: వృత్తి ధర్మాన్ని వదలకండి. కులవృత్తికి ఏదీ సాటి రాదు.

★ **వృషభం** : కొన్ని వ్యవహారాలను గూర్చి ఊరక మననం చేసికొంటూ కాలం వ్యయం చేయకండి. అమితోత్సాహానికి ఆస్కారమైన వారం. మీ చర్యలను, ఎత్తుగడలను నలుగురు ప్రశంసిస్తారు. అది ప్రగతి సూచకం. స్త్రీలకు: అనుకున్న విధాన పనులు జరగటమే గాక ఆనందోత్సాహాలకు ఆస్కారమున్నది.

★ **మిధునం** : 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' ఎంత కృషి చేస్తే అంత మేలు. గ్రహానుకూలత గల వారం. స్థిరాస్తి సంపాదించుకోవటానికి, తగాదాలు పరిష్కారం కావటానికి సర్వవిధాలా వీలుగల సమయం. వార మంతా లాభించే మార్గమున్నది. స్త్రీలకు: వృత్తి యందు ప్రగతి, అంతో యింతో చేతికందటం గమనింపదగిన అంశాలు.

★ **కర్కాటకం** : కొందరు అనవసరంగా మీపై ఆవేశపడనున్నారు. కనువెర్ర చేయనున్నారు. అనవసరంగా వాదానికి దించనున్నారు. అంటీ అంటనట్లుండాలి. మీ వ్యాపారమో మీ వ్యవహారమో చూచుకోండి. ఏ సందర్భంలోనూ ఆవేశపడటం తగదు కదా! వ్యాపారంలో మీరనుకొన్న విధంగా జరగకపోవచ్చు. స్త్రీలకు అదే రీతి.

★ **సింహం** : మీరు ఏమీ తెలియని వాళ్ళలాగా ఇతరులకు కనిపిస్తారు. కాని మీ చేతలను వ్రాతలను చూచి మరోలాగ భావించి, మీ జోలికి రాకుండా దూరంగా ఉండనున్నారు. 'సోమ మంగళ వారాలందు' యత్న కార్యసిద్ధి. సాహితీ గోష్ఠి. స్త్రీలకు: ఒకానొక వ్యవహార విషయంలో నష్టం రావచ్చు. తెలిసి మసలుకోవటం శ్రేయోదాయకం.

★ **కన్య** : మీరు బండ్లలో, మీ వాహనాలలో ప్రయాణించే సమయాన ఎంత జాగరూకత వహిస్తే అంత మేలు. ప్రమాదాలకు గురి కావచ్చు. జాగ్రత్త! వ్యాపారరీత్యా కూడా అధిక లాభమాసించి, లేనిపోని యిబ్బందులకు గురి కాకుండా చూచుకోండి. స్త్రీలకు: ఉద్యోగరీత్యా ప్రగతి కొందరకు, నూతనోద్యోగ ప్రాప్తి కొందరకు చెప్పదగిన అంశాలు.

★ **తుల** : ఈ వారం మీకు వ్యవహారంలో విజయ సూచన గలదు. అయినా చిక్కులలో పడకండి. ఏ వ్యవహారానికైనా ఎంత దూరంగా ఉంటే అంత మంచిదిగా గ్రహించండి. ఇది హెచ్చరిక మాత్రమే. 'గురువారం' మీ యత్నాలకు బలం చేకూర్చుతుంది. స్త్రీలకు: కుటుంబానందం.

★ **వృశ్చికం** : ఈ వారమంతా ధనాభావం. ఎన్నో రీతుల యత్నిస్తారు. కాని ప్రయోజనం? చివరకు అప్పులైనా వసూలు కావని శ్రమించి తెలిసికొంటారు. వ్యాపారరీత్యా కూడా అనవసరమైన చిక్కులలో చిక్కుకోవటం తటస్థిస్తుంది. స్త్రీలకు: మితిమీరిన వ్యయం నెత్తిన పడుతుంది.

★ **ధనుస్సు** : ఉద్యోగపు టాశతో కొందరు చేసే యత్నాలు ఫలవంతం కాగలవు. కొందరకు డబ్బు తగినంతగా చేతికందకపోయినా అవసరాలు తీరుటకు ఏమాత్రం యిబ్బంది లేదు. స్థిరాస్తి ఏ విధంగా సంపాందే మార్గంలేదు. ప్రయాణాలందు జాగ్రత్త అవసరం. ప్రమాదాలకు గురి అవుతారేమో చూచుకోండి. స్త్రీలకు: వ్యవహారాలందు విజయం, వస్తుసేకరణ కవకాశం.

★ **మకరం** : ఏ సందర్భంలోనూ ధీమాగా సంచరించకండి. మిమ్ము కనిపెట్టి ఉన్నవారు, అవమానానికి గురిచేయాలని చూస్తూనే ఉన్నారు. గమనించండి. వ్యాపారరీత్యా ప్రయాణం సాగించటం న్యాయమే. వృత్తియందు అంతో, ఇంతో మేలు కనిపించకపోదు. స్త్రీలకు: ఎంత కృషి చేస్తే అంతటి ప్రగతి ఉద్యోగ వృత్తులందు, లభ్యం కావటం గమనిస్తారు.

★ **కుంభం** : వారమంతా అన్ని విషయాలలో జాగ్రత్తగా మెలగటం అవసరం. నిదానం ప్రధానం. మానవ బలమే కావాలని ఆశించటం ఆశాభంగానికి కారణం. దైవ బలమే బలం. మీ సంకల్పం ఆలస్యంగా నెరవేరుతుందని, ఆశించిన ఫలం అందగలదని గ్రహించాలి. స్త్రీలకు: క్రొత్త వస్తువులు సమకూర్చుకొనుటతో వారం ముగుస్తుంది.

★ **మీనం** : విపరీతమైన ఖర్చులు పైన పడతాయి. ఇబ్బందులును ఎదుర్కోనవలసిన అగత్యం కూడా ఉంటుంది. త్యాగబుద్ధి అవసరం. పొరుగువారికి తోడుపడటం అంతకన్నా అవసరం. మీ ఆలోచన ప్రకారమే కుటుంబ వ్యవహారాలు కుదుటపడతాయి. స్త్రీలకు: కళా సాహితీరంగాన ప్రగతి, ఆత్మీయులతో సంభాషణల కవకాశం గల వారం. గ్రహించండి.

—విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



21 సంవత్సరాల మిలిటరీ పాలన తరువాత బ్రెజిల్ కి అధ్యక్షుడిగా ఎన్నుకోబడిన టాంక్రెడో నెవెస్ (75) ప్రమాణ స్వీకారం చేయటానికి కొన్ని గంటల ముందు, తీవ్రమైన అస్వస్థతకి లోనయి మార్చి 15 నించి ఇప్పటి వరకు "డయివర్టి కులైటిస్" అనే జబ్బుకిగాను 7 సార్లు శస్త్ర చికిత్స చేయించుకున్నారు. ఈ లోపుగా ఆయనకి హెర్నియా వ్యాధి కూడా వచ్చింది. అంతేకాక ఊపిరితిత్తులకి కూడా ప్రమాదకరమైన వ్యాధి సోకింది. దీనికితోడు రక్తం గడ్డ కట్టే గుణం బాగా సన్నగిల్లింది. మందులు క్రమం తప్పక ఇస్తూ హృదయవేగము, శరీరోష్ణోగ్రత, రక్త ప్రసరణ నిర్విఘ్నంగా ఉండేలా చూసారు. యంత్రాల సహాయంతో రక్తాన్ని శుద్ధి చేసి ఆక్సిజన్‌ని అందించారు. సావో పాలోస్ హార్ట్ ఇన్‌స్టిట్యూట్‌లో చికిత్స పొందుతున్న నెవెస్ సంపూర్ణ ఆరోగ్యం కోరుతూ 134 మిలియన్ల బ్రెజిలియన్లు ఆరాట పడ్డారు. సామూహిక ప్రార్థనలు చేసారు. వైస్- ప్రెసిడెంట్ జోస సార్నీ నెవెస పరిస్థితి పట్ల సానుభూతిని వ్యక్తం చేస్తూ పాలనా వ్యవహారాలని అలక్ష్యం చేయడం జరగదని చెప్పారు. పరిస్థితి ఎలా మలుపు తిరుగుతుందోనని ఎంతో మంది ఎదురు చూస్తున్న సమయంలోనే నెవెస్ శాశ్వతంగా కన్ను మూసారు! నెవెస్ వంటి చిత్తశుద్ధి, క్రమశిక్షణగల అధినేత లేక పోవడం ఎన్నటికీ తీరని లోటు. బ్రెజిల్ ప్రజలు ఆత్మ ధైర్యంతో వ్యవహరిస్తారని ఆశించడం మినహా చేయ గలిగిందేమి లేదు. □



# సీరియల్

# మల్లిక

యర్రగడ్డ కిశోర

(గత సంచిక తరువాయి)

తలుపుతీసి ఇంట్లో అడుగుపెట్టిన భార్గవ్‌కి చీకటి ఇల్లు అతిచల్లగా స్వాగతమిచ్చింది. లైటువేసి థర్మోస్టాట్ మీద టెంపరేచర్ పెంచాడు. ఇల్లంతా వేడెక్కేసరికి ఇంకొక అరగంటైనా పడుతుంది. స్వెట్టర్ వుంచుకుని కోటు తీసేశాడు.

టైం చూస్తే అరుగంటలైంది. మల్లిక ఇంకొక గంటదాకా రాదు. ఆమె వచ్చేదాకా ఆగితే వంటకు లేటౌతుందని కిచన్‌లోకి వెళ్ళాడు. రెఫ్రిజరేటర్ తెరిచి చూశాడు. చారు, పెరుగుతప్ప చేసిన వంటలేమీలేవు. ఫ్రీజర్ నుండి ఫ్రోజెన్ బీన్స్‌బాగ్ బైటికి తీశాడు. తాలింపువేసి బాగ్‌లోని బీన్స్ ముక్కలు అందులో పడేశాడు. అవి వేగేలోపల అమ్మెటికి కావలసిన వుల్లిపాయలు, పచ్చి మిరపకాయలు తరిగి గిన్నెలో వేశాడు. రైస్ కుక్కర్‌లో బియ్యం కడిగిపెట్టి కుక్కర్ ఆన్‌చేశాడు. ఇంకొక పదిహేను నిముషాల్లో డిన్నర్ సిద్ధమౌతుంది.

మల్లిక రావటానికింకా అరగంట టైముంది. డిష్‌వాషర్‌లో క్లీన్ అయ్యి ఆరిపోయిన పాత్రలన్నీ తీసి కిచెన్ కాబినెట్‌లో సర్దిపెట్టాడు. సింక్‌లో వున్న మురికిపాత్రలు కొలిపి ఖాళీ అయిన డిష్‌వాషర్‌లో పెట్టాడు.

కిచన్‌లో పని అవ్వగానే రెఫ్రిజరేటర్ తెరిచి తలుపు పట్టుకుని కాసేపు చూస్తూ నిలబడ్డాడు. అతనికి బీర్ తాగాలని వుంది. ఎదురుగా వున్న "మికలోబ్" బీర్‌బాటిల్ అతని మనస్సులోని కోరికను కనిపెట్టినట్టుగా అతనివైపు చూసి మత్తుగా నవ్వింది!

పొట్ట తడుముకున్నాడు. ఆకలితో లోతుకు పోయిన పొట్ట అతనికి అభయమిచ్చింది. బాటిల్ తీసుకుని రెఫ్రిజరేటర్ తలుపు మూసేసాడు. షెల్ఫ్‌లో నుండి కాసిని పొటాటో చిప్స్ తీసుకుని డెన్‌లోకొచ్చి కూర్చున్నాడు. ఎదురుగా టేబిల్‌మీదున్న టెలివిషన్ రిమోట్ కంట్రోల్ తీసి బటన్ నొక్కాడు. దూరంగా వున్న టి.వి. ఆన్ అవ్వగానే రిమోట్ కంట్రోల్ ద్వారానే తనకు కావాల్సిన ఛానల్ పెట్టుకుని సోఫాలో తీరిగ్గా జారగిలపడ్డాడు.

టి.వి.లో ఆనాటి బిజినెస్ రిపోర్ట్స్ పెద్ద ఉత్సాహకరంగా లేదు. వాల్‌స్ట్రీట్‌లో యాక్టివిటీ వున్నట్టులేదు. కామెంటేటర్ ఆ రోజు మార్కెట్‌లోని స్టాక్స్ విలువ ఒకదాని తర్వాత ఒకటి వరుసగా, తొందరగా వేలంపాట పాడేవాడిలాగా చెప్పుకుపోతున్నాడు.

కాస్సేపు అదిచూసి తన స్టాక్స్‌లో మార్పులేకుండా వుండటం గమనించి నిరాసక్తంగా టి.వి. వైపు నుండి దృష్టి మళ్ళించాడు. బీర్‌బాటిల్ మూతతీసి గటగటా నాలుగు గుక్కలు తాగాడు. పొటాటో చిప్స్ తీసి నోట్లో వేసుకున్నాడు.

ఈ మధ్య వీకెండ్స్ ఎప్పుడో తప్ప మామూలు రోజుల్లో తాగటం మానేశాడు. కారణం, ఈ మధ్య అతనికి కాస్త పొట్ట రావటమే! పూరికే కాస్త పొట్టవచ్చినా అతను పెద్దగా పట్టించుకునేవాడుకాదు. కాని ఆ మధ్య ఏవో మీటింగ్స్‌కి వేరేవూరు వెళ్ళాల్సివచ్చి సూట్లు డ్రైక్లీనింగ్‌కి ఇచ్చే ముందు ఒకసారి వేసుకుని చూస్తే ఒక్కపాంటూ పట్టలేదు.

ఆనాటికి మూడవనాడే బైలుదేరి వెళ్ళాలి. సమ్మరయితే వేడి భరించలేక కాజువల్‌దుస్తులు వేసుకొస్తారుగాని వింటర్‌లో సాధారణంగా అందరూ ఫుల్‌సూట్‌తో వస్తారు. ఏం చెయ్యాలో తోచలేదతనికి. తను ఇంతకు ముందుకంటే లావయ్యాడని తెలుసుగాని అది ఇట్లాంటి సమస్య తెచ్చి పెడుతుందని అనుకోలేదు.

అయితే అతనికొక విశేష గుణముంది. అది, ఎట్లాంటి పరిస్థితిలోనూ కంగారుపడుతూ కూర్చోక పరిస్థితికి తగినట్టు ఏం చెయ్యాలో నాలుగు విధాలా ఆలోచించగలిగే నిబ్బరత్వం!

అతను చకచకా ఆలోచించాడు. మూడు మార్గాలు తోచాయి.

ఒకటి-క్రొత్త సూట్లు కొనుక్కోటం.

రెండు-వున్నవాటిని ఆల్టర్ చేయించటం.

మూడు-వెళ్ళేలోపల బరువు తగ్గటం.

మూడవది అసాధ్యమని తెలుసు. రెండు రోజుల్లో, కటిక వుపవాసమున్నా పదిహేను పౌన్లు తగ్గటం కల్ల!

మొదటిది చెయ్యటం సులభమే. కాకపోతే సూట్లు అంతగా వాడక పోవటం మూలాన ఇంకా క్రొత్తదనంపోని ఇన్ని సూట్లుండగా మళ్ళీ క్రొత్తవి కొనటం దండగ.

కాబట్టి, రెండవది ఆచరణయోగ్యంగా కనబడింది. వెంటనే టెలిఫోన్ డైరెక్టరీతీసి ఆ ప్రాంతంలో వున్న టైలరింగ్ షాపులకు ఫోన్ చేశాడు. రెండు మూడు షాపులవాళ్ళు రెండ్రోజుల్లో ఆల్టర్ చెయ్యటం కుదరదని చెప్పారు. ఆఖరికి ఒక షాపువాళ్ళు ఒప్పుకునేసరికి అమ్మయ్య అని వూపిరి పీల్చుకున్నాడు భార్గవ్.

ఆ తర్వాతనే అతనితో డైటింగ్ కార్యక్రమం మొదలు పెట్టించింది మల్లిక. స్వాభావికంగా భార్గవ్‌కి శరీరం గురించి శ్రద్ధ బాగా తక్కువ. లావూ, సన్నం, పొడుగూ పొట్టిల గురించి పెద్దగా పట్టించుకోడు. ఆరోగ్యమే అందం అని అతని అభిప్రాయం, తనకి శరీరంలో ఏ రుగ్మతలూలేవు. నలభై ఏళ్ళు దగ్గర పడుతున్నాయిగనుక కాస్త పొట్టైనంత మాత్రాన వచ్చిన నష్టమేముంది అంటాడతను.

అందుకే మల్లిక డైటింగ్ అంటూ గోలపెట్టినా మొదట్లో పట్టించుకోలేదు. అయితే మల్లిక విడువకుండా అతని అభిప్రాయాల అస్త్రంతోనే అతన్ని గెలిచింది.

వయస్సు ముదురుతున్నప్పుడే లేనిపోని రోగాలు బైలుదేరుతాయని, అందులోనూ లావుగా వుండేవారికి డయాబిటస్, హార్ట్ ప్రాబ్లమ్స్ లాంటి పెద్ద జబ్బులు ఎక్కువ వస్తాయని, కొంచెం లావే గదాని మొదట్లో వూరుకుంటే బాగా లావైనాక తగ్గటం కష్టమనీ పెద్ద లెక్చరిచ్చిందా మల్లిక స్నేహితురాలు రూత్ అనే అమ్మాయి డైటీషియన్- ఆమె నుండి అన్నీ తెలుసుకుని అతను ఏది చెప్పి తప్పించుకోవాలన్నా ప్రతిదీ సైంటిఫిక్‌గా వాదించి చివరికి ఒప్పించింది.

దాంతో విధిలేక డైటింగ్ మొదలెట్టాడు భార్గవ్. రూత్ దగ్గర నుండి రెడ్యూసింగ్ డైట్‌కి సంబంధించిన ప్రణాళికా పత్రం తెచ్చింది మల్లిక. ఆ ప్రణాళికలో మొదటి అంశం ప్రకారం బీర్కి స్వస్తి చెప్పాలి. ఆఫీసునుండి రాగానే బీర్ తాగుతూ టి.వి. చూడటం భార్గవ్‌కి అలవాటు. బీర్ తాగటంవల్లనే అతనికా పొట్టవచ్చిందని అంటుంది మల్లిక. ఆ దేశంలో ఎవరికైనా పొట్టబాగా వుంటే బీర్ బెల్లీ అంటారు. పెళ్ళి తరవాత సిక్స్‌పేక్ (సిక్స్ పాక్- ఆరుబాటిల్స్ గల పేకెట్) తాగుతాడు కాబట్టి అలా అవటంలో అర్థముంది. కానీ, ఒకటీ అరా బాటిల్‌కే మితంచేసిన తనకు అందువల్లనే పొట్టొచ్చిందంటే మాత్రం ఒప్పుకోడు భార్గవ్.

బీర్‌లో పోషక పదార్థాలున్నందువల్ల కోకాకోలాకంటే బీర్ ఎన్నోరెట్లు

జరిగిన కథ-1: భార్గవ అమెరికాలోని ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. భార్గవకు మల్లిక పరిచయం అయ్యింది. ఆమె కంప్యూటర్స్‌లో డిగ్రీ తీసుకొని ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు.

నయమని మల్లికకు ఎలాగో ఒప్పించి పూర్తిగా మానకుండా వీక్‌డేస్‌లో మాత్రం మానేట్లు ఒప్పందం కుదుర్చుకున్నాడు. వీకెండుకూడా చాలా తక్కువే తాగుతున్నాడు.

మొదట్లో మల్లిక రూత్ సలహా తు.చ. తప్పకుండా తీవ్రంగా అమలులో పెట్టింది. కొలత ప్రకారం భోజనం, చిరుతిండ్లు బంద్, నియమిత వ్యాయామం, వగైరాలు.

మల్లిక మనస్సు నొప్పి–చలేక మొదటి ఐదు పౌన్లు తగ్గేవరకూ ఎలాగోలా ఓపికపట్టి అవన్నీ చేస్తూ వచ్చారు. కాని, అది కేవలం ఆ పదిహేను పౌన్లు తగ్గేవరకూ జరిగే కార్యక్రమంలా తోచలేదు. మల్లిక మాటలనుబట్టి. ఆ తర్వాత కూడా వుండవలసిన దానికన్నా ఎక్కువ పెరక్కుండా వుండటాన్కి చచ్చేవరకూ ఇంకేదో డైట్ చెయ్యాలట!

ఒక శుభ ముహూర్తాన మల్లికను కూర్చోబెట్టి చేతులు పుచ్చుకున్నాడు. "ఇవి కాళ్ళనుకో! ఇదంతా ఇక నావల్లకాదు డైటీషియన్‌ని కాకపోయినా నేనూ సైంటిస్ట్‌నే. వుజ్జాయింపుగా తప్ప ఖచ్చితంగా ఈ ఎత్తుగల మనిషి ఈ బరువే వుండాలని ఇంకా ఎవ్వరూ కనిపెట్టినట్లు నాకు తెలియదు. పది పౌన్లు అటూ ఇటూ అయినందువల్ల మనిషి చచ్చిపోడు. నీ పట్టుచాలించి ఈ దీనుణ్ణి కనికరించు" అంటూ వేడుకున్నాడు

ఏదైనా తెగేదాకే సాగలాగటం మల్లిక మనస్తత్వంకాదు. తనింకా పట్టుబడితే భార్గవ్ మరింత మొండికేస్తాడు. అదీగాక భార్గవ్ చెప్పినదాంట్లోనూ నిజంలేకపోలేదు. పైగా భార్గవ్ డైట్ చెయ్యాల్సినంత లావుగా వుండటం అనుకుని మౌనం వహించింది–

బీర్ బాటిల్ ఖాళీచేసి టైమ్ చూసుకున్నాడు ఏడు దాటింది ఇంకా మల్లిక రాలేదేమిటా అనుకుంటూ కిటికీలో నుండి బైటికి చూశాడు.

బైట బాగా ఫాగీగా వుంది. దట్టంగా అలుముకున్న పొగ మంచులో వీధి లైట్లు మసక మసగ్గా వెలుగుతున్నట్లున్నాయి ఇళ్ళు, రోడ్లు కంటికి కనిపించటంలేదు తనొచ్చేప్పుడు వెదర్ క్లియర్‌గానే వుంది. ఇంతలోనే ఇంత మార్పు! ఈ వెదర్ వల్లనే మల్లికకు ఆలస్యమై వుంటుంది– అనుకుంటూ వచ్చి కూర్చున్నాడు.

టి.వి.లో ఏవేవో ప్రోగ్రామ్స్ వస్తూనే వున్నాయి న్యూస్ వచ్చే చానల్ పెట్టాడు.

పదిహేడు మందిని రేప్‌చేసి, పదిమందిని చంపి అయిదేళ్ళు చట్టాన్నుండి తప్పించుకు తిరిగిన ఇరవై ఏడేళ్ళ మేనియాక్‌కి ఎలక్ట్రిక్‌చైర్‌లో మరణ దండన– ఏడేళ్ళ బాలికను కిడ్‌నాప్ చేసిన ఫలానా పోలికలున్న మనిషి ఆచూకీ తెలిపిన



# మల్లిక

వాళ్ళకు వెయ్యి డాలర్ల బహుమతి– రోడ్డుమీద వెళ్తున్న ఎనభై ఏళ్ళ ముదుసలిని మగ్‌చేసి హాండ్‌బాగ్, వంటి మీదున్న నగలు లాక్కుపోయిన పదహారేళ్ళ బాలనేరస్తుడికి శిక్ష–

అన్నీ ఇవే వార్తలు! విసుగువచ్చి టి.వి. కట్టేశాడు భార్గవ్. సోఫాలో పడుకుని న్యూస్ పేపర్‌చేతుల్లోకి తీసుకున్నాడు. ఫ్రంట్ పేజీ తిరగేసి ఇక చదవ బుద్ధికాక ప్రక్కన పడేశాడు.

మరీ లేటయ్యేట్టుంటే మామూలుగా ఫోన్ చేసేది మల్లిక. గంట క్రితం రావాల్సిన మనిషి ఇంకా రాకపోగా ఫోనైనా చెయ్యలేదు. ఏదైనా జరుగలేదుకదా? ఏ యాక్సిడెంట్, కారు ట్రబులో?

పరధ్యానంగా ఆలోచిస్తున్నాడు భార్గవ్. ఏదో గుర్తొచ్చి వులిక్కిపడ్డాడు.

పెళ్ళి కాకముందు మల్లిక ఉద్యోగాన్వేషణలో వున్నరోజులు! ఏదో ఇంటర్వ్యూకి వెళ్తుంటే సబ్‌వేలో జరిగిందా సంఘటన. మనుషులు తక్కువవున్న కంపార్ట్‌మెంట్‌లో ఎక్కకూడదని మల్లికకు తెలుసు అందుకే జనం ఎక్కువగా వున్న కంపార్ట్మెంట్‌లోకి ఎక్కింది. పోను పోను మనుషులు దిగిపోయి కంపార్ట్‌మెంట్ పలచనయ్యింది. మామూలుగా అయితే అలాంటప్పుడు వెంటనే జనం బాగావున్న కంపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళిపోయేది. ఆ రోజు కాస్త పరధ్యాన్నంగా వున్న మల్లిక ఏదో ఆలోచిస్తూ తనుగాక కంపార్ట్‌మెంట్‌లో ఇంకొక ఇద్దరు ముగ్గురుకంటే ఎక్కువమంది లేకపోవటం గమనించలేదు.

సడెన్‌గా ఎవరో వచ్చి అతిదగ్గరగా నిల్చున్నట్టయి వులిక్కిపడి చూసింది.

చూడగానే కంగారుపడింది.

ఎదురుగా నిలుచున్న మనిషి చేతిలో చిన్న పదునైన కత్తి లైట్ల వెలుగులో తళతళా మెరుస్తోంది.

"నీ పర్సు ఇలా ఇవ్వు." ఏ భావమూ లేకుండా అన్నాడతను. పర్స్ ఇవ్వకుండానే చుట్టూ చూసింది. దూరంగా ఒక నడివయస్సతను కూర్చుని పేపర్ చదువుతున్నాడు. అతను జరుగుతున్నది గమనించాడో లేదో మల్లికకు తెలియలేదు. అవతలి ప్రక్కగా చేతుల్లో పుస్తకాలు పట్టుకున్న ఇద్దరు కాలేజీ కుర్రాళ్ళు ఏదో మాట్లాడుకుంటున్నారు.

"నీతోనే మాట్లాడేది! పర్స్ ఇలాఇవ్వు." రెట్టించాడతను. ఈసారి గొంతు కఠినంగా వుంది. చేతిలో కత్తి అలాగే వుంది.

మాట్లాడకుండా పర్స్ ఇచ్చింది.

గబగబా పర్స్ తెరిచి అందులోని వాలట్ తీసుకుని పర్స్ ఆమె మీదకు విసిరాడు. రెండడుగులుఅవతలికి వేశాడు.

గబుక్కున లేచింది మల్లిక.

"ప్లీజ్! అందులోని డబ్బు తీసుకుని నా వీసా, డ్రైవర్స్ లైసెన్సు ఇచ్చెయ్". గబ గబా అంది.

అతను తలెత్తకుండానే డబ్బు తీసుకుని వాలట్ ఆమె కూర్చున్న బెంచి మీదకు విసిరి, అప్పుడే ఏదో స్టేషన్ రావటంతో గబగబా రైలుదిగి జనంలో కలిసిపోయాడు.

అంతా క్షణాలమీద జరిగిపోయింది.

అప్పటివరకూ లేని గుండె దడా, కాళ్ళ వణుకూ ఒక్కసారిగా పట్టుకున్నాయి. వాలట్ తీసి పర్సులో పెట్టుకుంటూ ఆ ముగ్గురి వంకా చూసింది. పేపర్లోంచి కళ్ళు పైకెత్తి ఆమె వంకే చూస్తున్న అతను, మాటలాపి ఇటు తిరిగిన కాలేజీ కుర్రాళ్ళూ గబుక్కున తమ పనుల్లో తాము మునిగిపోయారు.

అంటే వీళ్ళంతా గమనిస్తూనే వున్నారన్న మాట! చూస్తూ చూస్తూ ఎదురుగ్గా దౌర్జన్యం జరుగుతుంటే పట్టనట్టు కూర్చోవటం ఈ న్యూయార్కు మనుషులకే చెల్లింది అనుకుంటూ చీదరించుకుంది.

ఆ తరువాత భార్గవ్‌తో చెప్పినప్పుడు అతనన్నాడు. "నీ ప్రక్కన నేనున్నా అంతే జరిగేది మల్లీ! ఎదురు తిరగటం కంటే అడిగింది పారెయ్యటమే శ్రేయస్కరం కాదూ కూడదూ అంటే కత్తితో పొడవటమో, గన్‌తో పేల్చటమో చెయ్యటానికి వెనుకాడరు వెధవలు! వాళ్ళతో కలబడి ప్రాణాలు పోగొట్టుకో... కంటే చూసీ చూడనట్టు వూరుకోవటమే మేలు. ఇవ్వటానికేమీ లేక... తే కసితో వూరికే ప్రాణాలు తీస్తారన్న భయంవల్ల ఏదో కొంత ...బ్బు 'మగ్గర్స్'కి సమర్పించటానికి ఎప్పుడూ దగ్గర వుంచుకోవాలంటారిక్కడ

మొదట్లో ఇట్లాంటివి భయంగా, వికారంగా అనిపించినా రాను రాను జాగ్రత్తగా మసులుకోవటం తప్ప చేసేదేం లేక సర్దిపెట్టుకుంది మల్లిక–

కారు వచ్చి ఆగిన ధ్వనికి గబుక్కున లేచాడు. తలుపు తీసి చూశాడు మల్లిక గరాజ్ డోర్ మూసి లోపలికొస్తోంది. ఆమెను చూడగానే నిశ్చింతగా అనిపించింది.

"ఇంతాలస్యం అయిందేం?" కోటు విప్పుకోవటానికి సహాయం చేస్తూ అడిగాడు.

"మీటింగ్ టైంకే అయిపోయింది. రైలు కాస్త లేటవ్వటంతో కనెక్షన్ రైలు తప్పిపోయింది. ఇంకొక దాని కోసం ఇంతసేపు ఆగాల్సి వచ్చింది." అలసటగా సోఫాలో కూర్చుంది.

ప్రొద్దున్న ఆరు గంటలకు వెళ్ళిన మనిషి రాత్రి ఎనిమిదిన్నరకి ఇల్లు చేరుకుంది. మీటింగ్స్ వున్నప్పుడల్లా అలా జరగటం మామూలే. మల్లిక చేసే వుద్యోగం బాధ్యతాయుతమైంది. పై వుద్యోగుల నుండి ఒక్క మాట కూడా రాకుండా చాలా జాగ్రత్తపడుతుంది డిపార్ట్‌మెంటులో చాలా శ్రద్ధగానూ, తెలివిగానూ పనిచేస్తుందని పేరు తెచ్చుకుంది. తక్కువ కాలంలోనే, ఆమెతో మొదలుపెట్టిన చాలామందికంటే బాగా పైకి పోగలిగింది. చాలామంది 'ఇమ్మిగ్రెంట్స్' తమ వునికిని స్థిరం చేసుకోవటానికి, అమెరికన్లతో సమానంగా వుండటానికి, వుద్యోగాల్లో గొడ్డు చాకిరీ చేస్తారని వాడుక! స్మార్ట్‌గా, పరాయివాళ్ళనే బెరుకు లేకుండా వాళ్ళలో ఒకళ్ళుగా తగు ప్రయత్నం చేయకుండానే కలిసిపోగలిగే నేర్పు చాలా తక్కువమందికి వుంటుంది. అట్లాంటి వాళ్ళలో మల్లిక ఒకటి!

చాలామంది వుద్యోగాలు కేవలం సరదా కోసమో, కాలక్షేపం కోసమో, లేదా తప్పనిసరి అవ్వటం వల్లనో చేస్తారు. కాని వుద్యోగం చేయటం మల్లిక ధ్యేయం! ఆ ధ్యేయాన్ని నెరవేర్చుకోవటం ఆమె ఆనందం! ఆమెకు వుద్యోగం పనిలాగా వుండదు. ఒక బాధ్యతను నిర్వర్తిస్తున్నట్టుంటుంది. అందులో ఎట్లాంటి చికాకు లొచ్చినా ఆమెకు విసుగు రాదు. వుద్యోగానికి అంతగా 'డెడికేట్ అయ్యే ఆమెను చూస్తే ఒకొక్కసారి భార్గవ్‌కి ఆశ్చర్యమేస్తుంది. అలా అని మిగతా పనులు నిర్లక్ష్యం చెయ్యకపోవటం వల్ల ఆమెంటే అమితమైన గౌరవం కూడా అతనికి!

"చాలా అలిసిపోయావు. కాస్సేపు రిలాక్స్ అవ్వు." అని ఆమె తలను ఒళ్ళోకి తీసుకున్నాడు.

తల, కణతలు సరవదీస్తూ "కాళ్ళు లాగుతున్నాయా? పట్టనా?" అనడిగాడు.

"ఏం వద్దు. అయిదు నిముషాలు కళ్ళు మూసుకుని పడుకుంటే చాలు. కొంచెం తలనొప్పిగా వుందంతే." కళ్ళు మూసుకుంటూ అంది.

మళ్ళీ ఏదో గుర్తొచ్చి కళ్ళు తెరిచి "డిన్నర్"– అంటూ ఏదో అనబోయేంతలో "ష్!నువ్వు పడుకో. డిన్నరంతా రెడియే!" అంటూ ఆమెను ఆపాడు.

దిళ్ళ మీదకు ఆమె తలను చేర్చి లేచి నిల్చున్నాడు. "కొంచెం వైన్ తెస్తాను. అది తాగి వేడి నీళ్ళతో స్నానం చేస్తే అలసటంతా మటు మాయమౌవుతుంది" అని లోపలికెళ్ళాడే.

ఆమె ఏమీ మాట్లాడలేదు. బాగా అలిసినప్పుడు అతనికి ఆ వైద్యం పనిచేస్తుందని తెలుసు.

# మల్లిక

గ్లాసుతో వైన్ తీసుకొచ్చి ఆమెకిచ్చాడు. "నేను టబ్‌లో వేడి నీళ్ళు ఒదులుతాను. పది నిముషాలు నువ్వు టబ్‌లో కూర్చుంటే ఈ లోపల డిన్నర్ రెడీ అవుతుంది". అనేసి పైకెళ్లాడుఖ

టాప్ తిప్పి టబ్‌లో సగానికి పైగా వేడి నీళ్ళొదిలాడు: అందులో సువాసనతో నిండిన 'బబుల్ బాత్' బీడ్స్ వేసి చేత్తో కలియబెట్టాడు. తెల్లటి నురగ గులాబి రంగు టబ్‌లో పూల పడవలాగా వుయ్యాల లూగుతోంది. దాన్ని చూస్తుంటే అతనిక్కూడా టబ్ బాత్ చెయ్యబుద్ధయ్యింది. కాని అతను టబ్‌లో దిగితే కనీసం గంటయినా కూర్చోనిదే బైటికి రాడు. బైట ప్రపంచాన్నే మర్చిపోయి, ఆ వెచ్చటి నీటి హాయిని అనుభవిస్తూ, పుస్తకం చదువుతూ కూర్చోవటం అతని సరదాలలో ఒకటి.

కడుపులో ఆకలి నక నకలాడుతోంది. పైగా బాగా ప్రొద్దుపోయింది. తెల్లారీ తెల్లారకుండానే మళ్ళీ బ్రతుకుతెరువు పయనాలాయె! తీరిక జలకాలాటకిది సమయంకాదు.

భార్గవ్ క్రింది కొచ్చేసరికి మల్లిక వైన్ పూర్తిచేసి ఓపిక వచ్చిన దానిలాగా లేచి కూర్చుంది.

ఆ రాత్రి భోజనాలయ్యి పక్క మీదకు చేరేసరికి పదకొండయ్యింది. భార్గవ్‌ని పెనవేసుకుని పడుకొన్న మల్లికలో ఇందాకటి అలసట మచ్చుకైనా లేదు.

"భార్గవ్! నన్ను సేద దీర్చటంలో నీకున్న నేర్పు ఇంకెవరికీ లేదు. చిన్నప్పుడు మా అమ్మకూడా ఇంత బాగా చేసి వుండదు. థాంక్స్!"

"మై ప్లెషర్! సరేగాని థాంక్స్ చెప్పటం ఒట్టి మాటలతో నేనా?" చిలిపిగా పెదవులు చూపించాడు.

మల్లిక మనస్సంతా చెప్పలేని హాయిగా వుంది. తనకి జీవితంలో కోరుకున్నవన్నీ వున్నాయి. తనకెంతో ప్రియాతి ప్రియమైన భార్గవ్‌కి తను ప్రాణంతో సమానం! కోరుకున్న విధంగా చదువుకుంది. తన అభిలాష ప్రకారమే ఈ దేశం వచ్చింది. ప్రేమించిన మనిషిని పెళ్ళిచేసుకుంది. తను అభిమానించే వుద్యోగంలో ఎంతో పైకి వచ్చింది. కావాలనుకున్నవన్నీ పొందగలగటాన్ని మించిన పరిపూర్ణత ఏముంటుంది జీవితంలో ?. కాని... కాని...

"రేపు డాక్టర్ దగ్గరికి వెళుతున్నావా?" భార్గవ్ ప్రశ్నకి వులిక్కిపడి కళ్ళు తెరిచింది.

"ఊ." నిజానికామెకంతవరకూ డాక్టర్ అపాయింట్‌మెంట్ సంగతి గుర్తే లేదు.

"శలవు తీసుకుంటున్నావా? లేక ఆఫీసు నుండి అటే వెళ్తావా?"

"ఆఫీసుకు దగ్గరే కదా? లంచ్ అవర్‌లో వెళ్ళి వస్తాను. శలవు అనవసరం."

"నన్నూ రమ్మంటావా? నా అవసరం కూడా ఏమైనా వుంటుందేమో!"

"ఇనీషియల్ కన్‌సల్టేషనే గదా? నువ్వు రాకపోయినా ఫరవాలేదనుకుంటాను. అక్కడికి నీ ఆఫీస్ చాలా దూరం కూడాను."

"సరే పడుకో. చాలా పొద్దుపోయింది." అటు తిరిగాడు భార్గవ్.

మల్లిక ఇటు తిరిగి పడుకుంది. ఎంతకీ నిద్ర రావటం లేదు. రేపు డాక్టర్ దగ్గరకు వెళ్ళటం మల్లికకెంత మాత్రం ఇష్టంలేదు. కాని తప్పదు. చేయ గలిగిందంతా చేశాము అనే తృప్తి కోసమైనా వెళ్లాలి అనుకుంటూ బలవంతంగా కళ్ళు మూసుకుంది.

## 2

రాత్రెప్పుడో పడిన వర్షం చలికి గడ్డకట్టి రోడ్ల మీద షీట్‌లాగా పరుచుకుని వుంది. ఆ ఐస్ షీట్ మీద కాలు పెడితే జర్రున జారి నడుం విరగ్గొట్టుకోవటం ఖాయం. కారుల్లో వెళ్ళేవాళ్ళు కూడా అతి జాగ్రత్తగా డ్రైవ్ చెయ్యకపోతే కారు స్కిడ్ అయ్యి, యాక్సిడెంట్ అవ్వటమూ ఖాయమే. ఎన్నో అంగుళాల ఎత్తున పడే స్నోకంటే పల్చటి ఐస్‌షీట్ వల్లనే ప్రయాణీకులకు ఎక్కువ ప్రమాదం!




**పూర్ణశ్రీ. ఆలూరు.**

★ రామలక్ష్మి గారూ ప్రశ్నావళి పక్కగా టైటిల్ పక్కగా మీ ఫోటో! ఈ రూపంలో చూడాలని వుంది.

● నేనలా ప్రశ్నార్ధకంలో పడతానా అని!

★ పత్రికలో మీ సీరియల్ అసలే రావడం లేదేందుకు. రాయడం లేదా?

● అలా అనేం లేదయ్యా.

★ మీ రికమెండేషన్‌తో మీ అమ్మాయి లలితా రుద్రని రచయిత్రినిగా పత్రికలకి పరిచయం చేశారు అలాగే రచయితల మవుదామనుకున్న సామాన్యులని కూడా పరిచయం చేయకూడదా?

● లలితారుద్ర నా కూతురైతే కావచ్చు. కాని నేనామెని రచయిత్రిని చేయలేదు. ఆరుద్ర ఆమెని కవయిత్రినీ చేయలేదు. కృషిపై తన స్వంత పేరుతో బి. లలితగానే ఆది ప్రచురణ ప్రారంభించింది. రచనా వ్యాసంగం చాలా వ్యక్తిగత మైన నేర్పు అని నేను నమ్ముతాను. యీ విషయంలో ఒకరి కొకరు సహాయం చేసు కోవడం అన్నది– చాలా కష్టం. అంచేత ఏదో నా కూతురని సంపాదకులు లలిత రచనలు ప్రచురించరు. వాటిలో ఏదైనా స్పార్క్ వుంటే వారే ప్రచురిస్తారు. దాని కెవరి రికమెండేషన్ అక్కరలేదు. అసలు నన్నెవరు రికమెండ్ చేశారు. పాతికేళ్ల కిందట? మాలతి నెవరు రికమెండ్ చేశారు?

పేరొచ్చిన రచయిత లంతా కష్టపడి పైకి వచ్చిన వాళ్లే. మరిచి పోకండి. సంకుచిత దృక్పథం వదలితే – యీ సంగతి మీకే తెలిసేది!

**టి. డి. కె. తెనాలి.**

భారతదేశంలో నేడు జరుగుతున్న మతాంత్రీకరణపై మీ అభిప్రాయం ఏమిటి? ఇవి ఇలా సాగితే మన మాతృదేశం భవిష్యత్తు ఎలా వుంటుంది?

● మాతృదేశానికీ మతానికీ సంబంధం ఏమిటి? దేశభక్తికి మతం – అడ్డు రాదు. ఇక బలహీనులని బలవంతులు ఎప్పుడూ తమ పక్క తిప్పుకుందుకు ప్రయత్నిస్తూనే వుంటారు.

**పి. పి. కె. కె. ఖర్గపూర్.**

★ అక్కయ్యా నాకు కథలు. కార్టూనులు. కవితలు రాయాలనిపిస్తాది. కాని ఎలా మొదల చెయ్యడమో అన్నది సమస్యగా నున్నది. దయచేసి తెలియపర్చండి.

● ఇదే నాలుగు లైన్లుగా విరిచి రాస్తే కవిత. దీనికే ఓ పిచ్చి బొమ్మ (మనిషి మనిషిలా వుండదు–వస్తువులు వస్తువులుగా వుండవు!) గీస్తే అది కార్టూను. ఇక కథ కదా .... చుక్కలూ కామాలూ ప్రశ్నార్ధకాలూ రెండేసి కేజీలు కొని 'నాకు కథ రాయాలని వుందన్నదే– నేను కథ రాస్తే అంటూ కాగితాలు నింపండి కథ అవుతుంది. ముందు మీ పేరు సరిగ్గా రాయడం నేర్వండి. కృష్ణ కుమారి ఏమిటి?!

**పి. ఆర్. గుంటూరు.**

★ ప్రేమ గుడ్డిదా? కామం గుడ్డిదా?

● రెండూ గుడ్డివే. కాని ప్రేమ గుడ్డిలో వున్న కామంలో క్రూరత్వం వుండదు.

★ రచయితకు తృప్తి ఆనందం దేంట్లో వుంటుంది?

● ఆ రెండూ వచ్చేస్తే – ఇక రచయిత మిగలడు! □

# మల్లిక

ప్రతి అయిదు నిముషాలకూ రేడియోలో హెచ్చరికలు చేస్తూనే వున్నారు – ఎంతో అవసరమైతే తప్ప ప్రయాణం చెయ్యవద్దనీ, ప్రయాణం చేసేవాళ్ళు ఎంతో మెలుకువగా వుండాలనీను.

"పోనీ ఈ రోజుకి మానెయ్యకూడదా మల్లీ? ఇంత ప్రమాదమైన రోడ్ల మీద ఏం డ్రైవ్ చేస్తావ్?" గరాజ్ నుండి కారు బైటికి తీస్తున్న మల్లికను హెచ్చరించాడు భార్గవ్.

"ఫరవాలేదులే! డాక్టర్ దగ్గరక్కూడా వెళ్ళాలిగా? ఈ వెదర్ మనకి అలవాటేగా?" అంటూ భార్గవ్‌కి బై చెప్పి కారు రివర్స్ చేసింది.

తలుపేసి లోపలికొచ్చాడు భార్గవ్. ఇంకొక అరగంట టైముంది అతనికి. కిటికీలో నుండి బైటికి చూస్తూ నిలబడ్డాడు కాస్సేపు. ఎదురింటి పిల్లలు డ్రైవ్ వేలో ఐస్ మీద నిలబడి జారుడు బండ మీద లాగా జర్రున జారుతున్నారు. పడతారేమోనని భయంగా చూశాడు భార్గవ్. వాళ్ళు మాత్రం హుషారుగా కేరింతలు కొడుతూ చేతులు బారజాపి బాలన్స్ చేసుకుంటూ క్రింద పడకుండా జారుతున్నారు.

కాస్సేపు అది చూసి తర్వాత ఆఫీసుకెళ్ళే ప్రయత్నంలో పడ్డాడు భార్గవ్.

★ ★ ★ ★ ★ ★

అప్‌టౌన్ మన్‌హాటన్‌లో, బ్రాడ్‌వే 203వ స్ట్రీట్‌లో తనకు కావల్సిన నంబర్ చూసుకుంటూ వెళ్ళి ఒక బిల్డింగ్‌లోకి అడుగుపెట్టింది మల్లిక. ఫాయిర్‌లో టెలిఫోన్ దగ్గర సెక్యూరిటీ గార్డ్ కూర్చుని వున్నాడు. అతని దగ్గరకు వెళ్ళి తను వెళ్ళవలసిన డాక్టర్ పేరు చెప్పింది. అతను వెంటనే ఫోనులో మాట్లాడి మూడో అంతస్తుకి వెళ్ళమని చెప్పాడు.

ఎలివేటర్ నుండి మూడో అంతస్తులో వున్న ఆఫీసు నంబర్లు. ఎటు వెళ్ళవలసిందీ తెలియటానికి వాటికి యారో గుర్తులు స్పష్టంగా కనపడ్డాయి.

కారిడార్‌లో ఒక మూలగా వుంది డాక్టర్ ఆఫీసు. తలుపు మీద గోల్డెన్ లెటర్స్‌తో డా. రిచర్డ్ పియర్‌సన్, ఇన్‌ఫర్టిలిటీ స్పెషలిస్ట్ అని వ్రాసి వుంది.

తలుపు తెరుచుకుని లోపలికెళ్ళింది మల్లిక. ఇంతకు ముందటి డాక్టర్ ఆఫీసు కంటే ఇది చాలా పెద్దది. తలుపుకెదురుగా పెద్ద రిసెప్షన్ కౌంటర్ వుంది. రిసెప్షనిస్ట్ దగ్గరకెళ్ళి తన అపాయింట్‌మెంట్ సంగతి చెప్పింది. పాడ్ మీద మల్లిక పేరు కెదురుగా టిక్ కొట్టి వెయిటింగ్ రూంలో కూర్చోమని అటువైపు చూపించింది రిసెప్షనిస్ట్.

కోటు తీసేసి, హేంగర్‌కి తగిలించి, వెయిటింగ్ రూంలో సోఫాలో కూర్చుంది మల్లిక చుట్టూ కలియజూసింది. చాలా విశాలమైన గది! అందమే కాకుండా సౌకర్యంతో నిండిన బ్లూకలర్ సోఫా సెట్లు రూం మధ్యలో అమర్చి వుంది. సోఫాల మధ్యన వున్న పెద్ద రౌండ్ టేబుల్ మీద రక రకాల మేగజైన్లు పేర్చి వున్నాయి. మూడు వైపులా గోడల కానుకుని బ్లూకలర్ కుషన్లు కుట్టిన కుర్చీలు వున్నాయి. చిన్న చిన్న పువ్వులతో నిండిన నీలం వాల్ పేపర్ మీద లైట్ల కాంతి పడి గదంతా నీలంగా మెరుస్తోంది. కిటికీల దగ్గర కుండీలలో పెట్టిన మొక్కలు బాగా పెరిగిపోయి సీలింగ్‌ని అంటుతున్నాయి. లేత నీలం వాల్‌టువాల్ కార్పెట్ల మీద పరిచిన డిజైన్‌తో వున్న గుండ్రటి ఎరుపు రంగు ఓరియంటల్ రగ్ తీర్చిదిద్దిన రంగవల్లికలా పొందికగా వుంది.

మంచి ప్రాక్టీస్ గల డాక్టర్‌లాగే వున్నాడు అనుకుంది మల్లిక, టేబుల్ మీది మేగజైన్ ఒకటి చేతిలోకి తీసుకుంటూ.

అంతలో రిసెప్షనిస్ట్ వచ్చి అప్లికేషన్ ఫాం, పెన్ ఇచ్చి పూర్తి చెయ్యమని చెప్పి వెళ్ళిపోయింది. వూరు–పేరు, ఎత్తు–పొడుగు, బరువు, వుద్యోగం – సద్యోగం, ఆడా–మగా, పుట్టిన తేదీ మొదలైన వివరాలతో బాటు మెడికల్ ఇన్‌షూరెన్స్ వుందా లేక స్వంత పాకెట్ నుండి డబ్బు కడతారా అనే అన్నింటికంటే ముఖ్యమైన వివరం గురించిన పత్రమది!

ఏది ఎలా వున్నా ఆ ఆఖరి అంశం సంతృప్తికరంగా లేకపోతే చచ్చేవాడి క్కూడా మందివ్వరు డాక్టర్లు–అనుకుంటూ అది పూర్తిచెయ్యటానికి పూనుకుంది. అదవ్వగానే రిసెప్షనిస్ట్‌కిచ్చేసి వచ్చి మళ్ళీ కూర్చుంది.

(ఇంకా వుంది)

# మన శరీరానికి అప్‌కోస్-డి అవసరం

మనం మేలుకొని ఉన్నా, నిద్రావస్థలో ఉన్నా పని చేస్తున్నా, విశ్రాంతి తీసుకొంటున్నా మన శరీరానికి నిరంతరమైన శక్తి సరఫరా అవసరం ఈ శక్తి వల్లనే శరీరం తన సాధారణ ఉష్ణోగ్రత నిలిపి ఉంచుకోవడానికి సహాయమవుతుంది శక్తి సరఫరా లేకుంటే మనం లేమన్నమాటే

మన శరీరం బంగాళాదుంపలు గోధుమలు, బియ్యం, బీట్‌రూటు వంటి ఆహార పదార్థాలలోని పిండి పదార్థాన్ని అణువణువులుగా విడగొట్టి చివరికి గ్లూకోజ్‌గా రూపొందిస్తుంది ఈ గ్లూకోజే రక్తంలోనికి పీల్చుకోబడి శరీరానికి అవసరమైన శక్తి అందడానికి కారణమవుతుంది. ఆహారాన్ని గ్లూకోజ్ కింద మార్చే ప్రక్రియ నిదానమైనది దీనివల్ల, అనారోగ్యము నరాలవత్తిడి అలసట వంటి స్థితులలో శరీరానికి అవసరమైన అధిక శక్తి సరఫరా కావలసినంతగా జరగక పోవచ్చు ఈ సమయాలలో శీఘ్ర శక్తి నిమిత్తం నోటిద్వారా శుద్ధమైన గ్లూకోజ్ రూపంలో శరీరానికి శక్తి అవసరమవుతుంది

అప్‌కోస్-డి ఇట్టి సమయాలలో అత్యంత శ్రేష్ఠమైనది అప్‌కోస్-డి పిల్లలలోను, పెద్దలలోను కూడా ఖర్చైన శక్తిని తిరిగి అందించడానికి వాడదగినది

అప్‌కోస్-డి గ్లూకోజ్‌తో బాటుగా ఎముకలకు నరముల ధాతువుకొరకై కాల్షియం భాస్వరాలను, కాల్షియంను సరిగా ఉపయోగించుకునేందుకై విటమిన్-డిని కూడా అందిస్తుంది

అప్‌కోస్-డి తక్షణ శక్తినిస్తుంది దీనిని మంచి నీళ్లతోగాని వేడి లేదా చల్లని పానీయాలతోగాని తీసుకోవచ్చు

మీకు అదనపు శక్తి, అదీ క్షణంలో కావలసినప్పుడు అప్‌కోస్-డిని గుర్తు తెచ్చుకోండి!

అప్‌కోస్-డి, అజంతా ఫార్మా వారి సగర్వ ఉత్పాదన

**అప్‌కోస్-డి** ®

**(గ్లూకోస్-డి)**

**అప్‌కోస్-డి అంటేనే తక్షణ శక్తి**

ఉత్పాదకులు: ap

**అజంతా ఫార్మా ప్రైవేట్ లిమిటెడ్**

243, కళ్యాణ్‌దాస్ ఉద్యోగ్ భవన్, వర్లీ, బొంబాయి 400 025









INNOVATION/AP/TEL/10



# అంకురం

## బండారు లక్ష్మి

మలయ మారుతం- కలకూజితాలూ-దూరాన చర్చి గంటలు- నిశాచరుడికి వీడ్కోలు చెప్తుంటే-

సుప్రభాతంలోని చరణాలను గానం చేస్తున్న మధుర స్వరం- హారతిని ఆరగింపు చేస్తూ చిరు గంటల సవ్వడి- ఉదయలక్ష్మిని స్వాగతం పలుకుతుంటే-

పాదాలకు జీరాడుతున్న పట్టీల- మువ్వల కిలకిలలు

గాజుల గలగలలు- మెట్టెల కలకలలు

కోడలి రాకను సూచిస్తుంటే-

దశరథరామయ్య హృదయం యింకా ఏదో శబ్దం కోసం తహతహలాడుతోంది.

"రాత్రి బాగా నిద్రపట్టిందా మావయ్యా?" సంపద సంస్కారపూరితమైన గొంతుకకు కళ్ళు తెరచి తలగడకు ఆనుకొని కూర్చున్నాడు.

ఆమె అందిచ్చిన బత్తాయి రసం త్రాగుతూ- అడ్డు వచ్చిన బత్తాయి గింజను అర చేతిలో వేసుకున్నాడు.

విత్తనం వైపూ- సంపదవైపూ మార్చిమార్చి అతను చూసిన చూపు- భూదేవిలాంటి కోడలు యింట్లో వుంది - అయినా నా వంశ వృక్షం - చక్కటి పువ్వునీ- రెండు కాయల్నీ కాయకుండా- నా యింట్లో కేర్ కేర్‌మని పసి పిల్లల ఏడుపులు వినపించకుండా- వుండడానికి కారణం ఏమిటి?

ఆ చూపును అర్థం చేసుకున్న సంపద లేచి నిలబడి మందహాసం చేసింది. "మీ వంశ వృక్షం- చీడ పీడల భయం నుంచి బయట పడగానే చక్కటి కాయలు కాస్తుంది మావయ్యా- మీరు కంగారు పడకండి." చిరు నవ్వుతో గ్లాసును తీసుకొని బయటికి నడిచింది సంపదలక్ష్మి.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు మంచం దిగి- షవర్ క్రింద నుంచి వచ్చిన భర్తకు టర్కీ టవల్తో తల తుడుస్తూ-

"మనం రేపు ఉదయం పెళ్ళికెళ్ళాలి. మావయ్య చెప్పేరు" అంది సంపద.

"ఊ- అలాగే నీ యిష్టం-" అన్నాడు ప్రభాకర్ ఆమె హృదయానికి తల చేరవేస్తూ.

"అన్నం తినరా ఏమిటి? యిలాగే హాయిగా వున్నట్టుంది మీకు!" అంది ప్రేమగా అతని గడ్డాన్నీ చెక్కిలినీ నిమురుతూ.

"యింత కంటే హాయి- తృప్తి- ఎక్కడైనా వూహించగలనా లక్ష్మీ!"

"నాకీ చేతిలోని మధు పాత్ర ముందు అన్నీ దిగదుడుపే."

'అది నా బలహీనత రాణీ- నన్ను క్షమించలేవా"

"కొంచెం వదలండి. భోజనం వడ్డించెయ్‌నా- కాఫీ తీసుకరానా?"

"నువ్ కూడా నాతో తింటానంటే అన్నమే వడ్డించెయ్."

"ఊ - ఎక్కడికి–పెళ్ళికి ఏ వూరు-" అన్నం కలుపు కొని - ఆమెకు నెయ్యి వడ్డిస్తూ అడిగాడు.

"కృష్ణరాజుపాలెం. మీరు కప్పురాజుపాలెం అంటారుగదా."

"మైగాడ్- ఆ వూరయితే నేనూ రాను. నువ్వూ వెళ్ళొద్దు."

"ఎందుచేతనట?" సావకాశంగా అడిగింది సంపద.

ఎందుకేవిటి- ఆ వూరెళ్తే - ఏ పల్లెటూళ్ళు మన బాధసీమరా అని పాడుకోవాలి - ఒకటే బురద- ఒళ్ళంతా నెప్పులూనూ."

"మీ నాన్నగారేదో పాట పాడతారట- ఒకసారి వెళ్ళండి.!"

"బాబోయ్ యిదేదో కుట్రలా వుంది. నేనా గతుకుల రోడ్డు మీద ఆ మొరటోళ్ళ మధ్యకు వెళ్ళలేనే బాబూ."

"మీ నాన్నగారికి అనవసరంగా ఉద్రేకం తెప్పిస్తారు గానీ- ఉదయం ఆరు గంటలకే బయల్దేరండి. అటువంటి కష్టాలు చూస్తేనే- మన సుఖాల విలువ పెరుగుతుంది- బోర్ కొట్టదు."

"ఊ- నువ్వెప్పుడూ నాన్నగారినే సమర్థిస్తావ్." విసుక్కోబోయాడు ప్రభాకర్.

"మన పొలాలన్నీ- మీ తాతగారి కాలం నుంచీ ఆ కుటుంబమే చేస్తున్నారు. మన కాళ్ళకు పిసరంత మట్టి అంటకుండా- మన ఒంటి నుండి ఒక్క చెమటబిందువు రాల్చకుండా- ధాన్యరాసుల్ని మనవి చేస్తున్నందుకు-"

"సరే- సరే- సరే నువ్ చెప్పినట్టే వెళ్తాం." కంగారు పడిపోయాడు ప్రభాకర్.

"శ్రమ శక్తి, అబ్సెంటీ లేండ్ లార్డిజం- ఫ్యూడల్ మనస్తత్వం- యిటువంటి మాటల్చెప్పి నన్ను బెదర గొట్టకు - యిలాంటివి-"

"కమ్మటి జీవితంలో- పంటి క్రింద రాయిలాగ- బాధ పెడుతుంటాయేం?" పూర్తి చేసింది సంపద లక్ష్మి.

"కారు కూడాలేదు కదే లక్ష్మీ. అమ్మ యింకా రాలేదు. యింట్లో ఎవరూ లేకుండా నాన్నగార్ని ఒదిలేసి "

"చూడండి మహాశయా- ఒంకలన్నీ ఓవర్ రూల్డ్- మనం నడుచుకుంటూ అయినా సరే- ఆ పెళ్ళికి వెళ్ళవలసిందే. యింక ఆ రూట్లో వెళ్ళి బుర్రను పాడు చేసుకోకండి. ఉదయం ఆరు గంటలకు బయల్దేరా



లంటే - మీరు రాత్రి పది గంటలకే నిద్రపోవాలి. ఆ విషయం ఒక్కటే జ్ఞాపకం పెట్టుకోండి." నవ్వు పెదాల మధ్య అణుచుకుంటూ పెరుగు వడ్డించింది సంపద.

"ఈ కొంపలో నువ్వొక డిక్టేటర్‌వైపోతున్నావ్." కోపంగా అనబోయి ఆమె మొహం చూసి- అనుకున్న ఫీలింగ్ తెచ్చుకోలేక- నిస్సహాయంగా నవ్వేసి- నోరు లేని కంచం మీద తలపడ్డాడు ప్రభాకర్.

"యింకో గంట పోయాక బయల్దేరితే ఏవన్నా ప్రమాదమా" దుప్పటిని పైకి లాక్కోబోయాడు ప్రభాకర్.




"ఒక్కటి కాదు. చాలా ప్రమాదాలున్నాయిగానీ- ఒకసారి మన పెళ్ళవలేదింకా నేను లాంచీలో భద్రాచలం వెళ్తున్నానని తెలిసి మీరేం చేసేరు!తెల్లారుఝామున నాలుగ్గంటలకే ఫుల్‌గా ముస్తాబయి పోయి - ఆ చలిలో లాంచీ ఎక్కి నా కూడా- మీరు అనుకుంటే ఎంత పనన్నా చేస్తారు స్వామి- నాకు తెలుసు."

"ఊ - చాల్లే - నడు - లక్ష్మీ ఆ లాంచీ ప్రయాణం భలేగా వుందే!"

"వుంటాది స్వామి-ప్రియురాలితో ఏం చేసిన మజాగానే వుంటుంది."

సీట్లో టర్కీ టవల్ పరచి- పెట్టి- ప్రెజెంటేషన్ ప్రక్కన సర్ది సదుపాయాలు చేసేడు రాముడు.

యిద్దరూ బస్‌లో కూర్చున్నాక టికెట్లు తీసి- తీసుకోవాలసిన మర్యాదల గురించి కండక్టర్‌కు చెప్పి మూల్యం చెల్లించి- యింజన్ స్టార్టవ్వగానే దిగిపోయాడు క్రిందికి.

ప్రభాకర్ స్టార్ అండ్ స్ట్రైల్ తెరచి- హాలీవుడ్ స్టార్ల సంపదల్ని- సంపదకు వివరించబోతుంటే- చిన్న కలకలం.

యిద్దరూ తలెత్తి చూసేరు.

యిద్దరు పోర్టర్లు- ఒకతణ్ణి చెరో రెక్కా పట్టుకుని బలవంతంగా ఎక్కిస్తుంటే-అతను ఎక్కనని గిజాయించుకొని అల్లరి చేస్తూ- కేకలు తిట్లూ మొదలెట్టాడు. నల్లగా, సన్నంగా, పొడుగ్గా వున్నాడు. మాసి తోళ్ళయిపోయిన గుడ్డలూ -గుంటలు పడిపోయిన కళ్ళూ-

ఒరేయ్ శేషారావ్-ఈడు మూడు రోజుల్నించి యింటి మొకం సూట్టల్లేదు. సారా తప్ప మంచి నీళ్ళు ముట్టటల్లేదు. యింటికాడ పెళ్ళాం బాలెంతరాలు-పాపం నిన్న ఏడుత్తా జెప్పింది. ఎదవని నాగరాయి లంకలో దింపెయ్." డ్రైవర్‌తో యింకో డ్రైవర్ చెప్తున్నాడు గట్టిగా అరిసి.

"నా యిట్టంరా లంజా కోడుకా నా డబ్బు కట్టబడి సంపాదించేను- ఎవడ్రా నువ్వు- ఒరేయ్ శోగా ఎక్కడ్రా దింపెత్తావ్. నిన్ను మడ్ర్ సేసెస్తాను. నీ బస్సు- దీనమ్మ కాలవలోకెట్టేత్తాను.!"

# అంకురం

"ఒరేయ్ రంగా కాసేపు నోరు మూసుకో- కారులో పెద్ద మనుషులున్నారు. న్యూసెన్స్ చెయ్యకు బాగోదు." కండక్టర్ గదమాయించేడు.

"ఒరేయ్ నారాయుడూ- నిన్ను కూనీ సేసేసి- నీ రత్తం సారాలాగ తాగేత్తాను ఎదవా- ఎవడ్రా పెద్ద మనిషి- ఈ కార్లో తాగని మొగోడేవడన్నా వుంటే యిలా రమ్మను. యిలా రమ్మన్రా సెవులు కోసి చేతులో పెట్టేస్తాను."

"ఎవరి చెవులు" ఎవరో అన్నారు.

"యింకెవరియ్ మనయ్యే - తాగుబోతెదవ థూ." తుపుక్కున ఉమ్మేసాడు మీసాల ఆసామి.

"ఆడితో టేటి వూరుకోండి పెద కాపుగారూ- తరవాత స్టేజిలో దింపేద్దాం. ఐదు నిమిషాలు ఓపిక పట్టండి."

సంపదలక్ష్మి నిట్టూర్పును దిగమ్రింగి అతని వైపు సానుభూతిగా చూసి మొహం ప్రక్కకి త్రిప్పుకుంది.

ప్రభాకర్ పుస్తకంలోనించి- మొహం పైకెత్తలేదు. పేజీ కూడా త్రిప్పలేదు. ఏపుగా ఏదిగి దిగంతాలకు విస్తరించి వున్న పొలాల్ని కాసేపు చూసి "పొలాలు చూడండి. పచ్చగా ఎంత బావున్నాయో- భూ మాత కడుపు పంట." అంటూ ప్రభాకర్ దృష్టిని పొలాలవైపు మరలించింది సంపద.

"తమరు దిగవలసిన చోటువచ్చేసిందండి," డ్రైవర్ యింజన్ ఆపుజేసేసేడు. బస్ వాగు దగ్గర ఆగిపోయింది.

బస్‌లోకి ఎవరో ఎర్రటి కుర్రాడు వచ్చేడు. "నమస్కారం సార్- రండి- సామాను యిదేనా మీరు దిగండి-గుమస్తా తెస్తాడు. ఆ యిదిగో శేషారావ్ మధ్యాహ్నం ట్రిప్పులో యింటికొచ్చి భోజనాలు చేసి వెళ్ళండి." మైసూరు గిత్తల బండి లోపల మెత్తని పరుపు.

బంగారు మలామా వేసిన కొమ్మ తొడుగులు- లేఎండ పడి కాంతులు వెదజల్లుతూ గిత్తల్ని అందంలో ముంచెత్తుతున్నాయి.

కుర్రాడు అందంగా లేతగా ప్రతి అంగుళం ఆరోగ్యంతో తొణికిసలాడుతున్నాడు.

"యిదిగోనండి- ఈ పదకొండో మైలురాయి దగ్గర్నించీ ఆ కనబడేయన్నీ మీ పొలాలేనండి-మొత్తం డభ్బై ఎకరం. ఆ తరవాత చేను మాదండి-ఏభై ఎకరం ఏకండీ చెక్క." ఎర్రటి కుర్రాడు ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు.

"గిత్తలు బావున్నాయి."

సంపదలక్ష్మి మాటకు అతని మొహం వికసించి పోయింది. ఆనందంతో వుబ్బితబ్బిబ్బయి పోయాడు.

"ఈ రెండూ నావేనండి. మా యింట్లో పుట్టినియ్యే నేనే పెంచేను. నేనుంటేగానీ దాణా తినవండి. ఎంత రాత్రయినాగాని నేను చెక్క తినిపించేదాకా అలాగ నిలబడి వుంటాయి- మా సత్యం - శివం." వాటివైపు ఆకుర్రాడు ఆప్యాయంగా చూసుకుంటూ చెప్తుంటే సంపదకి అనుకోకుండా కళ్ళు చెమ్మగిల్లేయి.

ఆ పందిళ్ళూ- ఆర్భాటాలకూ- విస్తుపోకుండా వుండలేకపోయింది. నాలుగంకణాలకూ పందిర్లే.

వీధిలో వేసిన చలవ పందిట్లో సోఫాలూ-కుర్చీలూ - అతిథులూ కోలాహలంగా అట్టహాసంగా వుంది.

వెనకవైపు పందిట్లో గాడి పొయ్యిలూ- కాగుతున్న కళాయిలూ- యభై మందికి తక్కువ లేకుండా పనులు చేస్తున్నారు.

కుడి వైపు పందిట్లో భోజనాలకు బారులుగా టేబిళ్ళూ- కుర్చీలూ గాజు గ్లాసులూ-

"యిక్కడ మాంసాలూ - చేపలూ- ఒడ్డిత్తారండి అయ్యోంపు పందిట్లో కాయగూరల భోజనాలు ఒడ్డిత్తా రండి. ఈ మూడ్రోజులూ- యింక ఒండీ వాళ్ళు ఒండుతుంటే తినేవోళ్ళు తింటుంటారు.

ఈసరికి ఐదు మిటాయి వుండలు చేత్తారండి-ఐదు రకాల పిండి వంటలు యాభై కాలిళ్ళెదతారు అమ్మాయి గారికి." ఆవిడెవరో ఏకరువు పెడుతుంటే వింటూ చూస్తోంది సంపధలక్ష్మి.

ఆడవారున్న అంకణంలోకి తీసికెళ్ళింది రమ్మని.

అక్కడ ఎవరూ రెండు కె.జి.ల బంగారానికి తక్కువ మొయ్యడం లేదు లక్షల మీద తప్ప వేల గురించి ఎవరూ మాట్లాడడం లేదు.

పెళ్ళికొడుకు ఏదో చదువుకుంటున్నాడట.



# "మా ఇంటికి కలర్ టివి కొనడానికి మేమెన్నో వదులుకున్నాము. భగవంతుడి దయవలన లోకజ్ఞానాన్ని మటుకు కాదు."

## గృహిణి సుపర్ణా గంగూళీకి టెలివిజన్ సాంకేతిక విజ్ఞానం గురించి బొత్తిగా తెలీదు. అయినా టివి నుంచి తనకి ఏమికావాలో ఆమెకు తెలుసు.



సుపర్ణా గంగూళీ అనవసరపు సాహసాలు చేయ దలచుకోలేదు. తను విశ్వసించే, చిరకాలంగా సుస్థిరమైన పేరు సంపాదించిన దానితోనే హాయిగా వుండవచ్చనుకొంది. అదే డయనోరా ఆమెకు అందించింది. ఈరోజున, తన డయనోరా CT 212 Mark I కలర్ టివి చూసి ఆమె ఎంతో గర్విస్తోంది.

ఆమెకు 2 గ్రిల్లే కలర్ ట్యూబ్ మరియు CCIR పాల్ స్టాండర్డ్ B/G రిసీవర్ యూనిట్ ఎలా పని చేస్తాయో తెలీదు. కాని దాని రూపం ఆమెకు ఎంతో ఇష్టం. స్పష్టంగా చిత్రం వుండడం, రంగులు సరిగ్గా రావడం వలన ఇతర టివిల కన్నా తన టివినే ఆమె మెచ్చుకుంటుంది. ఆమె టివిలో శబ్దంకూడా స్పష్టంగా వస్తుంది. ఆమె భర్త ఆమెకు ట్వీటర్ మరియు వూఫర్‌లతో వున్న 4000 mw అంప్లిఫైయర్ అందుకు కారణమని చెప్తారు.

అయితే. అన్నిటికన్నా అన్ని డయనోరా టివిలు ఏవిధమైన ఇబ్బంది ఇవ్వకుండా వుంటాయనే సంగతి తెలిసిన సుపర్ణా గంగూళీ నిర్భయంగా వుంటుంది.

**డయనోరా® కలర్ CT SERIES**

**అత్యుత్తమమైనది ఆశించేవారికి**

DYN-1647

స్నేహితులు చాలామంది వచ్చారు.

వీళ్ళు సంపదలో సరితూగరు కానీ వంశం మంచి దని చేసుకుంటున్నారట. యింతకూ ఆ వంశంలో ఎవరికీ సంపాదించవలసిన ఖర్మ పట్టలేదుట - దర్జాగా తిని జల్సా చెయ్యడం తప్ప.

సంపద అక్కడ కూర్చోలేకపోయింది. అంతకంటే గాడిపొయ్యి దగ్గర కూర్చొని ఉల్లిపాయలు కొయ్యడం నయం అనిపించింది. ఎవరూ గమనించ కుండా మండువాలోకి వచ్చింది. నాలుగయిదు గ్రూపులు పేకలో మునిగిపోయి కుస్తీ పట్లు పడుతున్నారు.

ఎక్కడ చూసేదో ఆ ఎర్రటి కుర్రాడు గబగబా వచ్చి-

"మీకిక్కడ ఏమీ తోచడం లేదులా వుంది. డాబా మీదకి రండి అన్నయ్యగారిని పిలుస్తాను." అంటూ పైకి తీసికెళ్లాడు.

డాబా మీద నిశ్శబ్దంగా వుంది. కొబ్బరాకుల నీడ-చేతికి అందుతున్న కొబ్బరికాయలూ- మనిషి ప్రకృతికి దూరమైపోయి- సహజమైన అందాలనూ-ఆప్యాయతలనూ అందుకోలేక-స్వయం కృతాపరాధంతో కృత్రిమ జీవితానికి అలవాటు పడిపోయి బానిసై పోతున్నాడు. అడవి పంది మాంసం మషాళా వాసనలను వెదజల్లుతూ నాసికా పుటాలను తాకు తోంది.

"చేపలన్నీ తూ చెర్లోయేనండి. ఒకోటీ రెండు కే.జి.లకు తక్కువ లేవు."

"తిన్నదాని కంటే పారేసేదే ఎక్కువలాగుంది." అంది సంపద -గంపలతో మోసుకుపోతున్న అరిటా కుల్ని చూస్తూ.

"పారేసేదాకా వడ్డించడమే దర్జా అంటే." పేలవంగా నవ్వేసేడు ఎర్రటి కుర్రాడు. భోజనాలు పూర్తయి నట్టున్నాయి కుర్రాళ్ళు గోలగా బయ టికి వచ్చేరు చేతులు కడుక్కోడానికి.

ఒక్కళ్ళ కాళ్ళూ- సరిగ్గాభూమ్మీద ఆనడంలేదు.

నలుగురు మనుషులు గంగాళాల్లో నీళ్ళు ముంచి చేతుల మీద పోస్తున్నారు. యింకా కొంత మంది ప్రక్కన నిలబడి నమ్రతగా తువాళ్ళు అంది స్తున్నారు.

వున్నట్టుండి ఎవరికొచ్చిందో-తిక్క ఉన్న కాయ నాటి మర్కటాల్లా తోపులాట మొదలిట్టేరు. అరుపులూ, కేకలూ ఐదు నిమిషాలలో మల్లె పువ్వుల్లాంటి తెల్లని బట్టలు బురద మరకలతో జుగుప్సాకరంగా యిన్‌షర్ట్‌లన్నీ న్యూసెన్స్‌గా ఒక్కొక్కళ్ళూ అడవి పందిని తిన్నట్టు కాకుండా- ఆ లక్షణాలను ఒంట బట్టించు కొని దొర్లుతుంటే సంప దకు కడుపులో తిప్పినట్టు కళ్ళు తిరుగుతున్నట్టు అనిపించింది. తూలి పడ బోయి పిట్టగోడను పట్టుకో బోతుంటే భుజం మీద చెయ్యిపడింది.

వెనకాల ప్రభాకర్- ఎంతసేపట్నించి వున్నాడో-మొహం చిన్నబోయి వుంది. వీళ్లేనా నా భారత మాత

# రక్తపుపోటు కలవారికి కృత్రిమ ఉప్పు?

మామూలు ఉప్పులో నాట్రియమ్ ఐయాన్ రక్తపుపోటుకు మూత్రపిండాల వ్యాధికి, యితర వ్యాధులకు కారణం. ఇది లేకుండా జపాన్‌లో మొట్టమొదటి సారిగా కృత్రిమంగా ఉప్పు తయారుచేశారు. ఇలా కృత్రిమంగా తయారు-చేసిన ఉప్పు 90 శాతం వరకూ మామూలు ఉప్పు రుచినే పోలి వుంటుంది. ఈ కొత్త ఉప్పు, మెగ్నీషియం సాల్ట్‌లా చేదుగా ఉండదు. ఆరోగ్యరీత్యా చాలామంది మెగ్నీషియం సాల్ట్‌ను ఉపయోగిస్తుంటారు.

(జ. వా.)

# అంకురం

ఆశాజ్యోతులు! నా భావి భారత దేశ మేధావులూ, విద్యావంతులూ, సంపదకు భోరున ఏడవా లనిపించింది.

కానీ ఆ మేధావుల్లో తన భర్త కూడా ఒకడు.

ఏడుపు కడుపులోనే సుళ్ళు తిరుగుతూ వుండి పోయింది.

కంటిలోని తడి క్రింద పడేలోపలే ఆరిపోయింది.

ఎంతటి శోకాగ్నినైనా కడుపులో దాచుకొని కన్నీటిని ఆవిరిగా మార్చుకొని శరన్మేఘాలను సృష్టించి - యింటి పరిసరాల్లోకి దుఃఖ పుటాన్ని చేరనివ్వని తన చిన్నారి ప్రియురాలు సంపదను చూస్తుంటే ప్రభాకర్‌కి ఏదో బెదురు.

"మీరింకాయిక్కడే వున్నారా-రండి కాసేపు విశ్రాంతి తీసుకొని సాయంత్రం జీడి తోటలోకి వెళ్ళురుగాని-మన భాగ్యకారకాలు అవే." ఆ ఎర్రటి కుర్రాడు వచ్చి క్రిందకు తీసికెళ్ళేడు.

గదిలోకెళ్ళి మంచం మీద వాలింది సంపద.

"యిదిగో ఈ ఆంటీని అడుగుదాం లోపలికి రా"

ఎవరో పిల్లలు లోపలికి వచ్చేరు.

సంపదలక్ష్మి కళ్ళు తెరచి చూసింది.

తెల్లగా బొద్దుగా వున్న యిద్దరు పాపలు పుట్టి నప్పట్నుంచీ పాలకోవా, ఐస్‌క్రీం తప్ప యింకోటి తిన్నట్టు లేరు.

"ఏంటమ్మా" యిద్దర్నీ మంచం మీద కూర్చో బెట్టుకొని ముద్దుగా అడిగింది.

"అది కాదు ఆంటీ వాల్ట్ డిస్నీ పిచ్చర్ బావుంటాయా- లారెలండ్ హార్డీ పిచ్చర్స్ బావుం టాయా-మీరే చెప్పండి.

ఓ గంటసేపు వాళ్ళతో యింగ్లీషు వాగించి అలసి పోయింది సంపద.

మూడున్నరకు ప్రభాకర్‌ని గదిలోకి తీసుకొచ్చి,

టీ తెప్పించాడు ఎర్రటి కుర్రాడు. జీడి పప్పు కూడా వచ్చింది.

"మన తోటలో జీడి పప్పు. నాలుగింటికి బయ ల్దేరితే కాసేపు తోటలో తిరిగి ఒద్దురుగాని. మీ కూడా నేనే వద్దామనుకున్నానుగానీ పనుంది. పెళ్ళి కొడుక్కి ఎదురు సన్నాహం జెయ్యాలంట. మీ కూడా కుర్రాళ్ళి పంపిస్తాను. చీకటి పడకుండా వచ్చెయ్యండి."

"అలాగే"

పట్టణంలో సాయంత్రానికీ, పల్లెటూళ్లో సాయంత్రానికీ భేదాన్ని విశ్లేషించుకుంటూ నడు స్తోంది సంపద.

ఎక్కడ బడితే అక్కడ నల్లటి విగ్రహాలు, వీభూది పళ్ళలాగా రోడ్డు ప్రక్కన కూర్చొని దమ్ము ఎగర బోస్తూ ఆడుకుంటున్నారు. గుడి ప్రక్క నీడలో పదిమంది చేరి అష్టాచెమ్మా, పందాల మీద పందేలు వేసి ఆడేస్తున్నారు.

చెరువు నుండి సునాయాసంగా కలిడితో నీళ్ళు మోసేస్తున్న పదేళ్ళ పిల్లలు ఎవ్వరిలోనూ, కంగారూ, ఆతృతా, గాభరా, కనబడ్డం లేదు. నిమ్మకు నీరెత్తినట్టు తాయితీగా చెసుకుంటున్నార్పనులు. గణగణగణా బడి గంట వినిపించింది. దగ్గర్లో బడి వున్నట్టుంది పిల్లలంతా పుస్తకాల సంచులు భుజాలకు తగిలించుకొని అల్యూమినియం కేరేజీలు వూగించుకుంటూ పోతున్నారు.

"మీనాన్నడుగోనే, మీ నాన్నే పడిపోయేడు" వెనకాల ఆడపిల్లల గొంతు. ప్రక్కన పెద్దరావి చెట్టు క్రింద సిమెంటు అరుగు, మాసిన గుడ్డలతో అస్త వ్యస్తంగా కాళ్ళు ముడుచుకొని పడుకొన్న మనిషి. సంపదలక్ష్మికి అడుగు ముందుకు పడలేదు.

ఆ పిల్ల బక్క పలచటి పదేళ్ళ పిల్ల, గ్రుడ్ల నీరు క్రుక్కుకుంటూ నాటి పిల్లల మధ్య తల వంచుకొని, గడగడ వణుకుతూ అతని దగ్గరకెళ్ళి- చెయ్యి పట్టుకొని-

"రా నాన్నా, యింటికెల్పోదాం, నాన్నా లెగు, నాన్నా." ఆ పిల్ల అతణ్ణి తట్టి లేపుతోంది.

సంపదలక్ష్మి కంటి నీరు జలజలా రాలింది.

చూడలేనట్టు గబగబా నాలుగడుగులేసింది.

ప్రభాకర్ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

సంపద కళ్ళు తుడుచుకుంది.

"కన్న తండ్రిని ఆస్థితిలో చూసే ఖర్మ పిల్లలకు రావడం, ఎంత దురదృష్టకరం, అంత కంటే పిల్ల ల్లేకుండా వుండడమే మంచిది. అందుకే నేను...." సంపదలక్ష్మి మాట పూర్తి చెయ్యలేదు. ప్రభాకర్ చెయ్యి బిగుసుకుంది.

ఆ బిగింపులో ఓదార్పు వుంది. పట్టుదల వుంది. ప్రమాణం వుంది.

అతని నిశ్శబ్ద నివేదన ఆమె హృదయాన్ని తాకు తుంటే తేలికౌతున్న మనసుతో జీడితోట వైపు అడుగేసింది సంపద. □


సినిమా
నేడే!
దూరదర్శన్
— సుధాకళ్యాణి


ఈ ఏడు.. అబ్బాయికి ...అమ్మాయికి ఇద్దరికీ పబ్లిక్ పరీక్షలు! టి.వీ. అమ్మేద్దామా?


అయిదు ఎప్పుడు అవుతుందా అని చూసేవారు! ఆరున్నర అయినా కూర్చున్నారేం సార్?
టి.వి. కొని.. ఇంట్లో తద్దినం తెచ్చుకున్నా! మా పేటలో జనం అంతా ఇంట్లోనే వుంటారు! ఇవాళ చిత్రమాల వుందిగా!
వార పత్రిక


ఏమండోయ్! అన్నం వుడికింది! కొంచెం ఆ కూరమాత్రం మీరు చేసేసుకోండి! టి.వి.లో హిందీ సీరియల్ వచ్చే వేళయింది... ప్లీజ్...


పేడ పిడకలు... ప్రత్యేక కార్యక్రమం హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం సమర్పణ
అది వేరే చెప్పాలా?
SUDHAKALYANI

## బయోగ్యాస్ పరిచయం - 2

# బయోగ్యాస్ - డిజైన్‌లు

శ్రీదేశాయి డిజైన్ మొదలుకొని ఇప్పటివరకు పలురకాల డిజైన్‌లు వాడుకలో ఉన్నాయి. అవి: ఖాదీ అండ్ విలేజ్ ఇండస్ట్రీస్ కమీషన్ - బొంబాయి (కె. వి. ఐ. సి.) నమూనా, ప్లానింగ్ రిసర్చి అండ్ ఏక్షన్ డివిజన్ - లక్నోవారి జనతా నమూనా, ఇండియన్ అగ్రికల్చరల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ - ఢిల్లీవారి నమూనా, నేషనల్ ఎన్విరాన్ - మెంటల్ ఇంజనీరింగు రిసర్చి ఇన్‌స్టిట్యూట్ - నాగపూర్, స్ట్రక్చరల్ ఇంజనీరింగు రిసర్చి సెంటర్ - రూర్కీ, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ బెంగుళూరు, తమిళనాడు అగ్రికల్చర్ యూనివర్శిటీ - కోయంబత్తూరు, యూనివర్శిటీ ఆఫ్ అగ్రికల్చరల్ సైన్సెస్ - బెంగుళూరు (భాగ్యలక్ష్మి నమూనా), మురుగప్ప చెట్టియార్ రిసర్చి సెంటర్ - మద్రాస్ (జ్వాల నమూనా) మరియు ఉత్తర ప్రదేశ్‌నుండి గోబర్ గణేష్ అనే నమూనాలు. ఇవే కాక చిన్న చిన్న మార్పులతో అక్కడక్కడ మరి - కొన్ని డిజైన్‌లున్నాయి. వీటన్నింటిలో కేవలం రెండు డిజైన్‌లు మాత్రమే అత్యంత వ్యాప్తిలో ఉన్నాయి. అవి ఖాదీ మరియు జనతా నమూనాలు.

ఖాదీ గోబర్ గ్యాస్ ప్లాంటులో నాలుగు ప్రధాన భాగాలుంటాయి. అవి: డైజెస్టర్, గ్యాస్ నిలువ ఉంచటానికి కావలసిన ఖాళీ స్థలం, ఇన్‌లెట్ మరయు అవుట్‌లెట్‌లు. పేడను సమపాళ్ల నీటితో కలిపిన తరువాత డైజెస్టర్‌లోనికి తీసుకుపోవడానికి ఇన్‌లెట్ పనిచేస్తుంది. ఇదే విధంగా "జీర్ణింప"బడిన తరువాత పేడను పలచని ఎరువు రూపంలో అవుట్‌లెట్ ద్వారా బయటకు వస్తుంది. అంటే ఈ రెండింటిని కలుపుతూ మధ్యలో డైజెస్టర్ ఉంటుంది. ఈ విధంగా రోజూ ఇన్‌లెట్‌ద్వారా కొత్త పేడను పంపుతూ అవుట్‌లెట్ ద్వారా అదే మొత్తంలో బయటకు వచ్చేటట్లు ఏర్పాటు ఉంటుంది. డైజెస్టర్ సైజు మనం పేడను ఎంతకాలం (దీన్ని రిటెన్షన్ టైమ్ అంటాము) డైజెస్టర్లో ఉంచదలచుకున్నామో అన్నదానిపై ఆధారపడి ఉంటుంది. దక్షిణ భారతంలో ఉన్న రాష్ట్రాలకు 30 రోజుల రిటెన్షన్ పీరియడ్ తీసుకుంటారు. ఉత్తర భారతంలోని కొన్ని రాష్ట్రాల్లో 40 రోజులు మరికొన్ని రాష్ట్రాల్లో 55 రోజులను తీసుకుంటారు. ఈ నిర్ణయం ఆయా ప్రదేశాలలోని ఉష్ణోగ్రతపై ఆధారపడి ఉంటుంది. డైజెస్టర్‌పైన తాత్కాలికంగా గ్యాస్‌ను నిలువ ఉంచటానికి ఒక లోహపు డ్రమ్ అమరిక ఉంటుంది. ఇది ఒకవైపు పూర్తిగా తెరువబడి ఉన్న నిర్మాణం. డైజెస్టర్‌లోనున్న పేడనీటి మిశ్రమం (స్లర్రీ)పై బోర్లించబడి ఉంటుంది. గ్యాస్ ఉత్పత్తి అయినా కొద్దీ డ్రమ్ పైకి లేస్తుంది. గ్యాస్‌ను వినియోగించుకోడానికిగాను డ్రమ్‌పైన ఒక చిన్న గొట్టం ఉంటుంది. దీనినుండి పైప్‌లైన్ ద్వారా వంటశాలలోని బర్నర్‌వరకు తీసుకుపోవచ్చు. గ్యాస్ నుపయోగించినపుడు డ్రమ్ బరువుతో క్రిందకు పోతుంది. ఈ విధంగా గ్యాస్ ఉత్పత్తి అయినా కొద్దీ పైకి - వినియోగించినా కొద్దీ క్రిందకు - అస్తమానం కదలుతూనే ఉంటుంది. అందుకే దీన్ని "ఫ్లోటింగ్ గ్యాస్ హోల్డర్ ప్లాంట్" అని కూడ అంటారు. డ్రమ్ దొర్లిపోకుండా మధ్యలోనున్న గైడ్‌ఫ్రేమ్ సహాయ పడుతుంది.

జనతా నమూనాలో మాత్రం ఖాదీ నమూనాలో మాదిరిగా లోహపు డ్రమ్ ఉండదు. బదులుగా డైజెస్టర్‌తో కలిపి ఇటుకలతో నిర్మించబడ్డ అర్ధ చంద్రాకారపు నిర్మాణం (డోమ్) ఉంటుంది. అందుకే దీన్ని "ఫిక్సెడ్ డోమ్ ప్లాంట్" అని అంటారు. ఇది గ్యాస్‌ను నిలువ ఉంచడానికి తోడ్పడుతుంది. గ్యాస్ జనించినా - కొద్దీ కదిలే నిర్మాణం లేకపోవడంతో ఒత్తిడి పెరిగి డైజెస్టర్‌లోని స్లర్రీ పీడనానికి గురవుతుంది. తత్ఫలితంగా స్లర్రీ ట్యాంకులవలె నిర్మించబడ్డ ఇన్‌లెట్ మరియు అవుట్‌లెట్‌లలోకి తోయబడుతుంది. దీనివల్ల కొత్తగా ఏర్పడే గ్యాస్‌కు స్థలం ఏర్పడుతుంది. డోమ్ శిఖరాగ్రాన ఉన్న గొట్టం ద్వారా గ్యాస్‌ను వినియోగించుకున్నపుడు ఒత్తిడి - పీడనం తగ్గడంవల్ల టాంకులలోకి తోయబడ్డ స్లర్రీ మళ్లీ డైజెస్టర్‌లోకి తిరిగి వస్తుంది. ఇలా తరచుగా జరుగుతున్నపుడు గ్యాస్ ఏర్పడ్డ తరువాత మిగిలిన పదార్థాలు అవుట్‌లెట్ టాంకులోకి తోయబడినపుడు బయటకు పోవడానికున్న ద్వారం ద్వారా ఎరువు జారిపోతుంది. ఈ అమరికవల్ల జనతా ప్లాంటులో 'స్లర్రీ లెవల్' సుమారుగా ఒకేమాదిరిగా ఉంటుంది. వాస్తవానికి జనతా గోబర్ గ్యాసు ప్లాంటు అంతా భూమిలో ఉంటుంది. బయటకు కేవలం ఇన్‌లెట్ - అవుట్‌లెట్‌ల ముఖ ద్వారాలు మాత్రమే అగుపడతాయి. వీటిని కూడ రేకు, చెక్కలు లేక రాళ్లతో కప్పివేసి ఉంచుతారు. జనతా గోబర్ గ్యాస్ ప్లాంటు చైనావారి నమూనా ఆధారంగా ప్లానింగ్ రిసర్చి అండ్ ఏక్షన్ డివిజన్ - లక్నోవారు మన దేశస్థితులకు తగినట్టుగా రూపొందించారు. ఈ ప్లాంట్లను నిర్మించడానికి మామూలుగా ఇల్లుకట్టే మేస్త్రీలకు ట్రైనింగు నిస్తారు.

ప్లాంట్ల వ్యాప్తిలో వాటి నిర్మాణానికయ్యే ఖర్చు చాలా ముఖ్యమైన కారకం. ప్రస్తుతం 2 ఘ. మీ. కుటుంబ సైజు ప్లాంటుకయ్యే ఖర్చును (జనతా మూడు వేలకుపైగా - ఖాదీ నాలుగు వేలకు పైగా) చాలా ఎక్కువగా భావిస్తారు. ఖాదీ నమూనాలోని లోహపు డ్రమ్ మొత్తం ప్లాంటుకయ్యే ఖర్చులో 40 శాతం విలువ చేస్తుంది. 2 ఘ. మీ జనతా ప్లాంటు నిర్మాణానికి సుమారు 25 సిమెంటు సంచులు కావాలి. కావున ఖర్చు తగ్గించడానికిగాను దేశంలో పలుచోట్ల ప్రయత్నాలు జరిగాయి. వీటిలో డైజెస్టర్ గోడ మందాన్ని తగ్గించడం, ఫెర్రో సిమెంట్‌ను నిర్మాణంలో వాడడం, లోహపు లేక ఇటుకల డోమ్ బదులుగా కర్రల సహాయంతో నిర్మించిన పాలిథీన్ డోమ్‌ను ఉపయోగించడం, డైజెస్టర్‌ను కూడ ఇనుప ఊచల సహాయంతో పాలిథీన్‌ను ఉపయోగించడం



వ్యాప్తిలోనున్న ప్లాంటు నమూనాలు- వివరాలు




సులభంగా బోధించడానికి
చేయబడ్డ చిన్న జనతా ప్లాంటు నమోనా

లాంటి ప్రయోగాలు, ప్రయత్నాలు జరిగాయి – విజయవంతంగా పని కూడ చేస్తున్నాయి. లోహపు డ్రమ్ము హమేషా స్లర్రీ పైకి క్రిందకు కదులుతూ మరియు వాతావరణంతో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకోవడంవల్ల చెడిపోయే ప్రమాదం ఉంది కావున ప్రతి యేటా పెయింటు వేయాలి. ఈ సమస్యను 'వాటర్ జాకెట్' ద్వారా కొంతవరకు మెరుగు పరచవచ్చు. ఈ విధానంలో డ్రమ్‌పేడలో పైకి క్రిందకు కదిలే బదులుగా డైజెస్టర్ పై భాగపు అంచులో కట్టిన గాడిలో గల నీటిలో పైకి క్రిందకు కదులుతుంది. ఈ నీటిపై 'బర్న్ట్ ఆయిల్' వేసినపుడు తేలి డ్రమ్ కదులుతున్నపుడు దానిపై పల్చని పొర నేర్పరచి డ్రమ్ తొందరగా చెడిపోకుండా తోడ్పడుతుంది. అంతేకాక నీటిని కూడ బాష్పీభవనం చెందకుండా ఆపుతుంది. ఈ పద్ధతిలో డైజెస్టర్‌లోని పదార్థాలు కంటికి అసలే అగుపడవు.

జనతా నమోనాలో మాత్రం డోమ్ నిర్మాణం చాలా ముఖ్యమైనది. సూచనలను ఏమాత్రం నిర్లక్ష్య పరచకుండా నిర్మిస్తే ఎలాటి సమస్య ఉండదు. క్రమం తప్పకుండా రోజూ పేడను సమపాళ్లలో నీళ్లతో బాగా కలిపి ప్లాంటులో వేస్తుంటే ఆశించిన ఫలితాలను చక్కగా చూపుతాయి.

వ్యాసం, ఫొటోలు, బొమ్మ:
టి. సంపత్‌కుమార్

(పైవారం: బయోగ్యాస్ – ఇతర పదార్థాల ఉపయోగం)



పని చేస్తున్న ఖాదీ నమోనా ప్లాంటు

# పడమటి సంధ్యారాగం

## ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

ఎవరో ఒక నలభై ఏళ్ల స్త్రీ, తాను వెంకటేశ్వరస్వామిని వివాహం చేసుకున్నానని, తానతని భార్యననీ ప్రచారం చేసుకుందిట. ఈ ఊరివాళ్ళు వెళ్ళి ఆ స్త్రీని సకల మర్యాదలతో తీసుకొచ్చి, శివాలయంలో దింపారు.

ఇహ ... భక్తులంతా తండోపతండాలుగా వెళ్ళటం ... చెంపలు పగలేసుకుంటూ సాష్టాంగపడి పోవటం ... స్వామి ఆమెనెలా పెళ్ళి చేసుకున్నాడో అడిగి చెప్పించుకుని, తన్మయత్వంతో వినటం ...

ఆవిడ పేరు బాలసరస్వతి.

"ఒక రోజు స్వామి నాకు కలలో కనపడి, నా మీద మనసుందని, నన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పారు. తెల్లారి లేచి చూస్తే పక్కలో మంగళసూత్రాలున్నాయి. వాటిని కళ్ళ కద్దుకుని అందరికీ చూపిస్తే ... భక్తులంతా స్వామి విగ్రహంతో నా కళ్యాణం జరిపించారు" అంటూ తన మెడలో సూత్రాలు తీసి చూపించింది బాలసరస్వతి.

"స్వామి నీకు కనపడతాడమ్మా?" అన్నారు భక్తులు గొప్ప ఇమేజ్‌తో ఆమెను చూస్తూ.

"ఆఁ ప్రతి రాత్రీ నా దగ్గరకొచ్చి, భర్తలాగే నన్నలరిస్తారు. ఇదంతా నేను చెప్పినా మీకు అర్థం కాదు. మీకు ఎగతాళిగా ఉండొచ్చు కూడా. కానీ "ఇదో రకమైన అద్భుత భావన. అనుభవిస్తే తప్ప తెలీదు".

బాలసరస్వతికి నలభయ్యేళ్ళు దాటాయి. ముందు వరస రెండు పళ్ళు వూడాయి. చాలా అనాకారిగా ఉంటుంది.

మెడలో పచ్చని పసుపుతాడు. కాళ్ళకు కొత్త మట్టెలు. ఎప్పుడూ తలంటుకుని, పాపిట్లో కుంకుమ దిద్దుకుంటుంది. నిజ జీవితంలో ... అన్నేళ్ళొచ్చినా ఆవిడకు పెళ్ళికాలేదు. వృద్ధ కన్యగా అందరి హేళనలు, అవమానాలు ఎదుర్కోలేక, మూర్ఖ ప్రజల నుంచి తప్పించుకోటానికామె ఈ మార్గం ఎన్నుకుని ఉండాలి. లేదా బ్రతుకుతెరువు కోసం. అదీ కాకుంటే ... ప్రజల అమాయకత్వాన్నీ, మూర్ఖత్వాన్ని క్యాష్ చేసుకోటం కోసం ...

ఖచ్చితంగా వీటిల్లో ఏదో ఒకటి అయి ఉండాలి. కానీ ... భక్తులెవరూ ఇలా ఆలోచించరు. ఆలోచిస్తే వాళ్ళు భక్తులవరు.

ఒక్కొక్క రోజుకు ఒక్కొక్కరు చొప్పున ఆమెను తమ ఇంటికి ఆహ్వానించసాగారు వాళ్ళు.

"ఆవిడ ఈ గుళ్ళో నుంచి బయటకొస్తే మేమెళ్ళి ఆమె చెయ్యి పట్టుకుంటాం. వెంకటేశ్వరస్వామి వచ్చి తన భార్యను, రక్షించుకుంటాడేమో, అలా అయినా మనకాయన దర్శనభాగ్యం లభిస్తుంది," అన్నారు కొందరు కుర్రవాళ్ళు.

దీనితో భయపడి, ఆమెను తీసుకొచ్చిన వాళ్ళు, ఆమెనెవరింటికీ పంపకుండా అందర్నీ గుడిలోకే వచ్చి దర్శనం చేసుకోమన్నారు.

ఇదంతా తనకు విజయ చెప్పింది. ఇద్దరూ కలిసెళ్ళి, బాలసరస్వతిని చూసి వచ్చారు.

ఆమెను తమ ఇంటికాహ్వానిస్తానని, పూజలు చేస్తానని, పూజకు కావలసిన సరుకులు లిస్టు రాసి తనకిచ్చింది అమ్మ. తను ఆ సరుకులు తేకుండా 'నీకేమన్నా మతిపోయిందా? ఇలా అయితే వెంకటేశ్వరస్వామి భార్యల లిస్టులో బాలసరస్వతిని కూడా చేర్చాలా? అలివేలుమంగ, బీబీనాంచారి, పద్మావతి, బాలసరస్వతి ...

ఇంకా ఎందరు సరస్వతులాయన్ను పెళ్ళాడుతామంటారో. ఆయన మనిషి రూపంలో భర్తగా రావటమేమిటి? చేతి నిండా పనిలేక ... మీరు ఈ గాలి వార్తలన్నీ నమ్మేసి, ఇలాంటి పిచ్చి పనులు చెయ్యటం.

ఆవిడను వ్యక్తిగా మనింటికి పిలిపించి, నువ్వు పసుపు, కుంకుమతో చీర పెడతానంటే నాకేం అభ్యంతరం లేకపోను. ఇలా దేముడనీ, దేవతనీ చెప్పి ఆహ్వానించి, పూజలు చేస్తానంటే మాత్రం నేను చచ్చినా ఒప్పుకోను." అంటూ ఆ సరుకుల చీటీ చించేసింది తను.

అప్పటి నుంచీ సమయం దొరికినప్పుడల్లా ఆ విషయాన్ని పట్టుకొచ్చి ఇలా దెప్పుతూనే ఉంటుందీవిడ!

పాపం! ఆ బాలసరస్వతి పెళ్ళి కాక ... ఏళ్ళు పైబడ్డా కన్యగా మిగలలేక ... వృద్ధ కన్య అనే బిరుదులూ, హేళనలూ భరించలేక ఇలా వెంకటేశ్వరస్వామి వెనకాల దాక్కోటానికి ప్రయత్నిస్తోంది.

ఆనాడు హేళన చేసిన జనమే ఈ రోజు సాష్టాంగపడి దణ్ణాలు పెడుతున్నారు!

"ఈ సారి ఎవరన్నా వస్తే వెడుదుగాన్లే. ఇహ సాధించకు. అన్నం పెట్టు ఆకలేస్తోంది." అన్నది ఛాయ.

* * * * * *

కాలేజీలో స్టూడెంట్స్ ఎలెక్షన్స్ దగ్గర కొచ్చేశాయి... వాళ్ళలో చైతన్యం బయలుదేరింది.....

"రాజీవ్, ఈసారి నువ్వు ప్రెసిడెంటుగా పోటీ చెయ్యి." అన్నాడు నిషాద్.

అతను రాజీవ్ ఫ్రెండ్. బాగా డబ్బున్నవాడు.

"నేను పోటీ చెయ్యాలా!" అన్నాడు రాజీవ్.

"అవును. ఎందుకంత ఆశ్చర్యం?"

"నువ్వెందుకు చెయ్యకూడదూ అని..."

"కొన్ని కారణాల వల్ల నేను నిలబడటం లేదు. నా తరుఫున నిన్ను నిలబెడుతున్నాను. డబ్బూ ... నీతోపాటు ప్రచారం వగైరాలు నేను చూసుకుంటాను. నీకేం రిస్కుండదు."

**జరిగిన కథ—7:** ఇందుకూరు కాలేజీలో ఛాయ లెక్చరరుగా చేరింది. ఆమె వెంట తల్లి అన్నపూర్ణమ్మ, తమ్ముడు రాజీవ్ ఇందుకూర్ వచ్చేసారు. సుధీర్ ఛాయ వాళ్ల మేడమీద గదిలో ఉంటుంటాడు ఛాయ కుటుంబానికి విజయ కుటుంబానికి సన్నిహితం ఏర్పడింది సుధీర్ ఛాయను ప్రేమిస్తాడు ఛాయ మేనమామ ఛాయను పెళ్లి చేసుకుంటానని ఛాయ తల్లితో చెపుతాడు. ఛాయ అందుకు నిరాకరించిందని అతను కోపంగా వెళ్ళిపోతాడు విజయ చెల్లెలు రేణు పెళ్లికి వెళ్లివస్తారు సుధీర్, ఛాయ, రాజీవ్. పెళ్ళిన అనసూయ రాజీవ్‌కు ప్రేమలేఖ రాసింది. రాజీవ్ అనసూయకు రాసిన ఉత్తరం ఆమె తండ్రి చేతిలో పడింది అది ఛాయ అన్నపూర్ణమ్మ దృష్టికి వచ్చింది అనసూయవాళ్ళు ఇల్లు ఖాళీ చేసి వెళ్లి పోయారు. ఛాయ తన స్టూడెంటు లీల పడే కష్టాలు చూసి జాలి పడుతుంది. అన్నపూర్ణమ్మ మరిది కొడుకు శ్రీనివాస్ వచ్చాడు శ్రీనివాస్ లీలల పెళ్లి ఇందుకూరులో జరిగి పోయింది సుధీర్ ఛాయ నోట వెంటే ఆమె కూడా తనను ప్రేమించిందనే ...గలి వినగలిగాడు




"నేను నీకు 'డూప్' అన్నమాట."

"అరే ఇడియట్. ఎందుకలా మాట్లాడతావ్? నిజమైన స్నేహితుల మధ్య ఇలాంటి అపార్థాలు, అనుమానాలూ ఉండవు."

"సరే కానివ్వు. ఇదీ చూద్దాం. నిన్నెందుకు హర్ట్ చెయ్యాలి." అన్నాడు రాజీవ్ ఉత్సాహంగా.

ఆ కాలేజీలో డైరెక్టు ఎలక్షన్స్ లేవు.

ముందుగా సి. ఆర్ ల ఎలక్షన్...

తన క్యాండిడేట్స్‌ని అన్ని క్లాసుల్లోనూ నిలబెట్టాడు రాజీవ్. రాజీవ్, నిషాద్ వె-ందలైన వాళ్ళంతా జోరుగా ప్రచారం సాగించారు....

అపోజిషన్ పార్టీవాళ్ళైన నాగరాజు వర్గం కూడా బలమైనదే.

బి. ఎ. ఫైనలియర్‌లో అరవైమంది విద్యార్థులున్నారు. వాళ్ళలో పదిమంది అమ్మాయిలు....

మగవాళ్ళలో సగం ఓట్లు ఖచ్చితంగా తనకే పడతాయని నమ్మకముంది రాజీవ్‌కి.

అమ్మాయిల దగ్గరకెళ్ళి రిక్వెస్ట్ చేశాడు. "తప్పకుండా మీకే వేస్తాం". అన్నారు వాళ్ళు.

# పడమట సంధ్యారాగం

"గురూ వాళ్ళని నమ్మకు. నాగరాజు వర్గం వాళ్ళక్కాడ, వాళ్ళింత సిన్సియర్‌గానే చెపుతారు. ఛస్తే బయటపడరు." అన్నాడు నిషాద్.

నూర్జహాన్ అనే అమ్మాయి మాత్రం "నేను నాగరాజుకు మాటిచ్చేశాను." అన్నది ఫ్రాంక్‌గా.

ఆ అమ్మాయితో పాటు ఇంకో రెండు ఓట్లు కూడా పోతాయి. నూర్జహాన్, ఇంకో ఇద్దరమ్మాయిలూ ఎప్పుడూ అంటుకుపోయే ఉంటారు. ఒకళ్ళేపని చేస్తే మిగిలిన ఇద్దరూ అదే పనిచేస్తారు.

మనకే పడతాయి అనుకుంటే అదో లాంటి రిలీఫ్. ఖచ్చితంగా పడవు అని తెలిస్తే మరీ బాధ.

"నువ్వు వర్రీ అవకు రాజీవ్. నూర్జహాన్ లవరు నాగరాజు వర్గంవాడు. వాడిని పట్టుకున్నామంటే ... ఈవిడతో సహా ఆ రెండు ఓట్లూ మనకే." అన్నాడు నిషాద్.

నూర్జహాన్ లవర్ అక్బర్‌ను పట్టుకుని దువ్వి నేర్పుగా తమ వేపు తిప్పుకున్నాడు రాజీవ్.

"నా ఓటు ఖచ్చితంగా మీకే. అయితే ఒక చిన్న లింకుంది. ఇలా సడన్‌గా నేను మీ వేపు తిరిగితే బాగోదు. వాళ్ళు నన్ను బతకనివ్వరు. అందుకని, ప్రచారం వాళ్ళ తరఫున చేస్తాను. నా ఓటు మాత్రం నీకే వేస్తాను. నాతో పాటే నూర్జహాన్...." అన్నాడు అక్బరు.

"నిన్ను నమ్మటం ఎలా?" అన్నాడు నిషాద్.

"అరే భాయీ, నా మాటమీద నమ్మకం లేదా?"

"రాజకీయాల్లో నమ్మకాలకు చోటెక్కడుంది? నువ్వు మాకె వేశావో లేదో ఎలా తెలుస్తుంది?" అన్నాడు రాజీవ్.

"నీ నంబర్ పక్కన నేను నక్షత్రం గుర్తు పెడతాను దే నా ఓటు. సరేనా?" అన్నాడు అక్బర్.

ఆ తరువాత నూర్జహాన్ తనంతట తనే వచ్చి, తమ ఓట్లు, రాజీవ్‌కే వేస్తామని చెప్పింది.

"నే చెప్పలా?" అన్నాడు నిషాద్ నవ్వుతూ.

ఆడపిల్లల్లో కొందరమ్మాయిలగు ఛాయ అంటే విపరీతమైన అభిమానం అని, ఆమెమాటకు వాళ్ళు బాగా విలువ ఇస్తారని తెలుసుకుని అక్కడగ్గర వెళ్ళాడు రాజీవ్.

'నీకీ రాజకీయా లెందుకురా? హాయిగా చదువుకోక? నాకయితే అస్సలిష్టం లేదు." అన్నది ఛాయ.

"ఉండక్కా, ఇప్పుడా నన్ను వెనక్కిలాగేది? నీకెందుకు నేను చదువుతాగా. అంతగా అయితే....."

"మార్చి పోతే సెప్టెంబరుంది. అంటూ అందించింది ఛాయ.

"ఛా. మరీ అంత అన్యాయంగా మాట్లాడకు. నా ఉద్దేశ్యం అదికాదు. అంతగా అయితే రాత్రులు నిద్రపోవటం మానేసి చదివి, ఫస్ట్‌క్లాస్ తెచ్చుకుంటాను." అన్నాడు రాజీవ్.

ఛాయను ఒప్పించాక "అమ్మయ్య, ఆడపిల్లల్లో ఇంకో ముగ్గురి ఓట్లకు ధోకాలేదు." అనుకున్నాడు రాజీవ్.

చచ్చేంత టిన్షన్......

తిండిలేదు.... నిద్రలేదు....చదువులేదు...ఇదేయావ! డబ్బు విరజిమ్మేస్తున్నారు....

అయినా అపనమ్మకం....

ఎవళ్ళకి వాళ్ళే దీన్నో ఛాలెంజ్‌గా.. ప్రిస్టేజ్ ఇస్యూగా తీసుకుంటున్నారు....

ఎంత నమ్మకమున్నా... గెలిచేవరకూ సస్పెన్సే.

ముస్లిమ్స్ శుక్రవారం అబద్ధమాడరని...హిందువులు శనివారం అబద్ధమాడరని ఊహించుకుంటూ... వారం వర్జ్యం చూసుకుని మరీ వెళు

తున్నాడు రాజీవ్.....

నాగరాజు పార్టీ లోని కొందరు బలహీనుల్ని పట్టుకొచ్చి, హోటళ్ళకు తీసికెళ్ళి తెగ మేపుతున్నాడు. వాళ్ళ గొంతెమ్మ కోరికలని తీరుస్తున్నాడు....

తన వాళ్ళు కూడా నాగరాజుకు ఇలాగే లొంగుతున్నారేమో అనే అనుమానం త్నలలో దూరి పురుగులా తొలుస్తోందతన్ని....

స్టూడెంట్స్ రూముల్లో తెల్లవార్లూ లైట్లు వెలుగుతున్నాయి...

మీటింగులూ.. డ్రింక్స్.... తిండి..

అన్నీ గదుల్లోనే, కొంపలకు పోయేది లేదు.

"వీడికి జబ్బుపట్టుకుందేమిటో? తిండి తినడు, కొంపకురాడు. ఏంగొడవలు తెచ్చుకుంటాడో." అంటూ అన్నపూర్ణమ్మ ఒహటే గోల.

ఛాయకూ భయంగానే ఉంది. 'ఈ టైంలో ఏం చెప్పినా వాడువినడు. అసలలా వెనక్కి లాగకూడదు కూడా.

కానీ.. ఈ ఒక్కసారి. లైఫ్‌లో మళ్ళీ ఈ అనుభవం, సరదా ఉండక పోవచ్చు.' అనుకునేదామె.

"ఆ రూముల్లో కూచుని అంతా తాగుతారట గదా? వీడికీ అలవా తుందేమో!" అన్నపూర్ణమ్మ భయం.

నిజానికి రాజీవ్ బుద్ధిమంతుడే కావచ్చు. కానీ... చుట్టూరా అంతా తాగుతుంటే వీడు బుద్ధిగా ఉంటాడా? ఎప్పుడూ తాగని వాళ్ళు కూడా ఈ టైంలో అక్కడ జేరితాగేస్తారు. అదే సోషల్ మొరాలిటీ యొక్క ప్రభావం. ఇండివిడ్యుయాలిటీ కక్కడ స్థానం లేదు.

ఛాయ అనుమానాలు విని "మీవన్నీ అర్థం లేని భయాలు. వీటితో అతనిలో ఉత్సాహాన్ని చంపెయ్యకండి. నేను కూడా అవన్నీ అనుభవించిన వాణ్ణే. ఆ టెన్షన్‌లో ఎంత థ్రిల్ ఉంటుందో మీకేం తెలుసు? అతనికేం జరగదు. తప్పకుండా గెలుస్తాడు కూడా. మీరూ మీ అమ్మగారి లాగే ఫీలవుతా రేమిటి?" అన్నాడు సుధీర్.

*　*　*　*　*　*

"రాజీవ్... మీవాళ్ళలో ఒకణ్ని చీలగొట్టి , సి. ఆర్‌గా నిలబడమని ప్రలోభ పెడుతున్నారు నాగరాజు వర్గంవాళ్ళు. వాడి చేతిలో కొన్ని ఓట్లున్నాయి. వాడు గెలవటం అసాధ్యమైనా.. ఓట్లు చీలిపోయి, మీ గెలుపుకు దెబ్బతగలొచ్చు. కేర్‌ఫుల్‌గా ఉండండి." అన్నాడు కల్యాణ్ అనే లెక్చరరు. అతను రాజీవ్ మద్దతుదారు.

ఇరవై నాలుగ్గంటలూ ఆ వ్యక్తిని వెయ్యికళ్ళతో కాపాడ సాగారు. ఆ వ్యక్తి పేరు భాస్కర్.

"వాళ్ళు నాకు డబ్బిస్తా మన్నారు. మీరేమిస్తారు?" అన్నాడు భాస్కర్.

భాస్కర్ ఎంత నీచుడయినా... ఆ సంగతంత స్పష్టంగా తెలుస్తున్నా.. అతని కాళ్ళు పట్టుకోక తప్పదు ప్రస్తుతానికి.

"నీ కెంత కావాలో తీసుకో." అన్నాడు రాజీవ్.

"నేను వాళ్ళ దగ్గర డబ్బు తీసుకున్నాను. వాళ్ళు నన్ను బతకనివ్వరిది తెలిస్తే." రాజీవ్ దగ్గర నోట్లు అందుకుంటూ కక్కుర్తిగా అన్నాడు భాస్కర్.

"నువ్వీ రూంలో ఉండు. నీ క్కావలసినవన్నీ ఇందులోనే ఉన్నాయి. మేం దీన్ని బయట లాక్ చేస్తాం. ఓటు వెయ్యటానికి నిన్ను కారులో తీసికెళ్ళి, ఓటేశాక నిన్ను మీ ఊరు బండెక్కిస్తాం. కొన్ని రోజులు పోయాక ఒద్దుగాని. జాగ్రత్త. ఏమన్నా ఎడ్వెంచర్స్ చెయ్యబో యావో.... మక్కెలిరుగుతయ్." అన్నాడు నిషాద్.

భాస్కర్‌ని బంధించాక కాస్త ఊపి రాడినట్లయింది వాళ్ళకి.

ఎలక్షన్ రెండు రోజుల్లో కొచ్చేసింది..

అనుమానం. ఒకరి మీదొకరి కనుమానం! ఇంత క్లోజ్‌గా ఉంటూనే తన నెక్కడ ముంచేస్తాడో అని అభిమానం!

మానవ ప్రవృత్తే అంత.

తనకు ఖచ్చితంగా పడతాయనుకున్న ఓట్లమీద కూడా అనుమానమే. వాళ్ళు ఏ ఒత్తిడికి, ప్రలోభాలకూ లొంగిపోతారో అని భయం....

రాజీవ్ కాండిడేట్స్‌లో ఒకతనికి ఇంటి దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది. "ఫాదర్ ఎక్స్‌ప్యైర్డ్"... అని.

అదిరిపోయి ప్రయాణ మయ్యాడతను.

తెల్లారితే ఎలక్షన్....

మతి పోతోంది రాజీవ్‌కి. ఏం చెయ్యాలో తోచటల్లేదు.

ఉన్నట్టుండి "హుర్రే!" అన్నాడు నిషాద్.

చివ్వున తలెత్తి "ఏమిటి? ఏమయింది? ఏం చేద్దాం?" అంటూ అతన్ని పట్టుకు ఊపేశాడు రాజీవ్.

"ఇది దొంగ టెలిగ్రాం అయి ఉంటుంది. అవతలి పార్టీవాడుపయోగించిన ట్రిక్ ఇది."

రాజీవ్ మొహంలోకి ఆశ పాకి వచ్చింది.

"నిజంగానా?" అన్నాడు.

"ఔను గురూ. నువ్వుండు నే చూస్తాను." అంటూ ఆ కాండిడేట్‌తో "నీ ట్రైన్ రింకా టైముంది గదా. ఈలో గా మీ ఊరుకు ట్రంక్‌కాల్ చేద్దాం." అని ఒప్పించాడు నిషాద్.

కాల్ బుక్ చేశారు. లక్కీగా... త్వరగానే అందింది.

అతని తండ్రే మాట్లాడాడు. తను బతికుండగానే చచ్చాడని టెలిగ్రాం ఇచ్చిన వాడిని చెడ తిట్టాడు....

"అమ్మయ్య!" అనుకున్నా రప్పటికి.

*　*　*　*　*　*

ఎలక్షన్ పూర్తయింది.

కౌంటింగ్ జరుగు తోంది. రక్తం ముఖంలోకి పొంగు కొస్తోంది విద్యార్థులకు....

నాగరాజు వర్గం వాళ్ళకన్నా నాలుగు ఓట్లు ఎక్కువ వచ్చాయి, రాజీవ్‌కి. కానీ... ఆ నాలుగూ చెల్లని ఓట్లు. కాంప్లికేటెడ్‌గా ఉన్నాయవి.

పోతే... చెరిసగం ఓట్లు పడ్డాయన్నమాట.

ఎవరు నెగ్గినట్లు?

టాస్ వెయ్యాలని నిర్ణయించారు. బొమ్మ పడితే రాజీవ్ బొరుసు పడితే నాగరాజు.

రూపాయి నాణాన్ని ఎగర వేశారు....

చచ్చేంత టెన్షన్. దానివేపు చూడాలంటేనే భయం...

"బొరుసు... బొరుసు..." అన్నా రెవరో.

కళ్ళు గట్టిగా మూసుకున్నాడు రాజీవ్.

"బొమ్మపడింది. రాజీవ్ నెగ్గాడు." అన్నాడు లెక్చరర్.

రాజీవ్ నిలబెట్టిన సి. ఆర్. లల్లో ముగ్గురు ఓడిపోయారు. మిగిలిన






### పి. ఎల్. వి. ఏ. – కంకటావ.

★ నాకు 25 సంవత్సరములు. 2 సంవత్సరముల నుండి కళ్లె వచ్చుచున్నది. మందులు వాడినా తగ్గలేదు రక్త పరీక్ష చేసి రక్తములో మార్పు లేదని చెప్పినారు

● మీరు కఫ పరీక్ష, ఛాతీ ఎక్స్–రే తీయించి వైద్యులకి చూపించండి బ్రాంకి ఎక్టేసిస్ గాని, క్షయరోగం గాని ఉన్నప్పుడు ఇలా కఫం వచ్చే అవకాశం ఉంటుంది. రోగ నిర్ధారణ ప్రకారం మందులు వాడ వలసి ఉంటుంది

### పి. డి. – గుడివాడ.

★ నా వయస్సు 35 సంవత్సరములు 3 నెలల క్రితం గర్భ సంచికి పుండు వుందని ఆపరేషన్ చేసి తీసివేశారు. నాకు వివాహము కాలేదు. ఆపరేషన్ అయిన దగ్గర నుండి కడుపు ఉబ్బరము, కాళ్లు లాగటము , చెమట పట్టటం మొదలైనవి వచ్చాయి హఠాత్తుగా బహిష్టు ఆగిపోవటం వలన యిలా వస్తాయా?

● హార్మోనుల ప్రభావంవల్ల పై లక్షణాలు ఏర్పడే అవకాశం ఉన్నా కాలగతిలో శరీరం వీటికి అలవాటు పడిపోతుంది మీరు ఆపరేషన్ చేసిన డాక్టర్లని మళ్ళీ కలుసుకున్నారా?

### యం. వి. యస్. – దర్శి.

★ మా అమ్మగారికి 50 సంవత్సరములు వుంటాయి. రెండు కాళ్లకు నీరు వచ్చి సుమారు 10 సంవత్సరము లయినది. కాళ్లు బాగా వాపుగా వున్నాయి. బిళ్ల లు వాడినప్పుడు తగ్గి మరలా మామూలుగానే వుంటున్నది

● మూత్ర పిండాల రోగాలు, హృద్రోగాలు, లివర్‌లో రాగల రోగాల వల్ల ఇలా కాళ్ళకి నీరు పట్టడం జరుగుతుంది రోగ నిర్ధారణ ప్రకారం చికిత్స జరగవలసి ఉంటుంది మీ అమ్మగారిని దగ్గర ఉన్న ఫిజీషియన్లకి చూపించండి

### పి. వి. జె. ఆర్. – కాకినాడ

★ ఎమీబియాసిస్ అంటే ఏమిటి? దాని లక్షణములను, నివారణో పాయములను చెప్పగోర్తాను

● ఎంటమిూబా హిస్టోలిటికా అనే అమీబాలు జీర్ణకోశంలో చేరి జిగటు విరేచనాలను కలుగజేయటమే అమీబియాసిస్ అంటే!

వీటి వల్ల జిగట విరేచనాలే గాక, కడుపు నెప్పి, లివర్ వాపు, కఫం, మెదడువాపు మొదలయిన అవాంతరాలు వచ్చే అవకాశం ఉంది.

వైద్యుల సలహా ప్రకారం మందులు వాడాలి.

పరిశుభ్రమైన నీటిని బాగా కాచి వడకట్టి త్రాగటం, వ్యక్తిగత పరిశుభ్రత, కాయగూరలను బాగా కడిగి వాడటం, మరుగుదొడ్ల సక్రమ నిర్మాణం, ఆహారం సరఫరా చేసే వారిని పరీక్షించటం అదనంగా తీసుకోదగిన జాగ్రత్తలు.

## ఎడమట సంధ్యారాగం

క్లాసుల్లో కౌంటింగ్ జరుగుతోంది. గెలిచిన సి. ఆర్ లు ఒక గదిలోకి పంపబడ్డారు...

అక్కడ మళ్ళీ బేరాలు.... మంతనాలు.... ఎవరూ చూడకుండా చాకు బయటకు లాగి చూపించి అర్భకుల్ని బెదిరించటాలు.... అర్థింపులు... ఆశపెట్టటాలు....

అందితే జుట్టు. అందకుంటే కాళ్ళయినా పట్టుకోవాలనేంత తపన....

మొత్తానికి రాజీవ్ ప్రెసిడెంట్‌గా నెగ్గాడు....

బయట విద్యార్థుల్లో నుంచి కేకలు.... ఈలలు... చప్పట్లు...

జయ జయ ధ్వానాలు ఒక వేపునుంచయితే....

తమవాడే నెగ్గుతాడని తెచ్చుకున్న పూలమాలలు తెంచేసి, అవమానంతో ఓడిపోయినవాళ్ళు తిట్టేతిట్లు... అనుమానమున్న ప్రతివాడినీ "డబ్బుతిని మోసం చేశారు." అని బూతులు తిట్టుకోటం... రెండో వేపు నుంచి.

బయట కొచ్చిన రాజీవ్‌ని చేతులమీద ఎత్తేశాడు నిషాద్.

అతని చుట్టూ చేరి డ్యాన్స్ చేస్తూ... ఈలలు వేస్తూ పూలతో, అభినందనలతో ముంచెత్తుతున్నారు స్టూడెంట్స్.

అంతా కలిసి కాలేజీ కాపస్‌లో గుమిగూడారు.

తమ డబ్బుతిని, ఖచ్చితంగా రాజీవ్‌కే ఓటు వేశాడని, ఆ సంగతి బుజువైందని తిడుతూ ఒకడి కాలర్ పట్టుకున్నాడు ఓడిపోయిన సి. ఆర్.....

ఉద్రేకాలు పెరిగిపోయాయి...

కేకలు... గోల... తన్నుకోటం... రాళ్ళు విసురుకుటం... పూర్వపు కక్షలన్నీ బయటకు తవ్వి తీయటం...

గోల గోలగా తయారయిన ఆ వాతావరణంలోకి పోలీసులు రంగప్రవేశం చేశారు...

స్వల్పంగా లాఠీచార్జీ, బాష్పవాయువు లాంటి ప్రయోగాల తరవాత పరిస్థితి కాస్త అదుపులో కొచ్చింది.

ప్రెసిడెంట్‌ను ఊరేగించటం అనే ప్రయత్నం విరమించుకున్నారు

రాజీవ్ ఇంటికి చేరిందాకా ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని కూర్చుంది ఛాయ.

అతను వచ్చేశాక "అబ్బ! చచ్చి బతికినంత పనయిందిరా. నీకు కాదు. నాకూ, అమ్మకీ." అంటూ నవ్వింది.

తల్లి దిష్టితీసి పడేస్తుంటే నవ్వాపుకోలేకపోయాడు రాజీవ్.

ఆ రోజు ఆ ఇంట్లో నవ్వులు పూలజల్లులా కురిశాయి.

(ఇంకా ఉంది)






**రా**మశాస్త్రికి ఆ రోజు వంట్లో బావుండక ఇంట్లోనే ముసుగు తన్ని పడుకున్నాడు ఆ రోజునే కాదు, గత కొన్ని రోజులుగా ఆయన ఆరోగ్యం బావుండటం లేదు.

అప్పుడు ఉదయం ఎనిమిది గంటలు దాటు-తున్నది. కిటికీలో నించి పలుచని ఎండ ఆయన మీదకు పడుతోంది.

**వరండాలో ఎవరివో మాటలు అయనకి వినిపిం**చాయి. ఆ మాటలు చంద్రశేఖరానివిగా ఆయన గుర్తించాడు.

క్షణం తర్వాత చంద్రశేఖరం లోపలికి వచ్చి "గురువుగారూ... మీ ఆరోగ్యం ఎలావుంది?" అనడిగాడు మంచం దగ్గరగా నిలబడి.

"ఏమీ మార్పు లేదు. ఈ రోజు కూడా వీలుపడదు. రేపు ఉదయం కనపడు..." అన్నాడు నీరసంగా రామశాస్త్రి.

"సర్లెండి. వస్తాను." అని వెళ్ళిపోయాడు చంద్ర-శేఖరం.

అతని వయసు పదహారు. అతను రామశాస్త్రి దగ్గర మంత్రాలు నేర్చుకుంటున్నాడు. అతను పదవ తరగతి పూర్తి చేసిన తర్వాత చదువుమానేసి వైదిక వృత్తిలోకి దిగిపోయాడు

అతను బయటకు వెళ్ళగానే రామశాస్త్రికి ఆయన పెద్దకొడకు నిరంజనం గుర్తుకు వచ్చాడు.

నిరంజనం కూడా పదేళ్ల క్రితం పదవ తరగతి పూర్తి చేశాడు. అప్పుడే రామశాస్త్రి అతన్ని తన దగ్గర మంత్రాలు నేర్చుకుని తన వృత్తినే స్వీకరించ-మని అడిగాడు.

నిరంజనం నవ్వి "పురోహితమా?" అన్నాడు.

"అవును. ఇప్పుడు నువ్వు పై చదువులు చదివినా మంచి ఉద్యోగం ఏదైనా వస్తుందనే నమ్మకం ఏముంది?" అన్నాడు రామశాస్త్రి.

"రాదనే నమ్మకం కూడా లేదుకదా... పిలక పెట్టుకుని మంత్రాలు చదవటం నావల్ల కాదు. మంత్రాల గురించి నా దగ్గర ఇంకోసారీ మాట్లాడకు' అన్నాడు.

తల్లి కూడా కొడుకునే సపోర్టు చేసింది.

"మీ వృత్తిమీద ఇప్పుడు గౌరవం తగ్గి పోతోంది.. వాడ్ని ఏదయినా వేరే ఉద్యోగం చెయ్యనివ్వండి." అన్నది...

"నీకు తెలీదు. ఎంత గౌరవం తగ్గిపోయినా ఇది స్వతంత్రమైన వృత్తి. తిండికి లోటు లేనిది. వాడ్ని చెడగొట్టకు" అన్నాడాయన.

అయినా ఆమె వినలేదు. నిరంజనాన్ని ఇంటర్‌లో చేర్పించింది పట్టుదలతో. అతను కూడా ఎంతో ఆసక్తిగా కాలేజీలో చేరాడు. కొడుకు కాలేజీ చదువు అదనపు భారమే అనిపించినా నిరంజనం ఏదో గొప్ప ఉద్యోగస్తుడవుతాడనే ఆశతో రామశాస్త్రి మవునం పూనాడు.

కాని ఆయన అనుకున్నట్టుగా ఏదీ జరగలేదు. కాలేజీలో చేరిన మూడు నెల్లకే నిరంజనానికి చదువుమీద ఆసక్తి పూర్తిగా పోయింది కాలేజీ రాజకీయాలు, అల్లర్లలోకి దిగిపోయాడు. ఆ కారణంగా అతడి చదువు మధ్యలో నే ఆగిపోయింది

ఆ చదువుతోనే ఏదో గొప్ప ఉద్యోగాన్ని సంపాదించాలనే భ్రమలో వుండిపోయాడు నిరంజనం. కాని– డిగ్రీలు వుండికూడా నిరుద్యోగులుగా తిరుగుతున్న మనుషులను చూసిన తర్వాత అతడికి తన ఉద్యోగం గురించి గొప్ప నిరుత్సాహం కలిగింది. అయినా అతడేమీ బాధపడలేదు. ఎందుకంటే ప్రస్తుతం అతడి తండ్రి సంపాదిస్తున్నాడు. తిండికి ఇబ్బంది ఏమీలేదు.

తన ఆశలను కూల్చివేసినా కొడుకును క్షమించి తన వృత్తిలోకి దిగమని చాలాసార్లు చెప్పాడు రామశాస్త్రి అయినా తనకు తెలిసిన గర్ల్ ఫ్రెండ్స్‌ను దృష్టిలో వుంచుకుని తన షేపులు మార్చుకుని పురోహితంలోకి దిగటానికి నిరంజనం మనసు అంగీకరించ లేదు.

ఈసారి అతడి తల్లి కూడా తండ్రి చెప్పినట్టుగా వినమన్నది. ఐనా నిరంజనం వినలేదు –

ఈ మధ్యనే కొన్ని రోజులనించీ చంద్రశేఖరం రామశాస్త్రి దగ్గరకు మంత్రాలు నేర్చుకోటానికి వస్తున్నాడు. అతనితో పాటు కొడుకును కూడా నేర్చుకోమని మరోసారి ఎంతో ప్రేమగా అడిగాడు రామశాస్త్రి కాని నిరంజనం ఎంతో కోపంగా ఈసారి అలా అడిగితే ఇల్లు విడిచి వెళ్ళిపోతానని గట్టిగా చెప్పేశాడు. ఆమాటకు తల్లి భయపడి ఇంకెప్పుడూ ఈ విషయం గురించి మాట్లాడమని కొడుక్కి హామీ ఇచ్చింది

అందువల్లనే ఈ రోజుకీ నిరంజనం వూరంతా తిరిగి ఏదో ఒక టైముకు ఇంటికి వస్తున్నాడు

"కాఫీ తీసుకోండి."

భార్య మాట వినిపించి ఆలోచనలనించి బయటపడ్డాడు రామశాస్త్రి. ముసుగు తీసి చూశాడది

వంగిపోయిన నడుముతో భార్య కనిపించింది.

చిన్నగా లేచి కూర్చుంటూ "రెండో వాడిని ఆచార్లు గారింటికి పంపించావా?" అనడిగాడు.

"ఆ" అన్నదామె

"పెద్దాడు లేచాడా?" కాఫీ తాగుతూ మధ్యలో అడిగాడు.

"రాత్రి పొద్దుపోయి వచ్చాడు కదూ. ఇంకా లేవలే" అని–

"ఇక వాడి గురించి ఆలోచనలు మానెయ్యండి మీకు వంట్లో సుస్తీ ఏమీలేదు అంతా దిగులే.. నాకు తెలుసు" అన్నది.

ఆమె అలా అనగానే "నీకు మాత్రం వాడి గురించి దిగుల్లేదా?" అన్నట్టుగా భార్యను చూశాడు రామశాస్త్రి

అప్పుడే రామశాస్త్రి రెండో కొడుకు ఆచార్లుగారిని మందుల పెట్టెతో తీసుకు వచ్చాడు

**********

ఎన్ని మందులు వాడినా రామశాస్త్రి ప్రాణం నిలవలేదు – ఎన్నో రోజులు..

## నాలుగో మనిషి

కొన్ని రోజుల తర్వాత రామశాస్త్రి కొడుకు గురించిన దిగులుతోనే ఈ లోకం నించి సెలవు తీసుకున్నాడు.

తండ్రిపోయిన తర్వాతనే ఆ లోటు ఏమిటో నిరంజనానికి మొదటిసారిగా తెలిసింది. తండ్రి చావుకు తనే కారణమని తల్లి అన్నప్పుడు నిరంజనానికి దుఃఖం ఆగలేదు. బిగ్గరగా ఏడ్వాలనిపించింది. ఆ మాట నిజమేననిపించింది గొప్ప నేరం చేసిన వాడిలా వణికిపోయాడు.

ఎంత బాధపడినా – పశ్చాత్తాపం పొందినా అతడు ఇక చెయ్యగలిగింది ఏదీ లేదు

కుటుంబం బజారున పడిన తర్వాత తనెంత గొప్ప పొరపాటు చేశాడో అతడికి అర్థమయ్యింది. ఆసమయంలో చంద్రశేఖరంని చూస్తే అసూయ కలిగింది **తన తండ్రి** దగ్గర నేర్చుకున్న నాలుగు మంత్రాలతోనే అతడు చిన్న చిన్న పనులు చేయించి పదహారేళ్ల వయసులోనే రోజూ ఎంతో కొంత డబ్బు సంపాదిస్తున్నాడు ఫుక్కిక ఇబ్బంది లేదు.

**కాని తను ఇన్నేళ్ళొచ్చి?**

నిరంజనానికి ఎవరిమీదనో కసిగా అనిపించింది.

తమ్ముళ్ళు – చెల్లెళ్ళు ఇంకా చిన్నవాళ్ళు. వాళ్ళు చెయ్యగలిగింది ఏమీలేదు

రామశాస్త్రి పోయిన తర్వాత మొదటిసారిగా ఆ కుటుంబం అంతా ఒకరోజు పూర్తిగా ఉపవాసం చెయ్యవలసి వచ్చింది. ఆ రాత్రి నిరంజనం తల్లితో పాటు ఆమెకు తెలియకుండానే దూరంగా ఎక్కడో కూర్చుని చాలాసేపు ఏడ్చాడు.

తెల్లవారిన తర్వాత సూర్యోదయం అయిన కాసేపటికి నిరంజనం రెండో తమ్ముడు రాగి చెంబును తోముకుని దాన్ని తసుకుని ఉపాదానంకి బయల్దేరినప్పుడు అతడి గుండె తరుక్కుపోయింది. ఎర్రగా వెలుగుతున్న చింతనిప్పుల మీద నిలబెట్టి నట్టు కూడా అనిపించింది.

ఇంట్లో వుండలేక బయటకు వచ్చాడు నిరంజనం.

కొంత దూరం నడిచాడు. శివాలయం వచ్చింది. ఆగిపోయాడు. ఆలయం ముందు వున్న రావిచెట్టు కింద పెద్ద బండ మీద కూర్చుండిపోయాడు.

అతనికి దిగులుగా వుంది. బాధగానూ వుంది. భయంగా కూడా వుంది.

రావిచెట్టు కింద నీడగా వుంది ఎండ ఆకుల మధ్య నుంచి పల్చగా పడుతోంది.

రోడ్డున పోతున్న మనుషులెవరూ నిరంజనాన్ని పట్టించుకోవటంలేదు

ఆ మనుషుల్లో అతనికి తెలిసిన వాళ్ళు ఎవరూ లేరు కాని అప్పుడే ఒకాయన అక్కడికి వచ్చాడు ఎగురుకుంటూ – ఆయన్ని గుర్తించాడు నిరంజనం. అప్పుడప్పుడు తండ్రి దగ్గరకు వస్తూండేవాడు. ఆయన పేరు పుల్లయ్య. శవాలను మోస్తుంటాడు. శనిదానాలు కూడా పడతాడు.

ఎదురు రోడ్డులో నించి ఎవరో ఇద్దరు ఖరీదైన దుస్తులు వేసుకున్న మనుషులు వచ్చి పుల్లయ్యను కలుసుకుని ఏదో చెప్పారు.

"ఎప్పుడు పోయాడు?" అడిగాడాయన.

"రాత్రి" చెప్పారు వాళ్ళు

"ఎంతిస్తారు?"

"మనిషికి పాతిక"

కాదు. యాభై ఇవ్వందే ఎవరూ దొరకరు."

కొంచెంసేపు ఆలోచించి "సరే పదండి" అన్నారు.

"ఎంత మంది కావాలి?"

"నలుగురు"

"నలుగురా? నేను – ఇంకో ఇద్దరం వున్నాం.. - **నాలుగో మనిషిని ఎక్కడయినా వెతకండి"**

"మా కెవరు తెలుసు? నాలుగో మనిషిని కూడా మీరే తీసుకురండి" అన్నారు వాళ్ళు.

నిరంజనం ఇక ఆలస్యం చెయ్యలేదు.

"నాలుగో మనిషిగా నేనొస్తాను" అంటూ బండ మీద నించి వాళ్ల దగ్గరకు వెళ్లాడు "

"నువ్వా? నువ్వు రామశాస్త్రిగారి అబ్బాయివి కదూ?" అన్నాడు పుల్లయ్య

"అవును"

"నువ్విలాంటి పనుల్లోకి దిగటం నాకు ఇష్టం లేదు. మీ అమ్మకు తెలిసిందంటే?"

"ఎవరికి తెలిసినా నాకు ఇబ్బంది లేదు. మీరు మాట్లాడకండి.. పదండి. నేనే నాలుగో మనిషిని"

ఇక ఆయన మాట్లాడలేదు ఏమనుకున్నాడో మనసులో" ముందుకు కదిలాడు.

వాళ్ళతో నడుస్తూ నిరంజనం మనసులో ఇలా అనుకున్నాడు.

"నాన్నా – ఏ పని చేసైనా సరే కుటుంబ పోషణ భారాన్ని మోస్తాను. అహంకారంతో నిన్ను పోగొట్టుకున్నందుకు ఇది నాకు నేను విధించుకుంటున్న శిక్ష" ◘



# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే
## చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది.
## చిగళ్లు గట్టిగా వుంటే
## పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.




అమెరికా దేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హాన్ తాను తయారుచేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







## ఫోర్‌హాన్స్ — ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్‌పేస్టు.

339F 234

## నిరుద్యోగులైన కెనడా మాజీ మంత్రులు!

కెనడాలో లిబరల్ పార్టీకి చెందిన ఒకనాటి మినిష్టర్లు యిపుడు వేరే ఏ వుద్యోగాలూ దొరక్క సతమతమయి పోతున్నారట. నేషనల్ రెవెన్యూ ఎక్స్ మినిస్టరు పియరి బుజియర్స్ వందలుకొద్దీ దరకాస్తులు పెట్టినా ఒక్క వుద్యోగమూ దొరక-లేదట. స్పోర్ట్స్ మంత్రి జాక్విస్ ఆలివర్ చివరికి కార్లు అమ్మే సేల్స్ మేన్‌గా జేరారట. ఎక్స్ యం. పి.లు రోలండ్ డియాన్, హెరాల్డ్ హెర్బర్ట్ వుద్యోగం కోసం ప్రపంచంలో ఏ మూలకయినా వెళ్ళ సిద్ధమేనన్నారట.

## గుడికి వెళ్ళి ఆత్మహత్య చేసుకున్న కుటుంబం!

తిరువణ్ణామలై కోవెలకు చెందిన కొలనులో ఒక మగ, ఒక ఆడ, ఒక పసిపిల్ల శవాలు తేలాయట. వీరెవరని పోలీసు తీసిన ఆరాల్లో అతని పేరు దామోదరన్ అనీ, కాంచీపురానికి చెందినవాడనీ తేలిరా. అతను పట్టుబట్టలు నేసే వాడట. అతనికి 3 ఏళ్ళ క్రితం 22 ఏళ్ళ కామాక్షి అనే ఆమెతో వివాహం అయి ఉదట. వీరికి ఒకటిన్నర ఏళ్ళ కుముదా అనే పసి పిల్ల వున్నదట. దామోదరన్ తన మామ గారి యింట్లో వుంటూ గుడికి వెళ్ళొస్తామని భార్యా పిల్లలతో తిరువణ్ణామలైకి వెళ్ళి ఆత్మహత్య వుమ్మడిగా నెరవేర్చారట. అతను తన మామగారికి వ్రాసిన ఉత్తరంలో మేము 400 మైళ్ళు దూరంలో వున్న వో వూళ్ళో స్థిరపడ్డానికి మీకు చెప్పకుండా బయల్దేరాము. మమ్మల్ని గురించి వెతక్కండి అని వుందట.

## 12 ఏళ్ళ బాలికపై అత్యాచారం!

వేలూరు వేలప్పాడికి చెందిన 12 ఏళ్ళ రాజేశ్వరి అనే అమ్మాయి వంటకు ఎండిన పుల్లలు ఏరుకు రావడానికి వూరు చివరకు వెళ్తే, ఆమెను అక్కడ వంటరిగా చూసిన 22 ఏళ్ళ విజయన్ అనే కుర్రాడు ఆమెను బలాత్కరించి, తన కామదాహం తీర్చుకుని ఆనక అంతర్థానమై పోయాట్ట. పోలీసులాతని కోసం వెతుకుతున్నారట.

## భార్యను చంపిన భర్త!

ఆర్కోణం రామాపురానికి చెందిన కన్నియప్పరెడ్డి అనే ఆయన కూతురు 18 ఏళ్ళ ఆయమ్మ అనే ఆమెను అదే వూరుకు చెందిన 23 ఏళ్ళ రాజేంద్రన్ ప్రేమించి, ఆనక గర్భవతిని చేసి, పెళ్ళాడమంటే నాలుక చప్పరించేశాడట. ఈ కథ తెలిసిన కన్నియప్పరెడ్డి పంచాయతీ పెట్టి వారిద్దరికి పెళ్ళి జరిపించి కట్నంగా పదివేలడిగితే రెండున్నర వేలిచ్చాడట. తన తల్లి యింట్లో వున్న ఆ ఆయమ్మను తనతో గుడికి రమ్మని తీసుకెళ్ళి, మధ్యేమార్గంలో ఆమె చీర చెఱగు పెట్టి ఆమె మెడ నులిపెట్టి చంపేశాడట.

## భర్తపై కిరసనాయిల్ పోసి నిప్పంటించిన భార్య!

సికిందరాబాదుకు చెందిన భారతి అనే వో యిల్లాలు తన భర్తతో నిత్య పోరు భరించలేక, విసుగెత్తి ఆయన మీద ఝుమ్మని కిరసనాయిలు పోసి, నిప్పంటించేసిందట. అతడు చేసిన ఆర్తనాదాలకు చుట్టుపక్కల వాళ్ళొచ్చి మంటల నార్పి అతన్ని ఆసుపత్రిలో జమ చేశారట.

## అందం తెచ్చిన అనర్థం!

చర్ల గ్రామానికి చెందిన ఒక గృహిణి అందానికి వెర్రెత్తిన వో పోలీసు కాన్స్టబుల్ ఆ యింటి మీద నిఘా వేసి, ఆమె భర్త యింట్లో లేనపుడు తాను జొరబడి, ఆమెను బలాత్కరించి, మానభంగం చేసి, తన కోర్కె తీర్చుకు చక్కాపోయాట్ట.

## కానిస్టేబుల్ భార్యని బలాత్కరించిన సబ్ ఇన్స్పెక్టర్!

కర్ణాటక రాష్ట్రం బిరూర్ అనే వూళ్ళో వొ పోలీసు కాన్స్టబుల్ యింటికి మోటారు సైకిలు మీద వెళ్ళిన సబ్ ఇన్స్పెక్టరు అక్కడ ఆ కానిస్టేబుల్ భార్య అందానికి వెర్రెత్తినవాడై మోటారు సైకిలు బాగు చేయించుకు రమ్మని ఆ కానిస్టేబుల్‌ని పంపించి, వంటరిగా వున్న అతని భార్యను బలాత్కరింపబోయాడట. ఆమె వేసిన కేకలకు చుట్టుపక్కల వారు రావడంతో ఆ పెద్దాయన కుక్కిన పేనై, దొరికిపోయాడట.

## ఎలుక మాంసంలో విటమిన్లు!

చైనాలో రాన్రానూ ఎలుకల సంతతి పెచ్చుమీరి పేట్రేగి పోయిందట. అసలక్కడ జనాభానే ఎక్కువైతే, ఒక్కో మనిషికి సగటున నాలుగు ఎలుకల లెక్కన అక్కడ ఎలుకలున్నాయట. వీటి బెడద వదుల్చుకోడానికి యిక వాటిని స్వాహా చేయడమే మార్గమని విజ్ఞులభిప్రాయపడ్డారట. విజ్ఞాన శాస్త్రజ్ఞులు, డాక్టర్లు కలిసి ఎలుక మాంసాన్ని క్షుణ్ణంగా పరీక్షించి ఆ మాంసం మనిషికి చాలా మంచిదని, దాంట్లో విటమినులు అధికంగా వున్నాయనీ శలవిచ్చారట.

## వ్యసనాల నగరం!

ప్రపంచంలో కల్లా "లాస్‌విగాస్" నగరం చాలా చెడ్డ అలవాట్లు కల నగరమట. ఆ నగరంలో జూద గృహాలు, వ్యభిచార గృహాలు తదితర వ్యసన గృహాలూ కోకొల్లలట. దీనిని "సిన్ సిటీ" అంటారట. ఈ నగరంలో 236 "చర్చిలు" కూడా వున్నాయట. □



# "సూపర్‌లాక్‌కి మార్చేసరికి ప్రతిదానికి ఒక కొత్తదనం వచ్చింది...



# ...సరే ఆయనకేసి చూడండి"

"అది నమ్మశక్యం కాని విషయం! జీవరహితంగా వున్న గోడలు నా కళ్ళముందే పూర్తిగా మారిపోయాయి. పేల్ లైలాక్, జూలియా గ్రీన్. మా గోడలకి వేయడానికి నా దగ్గర 44 రంగులు వున్నాయి. అంతేకాదు శుభ్రపరచడం ఎంతో సులభం!

"మరింతగా నమ్మజాలనిదేమంటే అది మా ఆయనవెలా మార్చివేసినదీ. త్వరగా ఉదయాన్నే ఫలహారం ముగిస్తూంటారు. కొత్త పోస్టర్లు అంటిస్తారు. ఆయన కొత్త మనిషిగా మారేరు!"

అది సూపర్‌లాక్ యొక్క ఇంద్రజాలమే. ఒక అసాధారణమైన వాల్ పెయింట్. నేడు మన దేశంలో అగ్రస్థానంలో వున్న ఒక పెయింట్ కంపెనీచే తయారు చేయబడినది. షాలిమార్ పెయింట్స్.

సూపర్‌లాక్ వాడండి. మీ గృహంలో సర్వత్రా మార్పురావడం గమనించండి.



**సూపర్‌లాక్**
ఎక్రిలిక్ ప్లాస్టిక్ ఎమల్షన్




**షాలిమార్ పెయింట్స్**
వెయ్యి రంగులు, విరజిల్లు సొంపులు

# గురకల గున్నేశ్వరావు

## ముమ్మిడి శ్యామలారాణి

తల్లిదండ్రులు చనిపోతూ, గున్నేశ్వరావుని బామ్మగారికి అప్పగించి మరీ పోయారు.

గున్నేశ్వరావు మీద పంచ ప్రాణాలు పెట్టుకొని పెంచింది బామ్మగారు.

గున్నేశ్వరావుని ప్రేమ కొద్ది ప్రక్కలో వేసుకుని పడుకునేది బామ్మగారు.

గున్నేశ్వరావు. బామ్మగారు నిద్రలోకి జారుకునేవారు.

మరు నిముషంలో గుర్ గుర్ గుర్ మని అదో రకమైన ధ్వనితో గురకలు తీస్తున్న మనువడిని చూసి "మా నాయనే! మా తండ్రే" అని చేయివేసి నిమురుతూ పొంగిపోయేది.

బామ్మగారు అలా పొంగిపోవడానికి కారణం లేకపోలేదు.

"పిచ్చి తండ్రి! మీ తాతగారిపోలిక మీనాన్నకు రాలేదుగాని నీకు వచ్చేసిందిరా! అచ్చం మీ తాతగారు నీలాగే , గురకలు తీసేవారు. ఆ గురకలకి వీధిలో కుక్కలన్ని ఎక్కడో దొంగలు పడ్డారనుకొని తెగ అరిచేవి. మాయదారి కుక్కలు అరచి, అరచి ఇక అరవడానికి ఓపికలేక నోళ్ళు మూసుకునేవి" అని గతం తలంచుకొని తెగ మురిసిపోయేది ఆవిడ.

బ్రతికి ఉన్న రోజుల్లో "మీ గురకలు మండిపోను, పగలల్లా ఇంటికి ఇంటెడు చాకిరి చేసి ప్రశాంతంగా కన్ను మూద్దాం అంటే ఒక్క నిముషం కళ్ళు మూసుకోనిస్తున్నారా? గుర్ గుర్ గుర్ అని తెగ గురకలు తీస్తుంటే ఇంక నేనేం నిధురపోయేది? అన్నట్లు ఇంకోమాట్లు! ఇంటిగల ఆవిడ నిముషాలమీద ఇల్లు ఖాళీ చేయమంటుంది" అని బామ్మగారు తెగ తిట్టిపోసేది.

చచ్చిన వాడి కళ్ళు చారడేసిలా. ఇప్పుడు అ సంగతి మరచిపోయి గురకలు తీస్తున్న గున్నేశ్వరావును ప్రేమతో తెగ మెచ్చుకొనేది.

గున్నేశ్వరావు పెరిగి పెద్దయినాక బామ్మగారు గున్నేశ్వరావు పడుకున్న గదిలో పడుకోవడానికే తెగ భయపడేది.

దెయ్యాలు.. బూతాలు... చేతబడులు లాంటి కధల్లో వస్తువులు వూగుతున్నట్లు గున్నేశ్వరావు పడుకున్న మంచం వూగడం చూసి గుండెలమీద చేయివెసుకునే వారు పాపం బామ్మగారు.

"ఒరి వెర్రి నాయనా! తాతగారే అనుకుంటే అయన్ని మించిపోయవురా గురకలో! పిచ్చి సన్నాసి! వచ్చే అమ్మడు నీ గురకల ప్రవాహంకి ఎలాతట్టుకుంటుందిరా బాబు!" అని పడుకున్న గున్నేశ్వరావుని చూసి అనుకునేవారు బామ్మగారు.

గున్నేశ్వరావుకి సంబంధాలు రావడం మొదలు పెట్టాయి. ధైర్యం గల పిల్లను చూసి గున్నేశ్వరావుకి చేయకపోతే వీడి గురకలకి ఆ అమ్మడు భయంతో మంచం పడుతుందని, బామ్మగారు తెలివితేటలు చూపి గున్నేశ్వరావుకి ధైర్యం గల అమ్మడు అని తెలిసిన రావులపాలెం రామనుజం పంతులు గారి రామలక్ష్మితో వివాహం జరిపించారు.

తెల్లని పైజామా , కళ్ళీలాల్చీ వేసుకొని, నుదిటిమీద కళ్యాణ తిలకం, బుగ్గనచుక్కతో అద్దంముందు నిలబడి మురిసిపోతున్న గున్నేశ్వరావుని చూసి "పిచ్చి నాయనా! నీకేంరా అంతా మీ తాతయ్యపోలికే.... ఆ రోజుల్లో మీ తాతయ్య వీధివెంట వెళుతుంటే ఆడాళ్ళందరూ తలుపుచాటు నుండి చూసేవారు..... అని" గున్నూ ! నీకో సంగతి చెప్పడానికి వచ్చేనురా బాబూ!....."అంది.

"ఏంటి బామ్మ?... " అన్నాడు బామ్మగారు ఏం చెప్పడానికి వచ్చారో అని'.....

"అదేనురా! ..... గున్నూ!.... ఈ రోజు.... మొదటి రోజు కదరా" అన్నారు.

"నీ మొఖం! మొదటి రోజు ఏమిటే?పధ్నాలుగో తారీఖు ' అన్నాడు విసుగ్గా!

"చాల్లే! ఆ మాత్రం తెలియనివాజమ్మను ఏంటిరా గున్నూ!.... అదికాదురా నేను చెప్పేది ఈ రోజు నీ శోభనం కదురా?" అంది.

"అది తెలియని దద్దమ్మను కానే!.... అబ్బా ఎనిమిదయి పోతోంది. ఇంకా నీ నసుగుడు ఏమిటి" అన్నాడు.

"నసుగుడు కాదురా. నీకు గదిలోకి వెళ్ళేముందు ఒక విషయం చెప్పాలిరా?" అంది.

"ఏమిటి చెప్పేది మగాడిని పట్టుకొని... మరీ నన్ను దద్దమ్మను చేస్తున్నావ్? నేనేమైన ఆడపిల్లనా. గదిలోకి వెళ్ళేముందు చెప్పడానికి?" అన్నాడు విసుగ్గా గున్నేశ్వరావు.

"నీ బొంద!.... నేను చెప్పేది అదికాదురా? ఈ రోజు మొదటి రోజు రామలక్ష్మికి కొత్తకదా? నీ గురకలు విని ఏం బెంబేలు పడిపోతుందో.... అని కొంచెం మెలకువగా ఉండి గురకలు తగ్గించమని చెబుదాం అనిరా? అర్థం అయిందా?" అంది.

"ఏమిటి బామ్మ! నువ్వు. అంత పని గట్టుకొని చెప్పడం. ఏం తాతయ్యను వదిలి నువ్వు పారిపోయావా?" అన్నాడు కోపంగా.

గున్నేశ్వరావు, రామలక్ష్మి, పలకరింపులు, కబుర్లు కాకరకాయలు అయిన అనంతరం నిద్ర కుపక్రమించారు.

దిండు మీద పడుకోబోతున్న రామలక్ష్మిని....

"రామలక్ష్మీ! ఈ రోజునుండి నీకు దిండుతో పనిలేదు. నాహృదయమే నీకు దిండు. రా!.... ఇలా పడుకో" అన్నాడు.

తన అదృష్టానికి మురిసిపోతు.... గున్నేశ్వరావు హృదయమే దిండుగా అనుకొని పడుకొంది రామలక్ష్మి.

సమయం దొర్లుతుంది.

గుర్.... గుర్.... గుర్ అని భయంకరమైన యుద్ధకాండంలో ఫిరంగులు.... తుపాకులు పేల్పులు శబ్దంలా భయంకరంగా గుర్ గుర్ అని ధ్వని వినబడుతుంటే రామలక్ష్మి వళ్ళు అంతా చమటతో తడసి, గుండె దడతో కళ్ళు తెరవడానికి భయం వేసి, కళ్ళు గట్టిగా మూసుకొని, ధ్వని ఎక్కడి నుండి వస్తుందా అని ఆలోచించ సాగింది.

నిముష నిముషానికి ధ్వని ఎక్కువకావడమే కాకుండా, మంచం చిన్నగా ఊగుతున్నట్లు కావడంతో.... ప్రఖ్యాతి రచయిత (త్రి) కథలో దయ్యాలు గుర్తు వచ్చి "అయ్య బాబోయ్!" అని పెద్దకేక వేసింది.

కాలం దొర్లుతోంది.

గున్నేశ్వరావు, రామలక్ష్మి ప్రక్కలో పడుకున్న పసివాడు కెవ్వున అరవడం మొదలు పెట్టాడు.

పసివాడికి ఏమయిందో అని గాభరగా లేచి చూసింది రామలక్ష్మి.

కాళ్ళు చేతులు కొట్టుకొని మూతి బిగించి ఏడుస్తున్న చంటోడిని చూసి దుఃఖం ఆగలేదు.

చంటోడు గుక్కపట్టి ఏడుస్తున్నా, భయంకరంగా గురక తీస్తూ నిద్రపోతున్న భర్తను చూసి ఎక్కడలేని కోపం, చిరాకు వచ్చి "ఏమిటండి మీ వెధవ గురకలు అనీ ఒక్క పోటు పొడిచి, చూడండి బాబుకి కడుపునొప్పి ఏమిటో గంట నుండి ఏక బిగువున ఏడుస్తున్నాడు, హాస్పటల్‌కి వెళదాం" అంది.

నిద్రలో నుండి గున్నేశ్వరావు కంగారుగా లేచి, "ఆ... ఏమిటి?" అన్నాడు.

అంతే మరు నిముషం.... చంటోడు ఏడుపుమాని అర్థరాత్రో అపరాత్రో తెలియనట్టు పసివాడిలా ఆడుకోవడం మొదలు పెట్టాడు.

ఏదో అర్థం అయినదానిలా, మీ గురకలు మండిపోను" అని; "నా తండ్రి మీ దిక్కుమాలిన గురకలకి హడలిపోయి ఏడుస్తున్నాడు" అంది.

పెళ్ళయిన క్రొత్త రోజుల్లో "ఏమిటండి మీ గురకలు అని సిగ్గు పడుతు అనే భార్య మాటలు గుర్తు వచ్చి, "నా ఇల్లు.... నా ఇష్టం.... ఇంకా గట్టిగా గురకలు పెడతాను, నువ్వెవరు" అన్నాడు కోపంగా.

"సిగ్గు లేకపోతే సరి!.... ఎవరైనా పింటె నవ్విపోతారు. ఎన్ని రాత్రులు మీ గురకలకి నిద్ర లేకుండా గడిపానో? నేనయితే సరిపెట్టుకున్నాను. మొన్నటికి మొన్న మా పుట్టింటి నుండి వస్తున్నప్పుడు రైలు ఇంజను కూతకి ఏడ్చాడు. మళ్ళా ఇప్పుడు మీ గురకలకి భయపడిపోయి ఇలా ఏడ్చాడు" అంది కళ్ళ నీళ్ళు పెట్టుకొని.

"ఏడ్వనీయవే అంత ధైర్యంగలవాడిని కన్నావ్" అన్నాడు కోపంగా!"

రోజులు దొర్లుతున్న కొలది చంటోడు నిద్రలేక చిక్కిశల్యమై పోయాడు. చంటోడిని చూస్తూ బెంగతో చిక్కిసగం అయింది రామలక్ష్మి.

ఆఫీసు నుండి వచ్చిన గున్నేశ్వరావు వీధిగదిలో మంచంచూసి, అసలు విషయం అర్థం అయిన వాడిలా వంట గదిలోకి దారి తీశాడు.

"ఏం రామలక్ష్మి!... ఏమిటి నీ ఉద్దేశం నీ మంచం వీధిగదిలో వేసావ్? అసలు నీ ఉద్దేశం ఏమిటి" అన్నాడు.

"నా ఉద్దేశం ఎలాగున్నా ఇరుగు పొరుగువాళ్ళు చెవులు తెగ కొరుక్కుంటున్నారండి..... చంటోడు తెల్లవార్లు ఏడవడం మీగురకలు గూర్చి కథలు కథలుగా చెప్పుకుంటున్నారు. అలా చెప్పుకోవడం ఇష్టం లేక ఇలా పడకలు మార్చను. మీరా గదిలో పడుకోండి" అంది.

అయితే నేను నీకు అక్కరలేదా? నువ్వు వేరుగా పడుకున్న పక్షంలో ఇక నీకు నాకు సంబంధం ఏమిటి? .... ఇప్పుడే మీ పుట్టింటికి వెళ్ళిపో.... " అన్నాడు కోపంగా గున్నేశ్వరావు.

'అలాగే లెండి!.... రేపొద్దున్న వరకు ఆగండి. నాతండ్రి కన్నా నాకీ లోకంలో ఇంకేది ఎక్కువ కాదు" అంది రామలక్ష్మి.

★ ★ ★ ★ ★ ★

యువర్ ఆనర్!.... ఈమె అనగా గున్నేశ్వరావు గారి భార్య రామలక్ష్మి విడాకులు కోరతంలో తప్పులేదు. పెళ్ళయిన రాత్రి మొదలు ఇప్పటి వరకు కూడ ఈమె ఒక్కనాడు కూడ కంటి నిండా నిద్ర ఎరుగదు....



అయినా భారత స్త్రీ కాబట్టి పతియే ప్రత్యక్ష దైవం అని ముద్దాయి అనగా భర్త భయంకరమైన గురకలు, భరించింది. తరువాత ఈమెకు కొడుకు పుట్టాడు. ప్రతిరాత్రి పసివాడు ఈ ముద్దాయి భయంకరమైన గురకలకి భయపడి నిద్రమాని ఒకటే ఏడుపు రోజులు గడుస్తున్న కొలది చిక్కి శల్యం అయిపోసాగాడు దీనికి సాక్షులు ఆ వీధిలో ఉండే అప్పారావు, రంగారావు, బుచ్చిబాబు, తాయారమ్మ, బంగారమ్మ, చిట్టితల్లి.

**తనకోసం భర్త గురకలు భరించినా తన కొడుకు** బ్రతికి బలుసాకు తినాలని భర్త నుండి విడాకులు కోరుతున్నారు రామలక్ష్మిగారు. స్వాతంత్ర భారతదేశంలో ప్రతి మనిషి స్వతంత్రుడే! ఈమెకు జడ్జిగారు భయంకరమైన ముద్దాయి గురకలు నుండి విడిపోయి స్వతంత్రంగా బ్రతకడానికి విడాకులు ఇవ్వవలసినది అని కోరుతున్నాను అన్నాడు లాయరు.

పవిత్ర భారత దేశంలో ప్రతి మనిషికి కొన్ని హక్కులున్నాయి. ముద్దాయి గున్నేశ్వరావు గురకలు భయంకరమైనవి అని సాక్షుల ఆధారం మూలాన రామలక్ష్మిగారికి విడాకులు మంజూరు అయినవి.

"నో! ...నో!.... ప్లీజ్... రామలక్ష్మి, బాబు నాకు కావాలి! అని పిచ్చివాడిలా పెద్ద కేకలు నిద్రలో వేస్తున్న భర్తను "ఏమండీ! ఏమయిందండి?".... అంది కంగారుగా రామలక్ష్మి.

తను ఇప్పటి వరకు కల కన్నాడా? ఎంత భయంకరంగా ఉంది?

ఏమో! రామలక్ష్మి పడకలు మార్చింది. తరువాత ఏమో జరగకూడనివి జరిగితే.

అయితే.... తను ఇప్పుడు చేయవలసిన పని.... తన గురకలకి నివారణోపాయం ఆలోచించాలి.

ఆలోచన రావడమే తడవుగా గబగబా తయారై బయటకు వెళుతున్న భర్తను, "ఏమండీ! పదింటికి కదా ఆఫీసు . ఇప్పుడు ఎక్కడికండి" అంది.

"నాగురకలు పోవడానికి మార్గం ఉందా అని అడగడానికి డాక్టరు దగ్గరకు వెళుతున్నాను. ఒకవేళ మందులు లేకపోయినా నాగురకలు ఈ రోజు నుండి నీకు, బాబుకి వినబడకుండా ఉండడానికి ప్రయత్నిస్తాను రామలక్ష్మి..... నిన్ను.... నిన్ను బాధపెట్టాను నన్ను క్షమించవూ?" అన్నాడు గున్నేశ్వరావు.

"ఏమండీ! ఇంత మాట అనకండి" అని విప్పారిన నేత్రాలతో గున్నేశ్వరావు వైపు చూసింది రామలక్ష్మి. □



రాజ్యలక్ష్మి, "నాలుగిళ్ళ చావిడి"లో

## కృష్ణ, శ్రీదేవిలతో తాతినేని దర్శకత్వంలో మిద్దే నిర్మించే "పచ్చని కాపురం"

యాక్షన్ చిత్రాలు, విప్లవాత్మకమైన చిత్రాలతో పాటు చక్కని కుటుంబ గాథా చిత్రాల్లోనూ నటించమని కోరే నా అసంఖ్యాక అభిమానులకు – అనుక్షణం మానసిక సంఘర్షణకు గురయ్యే ఈ వైవిధ్యం గల పాత్ర పూర్ణ సంతృప్తి నిస్తుంది. అన్నారు కృష్ణ శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి 'పచ్చని కాపురం' షూటింగ్‌లో "ప్యార్ జూక్తా నహీ– హిందీ చిత్రం చూసినప్పుడు అలాంటి హారోయిన్ పాత్ర నాకు లభిస్తే ఎంత బావుణ్ను– అనుకున్నాను అలా అనుకున్న రెండు రోజులకే మిద్దె



# సినిమ

రామారావుగారు వచ్చి తెలుగు వెర్షన్‌లో నటించమని అడిగినప్పుడు నాకు ఆశ్చర్యంతో పాటు ఆనందం కూడా కలిగింది. టేలెంట్స్ ప్రదర్శించడానికి అనువైన పాత్ర గనుకే విజృంభించడానికి అవకాశం లభించింది," అంది శ్రీదేవి. "విభిన్న మనస్తత్వాలు గల భార్యా భర్తల కథ అయిన హిందీ వెర్షన్ అఖండ విజయాన్ని సాధించి, ఉత్తర భారత దేశమంతటా వసూళ్ళ చరిత్రలో సరికొత్త రికార్డును సృష్టించింది. అందుకే హిందీ చిత్రాలతో ఎంతో బిజీగా ఉన్నా– ఈ తెలుగు వెర్షన్ డైరక్షన్‌కు వెంటనే అంగీకరించాను," అన్నారు డైరెక్టర్ తాతినేని రామారావు. ఈ చిత్రంలో జగ్గయ్య, జానకి,




"మహాసాధ్వి" పేరు చెడగొట్టకపోతే ఈ పిల్ల తన పేరు మార్చుకోకూడదూ?

కాంతారావు, రాజ్యలక్ష్మి, మాస్టర్ అర్జున్ ఇతర భూమికలు నిర్వహిస్తున్నారు. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయ, శాయికుమార్ శిల్పం, సలీం నృత్యాలు, డి వెంకటరత్నం కూర్పుతో ఎన్. వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ఉదయ-కుమార్ ప్రొడక్షన్ మేనేజర్ ఊటీలో మే లో పాటలు క్లయిమాక్స్ ఎక్స్‌ప్లేట్ చేస్తాం జూన్‌లో పాచ్‌వర్క్ ముగించి, జూన్ నెలాఖరులో విడుదల చేయాలనుకుంటున్నాం, అన్నారు నిర్మాత మిద్దె రామారావు

## కృష్ణతో విజయనిర్మల దర్శకత్వంలో "సూర్యచంద్ర"

"చిట్టారెడ్డి సూర్యకుమారి నవల ఆధారం. ఈ చిత్రంలో మరో విశేషం హీరోకి రాజ్‌సీతారామ్ పాడడం" అన్నారు కృష్ణ సమర్పణలో శ్రీ విజయకృష్ణా మూవీస్ వారి పై చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బాధ్యతలు వహించే విజయనిర్మల. డి. ఐ. జి. గారి అబ్బాయి అయిన రాజ్‌సీతారామ్ లోగడ "అగ్ని సమాధి" చిత్రంలో నరేష్‌కు ఒక పాట పాడాడు.

అది విన్న కృష్ణ ఉజ్వలమైన భవిష్యత్తు గల అలాంటి యువకులను ప్రోత్సహించాలని చెప్పారట. ఏప్రిల్ చివరన చిత్రీకరణ మొదలైన పై

చిత్రంలో కృష్ణ, జయప్రద నాయకా-నాయికలు. ప్రభ, దీప, మనోచిత్ర, శ్యామలగౌరి, సత్యనారాయణ, జె. వి. సోమయాజులు, వేలు, ఎ. ఎల్. నారాయణ, సూర్యకాంతం, రాధాకుమారి ఇతర తారాగణం. "మేలో ఊటీలో... జూన్, జూలై, ఆగస్టు నెలల్లో కైలాసకోన, శ్రీశైలం, ఏర్కాడ్ ప్రాంతాలలో జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత ఎస్. రమానంద్.

సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, రమేష్ నాయుడు సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ శీను నృత్యాలు, పద్మనాభం ప్రొడక్షన్, ఎన్. శేషు-జి. సత్యం సహకార దర్శకత్వం, ఎస్. రవికుమార్ నిర్వహణతో ఎస్. రఘునాథ్ సహ నిర్మాత.



"మాయలాడి"లో స్మిత

కృష్ణంరాజు, "తిరుగుబాటు"లో



## హీరో కృష్ణ దర్శకత్వంలో చిత్రాలు

అగ్ర కథా నాయకుడుగా, యావద్భారత ఖ్యాతి నార్జించిన పద్మాలయ సంస్థ అధినేతగా, స్టూడియో అధిపతిగా తేజరిల్లుతూన్న కృష్ణకు చలన చిత్ర నిర్మాణంలోని అన్ని శాఖల్లోనూ క్షుణ్ణంగా అనుభవం ఉంది. ఆయనకున్న సాంకేతిక పరిజ్ఞానం ఇంతా అంతా కాదు. "అల్లూరి సీతారామరాజు చిత్రం నిర్మాణంలో ఉన్నప్పుడే ఆయనకు దర్శకత్వాన్ని చేపట్టాలనే తలంపు కలిగింది. అసలు "కురుక్షేత్రం" చిత్రం ఆయన దర్శకత్వంలో రూపొందవలసింది. తీరుబడి లేనందున వీలుపడింది కాదు. ఆగస్ట్ నుంచి పద్మాలయా రెండు భాషల్లో నిర్మించే భారీ జానపద చిత్రాన్ని ఆయన డైరెక్ట్ చేయబోతున్నారు. "హిందీలో జితేంద్ర, తెలుగులో నేను హీరోలం. రెండు వెర్షన్‌లలోను జయప్రద నాయిక. బప్పిలహరి మ్యూజిక్ డైరెక్టర్," అని తెలిపారు కృష్ణ. పద్మాలయా స్టూడియోలోను, రాజస్థాన్‌లోను నవంబర్‌కు షూటింగ్ పూర్తవుతుంది. మహారథి తెలుగులో, కాదర్‌ఖాన్ హిందీలో సంభాషణలు రాస్తున్నారు.

## గుహా క్రియేషన్స్ తాజా చిత్రంలో సుహాసిని

సుహాసిని మొదటిసారిగా ద్విపాత్రలు నిర్వహిస్తోంది. శారద ఒక క్లిష్టమైన పాత్రను ధరిస్తోంది. జూలై నుంచి షూటింగ్," అన్నారు కె. సత్యం. ఈయన కూర్పు, సమర్పణలో కె.వి.నారాయణ గుహా "ఈ చరిత్ర ఇంకెన్నాళ్ళు" అనంతరం నిర్మించే గుహా క్రియేషన్స్ వారి చిత్రానికి మౌళి (పట్నం వచ్చిన పతివ్రతలు) దర్శకుడు. కాశీ విశ్వనాథ్ సంభాషణల కర్త. కృష్ణ – చక్ర సంగీత దర్శకులు.

# సినిమా

## కాతినేని పిక్చర్స్ రెండవ చిత్రం

"ఆత్మాభిమానం గల యువతి తనకు మనసిచ్చి మనువాడుతానన్న యువకుని ఎన్ని ఆటంకాలొచ్చినా ఎదుర్కొని తన వాడ్ని చేసుకోవడమే ముఖ్యాంశం. ప్రభాకరరెడ్డి సమకూర్చిన 125వ కథ. ఏప్రిల్ 8 నుంచి 23 వరకు మొదటి షెడ్యూల్‌ను పూర్తి చేశాం. రెండవ షెడ్యూల్ మే 1 నుంచి 10 వరకు. జూన్‌లో విడుదలకు సిద్ధమవుతుంది." అన్నారు బి. భాస్కరరావు. ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో "భారతంలో శంఖారావం" అనంతరం కాతినేని బాబు నిర్మించే ద్వితీయ చిత్రంలో మోహన్‌బాబు, జయసుధ, ప్రభాకరరెడ్డి, రమాప్రభ, ముచ్చెర్ల అరుణ, వేలు, హరిప్రసాద్, రమణమూర్తి, మాస్టర్ కార్తీక్ పాత్రధారులు. గోపి మాటలు, పాటలు రాశారు. జె. వి. రాఘవులు సంగీతం, సత్తిబాబు ఛాయ, బి. ఎన్. కృష్ణ శిల్పం, జ్యోతిప్రసాద్ ప్రొడక్షన్, మార్తాండ కూర్పు నిర్వహిస్తున్నారు.

## బాలకృష్ణతో లక్ష్మీరామా ఆర్ట్ పిక్చర్స్ చిత్రం

"గొల్లపూడి మారుతీరావు ఒక తమాషా పాత్రను నిర్వహించడమే కాకుండా కథను కూడా సమకూర్చారు." అన్నారు రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో ధనేకుల శివన్నారాయణ నిర్మించే చిత్రంలో బాలకృష్ణ సరసన విజయశాంతి నాయిక. సత్యనారాయణ, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, గొల్లపూడి, రాజేంద్ర ప్రసాద్, వేలు, వీరభద్రరావు, రాళ్ళపల్లి, మాడా, పూర్ణిమ, రమాప్రభ తతిమ్మా భూమికలు నిర్వహిస్తారు. సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతంతో తుమ్మల హరిశ్చంద్రప్రసాద్ సమర్పిస్తారీ చిత్రాన్ని.

## "సుమన్"లో సుమన్



# తారలు - తీరులు

"మా నాన్న రామచంద్రయ్య గారిది చిత్తూరు. అక్కడ స్వర్గీయ వి. నాగయ్య గారి పక్కిల్లే. మా నాన్నగారు బాల్యంలో నాటకాలలో నటించేవారు. మా అమ్మ కల్యాణిది కేరళలోని త్రిచూర్. మా నాన్నగారు, మేనమామలు అందరూ డిఫెన్స్ శాఖలో పనిచేసిన వారే. నేను నా ఏడవ ఏట నుంచే నాటకాలలో నటించనారంభించాను," అంది ద్విశత చిత్ర నటి కె. ఆర్. విజయ. ఈమె కుటుంబ మిత్రుడైన ఓ ఫోటోగ్రాఫర్ ఒక కేలండర్‌లో ఈమె ఫోటో వేయించాడు. అది చూసి దర్శక నిర్మాత కె. ఎస్. గోపాలకృష్ణన్ కబురు చేసి 1963లో "కర్పగం" చిత్రంలో ఈమెకు తొలి సినిమా ఛాన్స్ ఇచ్చారు. ఆయన దర్శకత్వంలోనే 1973లో ఈమె 100వ చిత్రం "నత్తైయుల్ ముత్తు" తయారైంది. 200వ చిత్రం "పడిక్కాద పణ్ణైయ్యార్"కు కూడా ఆయనే దర్శకుడు. "నా మనసు ఎప్పుడూ శుచిగా ఉంచుకుంటాను. మా వారు నేను పరస్పరం బాగా అర్థం చేసుకున్నాం. పెళ్ళయ్యాక 'సినిమాలలో నటించవచ్చా'? అని అడిగాను 'దానికేం? నువ్వు తల్లి అయ్యాక ఆ విషయం గురించి ఆలోచిద్దాం.' అన్నారు. అమ్మాయి పుట్టింది. మళ్ళీ అదే ప్రశ్న అడిగాను. 'బోలెడంత మంది నౌకర్లు, చాకర్లు ఉండగా నువ్వింట్లో చేసే పనేముంటుంది? నీకెలా పొద్దు పోతుంది? ఆక్టింగ్ కంటిన్యూ చెయ్యి.' అన్నారు. కంటిన్యూ చేస్తున్నా... మా అమ్మాయి ఇప్పుడు కాలేజీలో చదువుతోంది. ఎప్పుడో ఒకసారి తప్ప ఇంతవరకు మా అమ్మాయిని నాతో పాటు షూటింగ్‌కు తీసుకెళ్ళ లేదంటే మీరు నమ్ముతారా?" అంది విజయ దానిమ్మ గింజల్లాంటి పలువరుసతో నవ్వుతూ. ఈమె తొలి తెలుగు చిత్రం "శ్రీకృష్ణ పాండవీయం". ఇంతవరకు తమిళంలో 138, మలయాళంలో 42, తెలుగులో 24, కన్నడంలో 2 చిత్రాల్లో నటించింది. ప్రస్తుతం "సాగర్" 3-డి చిత్రం,"పగబట్టిన పాంచాలి", "ఉక్కు మనిషి", తమిళంలో 11, కన్నడంలో 1 చిత్రాల్లో నటిస్తోంది.

"బి. సరోజాదేవి ఆక్ట్ చేసిన పిక్చర్లు ఎన్నో చూశా గాని, ఇంతవరకు నేనామెను స్వయంగా చూడలేదు. ఈ దఫా బెంగుళూరికి వెళ్ళినప్పుడు తప్పకుండా కలుసుకోవాలి," అంటూ సుజాత మరో విషయం చెప్పింది: "కొచ్చిన్ పక్కనే ఎర్నాకుళంలో ఉన్న మా అమ్మకు బాగా సుస్తీ చేసింది. హఠాత్తుగా ఒక రోజు అర్ధరాత్రి సరిగ్గా పన్నెండు గంటలకు టెలిగ్రాం వచ్చింది. వొణికే చేతులతో మా వారు ఆ టెలిగ్రామ్ అందుకున్నారు. తీరా చూస్తే, నేను ఉత్తమ నటిగా బాలెట్‌లో ఎన్నుకోబడ్డట్టు 'సినిమా ఎక్స్‌ప్రెస్' అనే తమిళ పత్రిక పంపిన టెలిగ్రామ్మ్ అది. హమ్మయ్య - అనుకున్నాను."

★ ★ ★ ★ ★

శ్రీ రాజ్యలక్ష్మి సినీ ఆర్ట్స్ వారి "మరో రాక్షసుడు" చిత్రం షూటింగ్ కోడంబాక్కంలో ఒక బంగళాలో జరుగుతోంది. ఎక్కడో గ్లాసు తునాతునకలైన చప్పుడు విని రాధ నిమిషం పాటు కళ్ళు మూసుకుని అలాగే నిలుచుండిపోయింది. ఏమిటని అడిగాను. "కారు సడన్ బ్రేకు శబ్దం విన్నా, గ్లాసు ముక్కలైన చప్పుడు విన్నా భరించలేను." అందామె. "ఈవేళ సాంగ్ పిక్చరైజేషనా?" అని అడిగా. "అవునండి. అందుకే దీపావళి డ్రస్సులో ఉన్నా," అంది. "దీపావళి సీనా?" మళ్ళీ ప్రశ్నించా. "అబ్బే అది కాదండి. డ్యూయెట్‌లో డ్రస్సులు పదే పదే మారుస్తుండాలిగా? అందుకే దీపావళి కాస్ట్యూమ్ అంటుంటాను నేను, అంది నవ్వుతూ. కొంత దూరంలో శరత్‌బాబు, రాజ్యలక్ష్మి ఒక చోట కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఉన్నట్టుండి రాజ్యలక్ష్మి "మీకో విషయం తెలుసా? ఈ కంపెనీ నాది." అంది. శరత్‌బాబు క్షణకాలం తన చెవులను తానే నమ్మలేక "ఎలా?" అని అడిగారు. "ఈ కంపెనీ పేరులో నా పేరుంది కదా?" అంది రాజ్యలక్ష్మి చక్రాల్లాంటి కనుగుడ్లు తిప్పుతూ. "ఓస్-అదా?" అని శరత్‌బాబు ఫక్కున నవ్వేశారు





"అమెరికా అల్లుడు"లో భానుప్రియ, సుమన్

## "అనురాగబంధం"తో నగర సంచారం

గేటు దగ్గర దీప స్తంభం కింద భీముడు (సుత్తివేలు) కూర్చొని, దోమల్ని తోలుతూ పేపర్ చదవసాగాడు: "పాత నగరంలో ప్రశాంత పరిస్థితిని పర్యవేక్షించడానికి మారువేషంతో మంత్రిగారి పాదయాత్ర ... అవును ...–పూర్వ కాలంలో రాజులు రాత్రి పూట మారువేషాల్లో నగర సంచారం చేసి, ప్రజల కష్టసుఖాలు చాటుగా వినేవాళ్ళు. రేపో మాపో నేను ఫుడ్ మినిస్టర్‌ని కాక తప్పదు. ఇప్పట్నుంచే అలవాటు చేసుకోవాలి." భీముడు లేచి, చీరను తలపాగాలా చుట్టాడు. మీసాలు అంటించుకున్నాడు. దుప్పటి కప్పుకున్నాడు. చేతిలో కర్రతో కాలభైరవుడిలా నడకసాగించాడు. దారిలో కుక్క మొరిగింది. "పిచ్చి శునకమా! నేనే కాబోయే మంత్రిని. అలా మొరక్కూడదు. తప్పు. తోకాడించాలి," అన్నాడు. కుక్క తరిమింది. "దీనికి మర్యాద తెలిసినట్లు లేదే!" అంటూ పరుగున పక్క వీధిలోకెళ్ళి పడ్డాడు. అక్కడ ఫుట్‌పాత్ మీద పడుకుని నిద్రపోతున్న ఒకడ్ని లేపి, "సోదరా! ఓటరా! నీకు నీడ లేదా? గూడు లేదా? లేక – ఆలిపై అలిగి ఈ అరుగుపై శయనించావా?" అన్నాడు.

ఆ మనిషి అలవాటుకొద్దీ "బాబూ! పుట్టి గుడ్డి. ఓ పావలా దానం చెయ్యండి. వచ్చే జన్మలోనైనా కళ్ళుంటాయ్!" అన్నాడు.

"నా దగ్గరేముంది పడేయడానికి – ఖాళీ చెయ్యి తప్ప. ప్రజా సేవకుడ్ని."

"ఓహో! ఆ జాతా? అనవసరంగా నిద్ర చెడగొట్టావ్ కదవో!"

భీముడు మళ్ళీ నడకసాగించాడు. అదో గుడిసెవాసుల వాడ కట్టు ... కొందరు బయట నిద్రపోతున్నారు. వాళ్ళను చూస్తూ, "నా నగరమెంత తృప్తిగా నిదురోతోంది!" అని భీముడు అనుకుంటుండగా ఒక గుడిసెలోంచి "అబ్బా! వద్దు – వద్దు!" అని ఒక స్త్రీ మూల్గుడు, "చెప్పిన మాట విను!" అని ఒక పురుషుని గదమాయింపు విని పించగానే భీముడు ఆవేశంతో రెచ్చిపోయి, "ఔరా! నా రాష్ట్రంలో ఆడపడుచుల మీద హత్యాచారమా? నిన్నేం చేస్తానో చూడు!" అంటూ కిటికీని బలంగా తోసి, ఆ గుడిసెలోకెళ్ళి పడ్డాడు. అక్కడున్న యువతిని పట్టుకుని, "భయపడకు చెల్లెమ్మా! నేనుండగా వాడు నిన్ను చెరచలేడు," అన్నాడు.

ఆ యువకుడు రెచ్చిపోయి, "ఏం కూశావురా? నా పెళ్ళాన్ని నేను చెరుస్తున్నానా? అత్తోయ్! మావోయ్!" అంటూ కేకలెట్టాడు. నిమిషంలో జనం పోగై భీముడి వొళ్ళు హూనం చేశారు. "ఒరే రామా! ఈ దేశంలో నాలాంటి దేశభక్తులకు చివరికిలాంటి సన్మానం తప్పదా?" అని భీముడు మూల్గుతూ; ఆయాసంగా నడుస్తూ వెళ్ళిపోయాడు.

అనిల్‌కుమార్ దర్శకత్వంలో నందిగం దేవీప్రసాద్ సమర్పించే రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అనురాగబంధం" చిత్రానికి ఎన్. రామలింగేశ్వరరావు నిర్మాత. □




# అతి త్వరలో!



Bhaskar

PADMALAYA PUBS.

నందిగం దేవీప్రసాద్
సమర్పించు
రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అనురాగబంధం




ఎస్.రామలింగేశ్వరరావు

అనిల్ కుమార్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

# ఛాయా చిత్రాల పోటీ !

(ఫొటోగ్రఫీ పోటీ)

## మొత్తం బహుమతులు రు. 3000

మొదటి బహుమతి రు. 1000

రెండవ బహుమతి రు. 750

మూడవ బహుమతి రు. 500

ఒక్కొక్కటీ రు. 250 చొప్పున మూడు ప్రత్యేక బహుమతులు

**ముగింపు తేదీ : 15-6-85**

## నిబంధనలు

1. పోటీకి నలుపు-తెలుపు చిత్రాలనే పంపాలి. రంగుల చిత్రాలు పంపరాదు. ఛాయా చిత్రాలు తెలుగు సంస్కృతిని ప్రతిబింబింప చేసేవిగా ఉంటే మంచిది. ప్రకృతి దృశ్యాలని కూడా పంపవచ్చు.
2. ఛాయా చిత్రాల సైజు 8"×6"కి మించకూడదు. పోటీకి ఒక్కొక్కరు 3 చిత్రాలకన్నా ఎక్కువ పంపరాదు.
3. పోటీకి పంపే ప్రతి ఛాయా చిత్రం వెనుక వైపు అది తాము స్వయంగా తీసినదేనని హామీ రాస్తూ దానికి సంబంధించిన సాంకేతిక వివరాలని పేర్కొనడం అవసరం.
4. పోటీలో బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పి పంపగోరేవారు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరిచి పంపాలి. లేకపోతే వాటని తిప్పి పంపడం సాధ్యం కాదు.
5. బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పిపంపే విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోడం జరుగుతుంది. కానీ వాటి విషయంలో ఎలాంటి బాధ్యతని స్వీకరించటానికి వీలుకాదు.
6. పోటీకి పంపే ఛాయా చిత్రాలు జూన్ 15వ తేదీకి మా కార్యాలయానికి అందాలి. ఆ తర్వాత వచ్చే వాటిని స్వీకరించడం జరగదు.
7. పోటీకి పంపే ఛాయా చిత్రాలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "ఛాయా చిత్రాల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.
8. పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే. పోటీలో పాల్గొనే వారందరూ దానికి బద్ధులై ఉండాలి.

— సంపాదకుడు

# ప్రేమించవే మనసా......

అద్దేపల్లి సుచిత్రాదేవి

(గత సంచిక తరువాయి)

ఆ వేళ రాత్రి అందరూ కలిసి భోజనం చేస్తున్నప్పుడు రజియా సస్యకీ, సంజయ్‌కి యిద్దరికీ చెప్తున్నట్టు చెప్పింది.

"మధ్యాహ్నం ప్రకాష్ వచ్చారు, పాపని చూసేందుకు!"

సస్య ముద్ద నోట్లో పెట్టుకోబోతున్నదల్లా ఓ క్షణం ఆగిపోయింది.

"అంటే ఎటు ఆ సమయంలో తానింట్లో ఉండదని తెలిసీ కావాలనే వచ్చినట్టుంది. అంత ముఖం కూడా చూపనటువంటి, చూడలేనటువంటి ద్వేషమా? ప్స. పోనివ్వు!" కేర్‌లెస్‌గా అనుకోబోయింది. కానీ మనసు అంగీకరించలేదు

రజియా కూర వడ్డించబోతుంటే వద్దన్నట్టు చెయ్యి అడ్డు పెట్టింది.

"అదేం? నీకిష్టమైన కొబ్బరివేసిన కేబేజి కూరేగా?"

"వద్దులే. ఆకల్లేదు పెరుగు వేసుకుంటాను." అంటూనే పెరుగుతో రెండు ముద్దలు తిని లేచి వెళ్ళిపోయింది.

సత్యనారాయణగారు సాలోచనగా వెళుతున్న కూతురి వంకోసారి చూసారు. ఆయనకి మధ్యాహ్నం నుంచి అనుమానంగానే వుంది. ప్రకాష్ సస్య ఉండని వేళలో రావటం, కనీసం సస్య పేరైనా ఎత్తకుండానే పోవటం, ఇప్పుడు సస్య ప్రకాష్ ప్రస్తావన రాగానే ఏం మాట్లాడక అలా అన్నం మధ్యలో వదిలేసి వెళ్ళటం, యిద్దరికీ మధ్య ఏదో గొడవ జరిగిందని తెలుస్తోంది.

కొడుకువైపు చూసారాయన. "ప్రకాష్ వచ్చారు!" అని రజియా చెప్పినప్పుడు "ఆహా" అన్నాడే కానీ పుస్తకంలోంచి దృష్టి మరల్చలేదు భోంచేసేటప్పుడేకాదు ఆఖరకు టిఫిన్ తింటున్నాసరే సంజయ్‌కి తన ప్లేటు పక్కన ఎడమచేతివైపున టేబిల్‌పై పుస్తకము ఉండాల్సిందే. ఏదో ఒకటి చదువుకుంటూ తినటం చిన్నప్పటి అలవాటు.

**జరిగిన కథ–10:** భువనేశ్వరి, శివశంకరంగార్ల కూతురు శిల్ప. ప్రేమించిన శామ్ దూరమవడంతో ఆమె బ్రతుకే చీకటయి పోయింది. ఆమెను ఆ దిగులు నుంచి మరిపించేటందుకు సస్య శిల్పను తమింటికి తీసుకెళ్ళింది. విజ్జూ, సస్య, శిల్ప, సంజయ్, రజియా కలసి యాదగిరి గుట్టకు వెళ్ళి వచ్చారు. మరునాడు ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్ళిన శిల్ప మధ్యాహ్నం అయినా ఇంటికి రాలేదు. శిల్ప గండిపేటకు వెళ్ళి ఉంటుందని ఊహించి వెళ్ళిన విజ్జూ, సస్యలకు రౌడీలు వెంబడిస్తుంటే పరుగెత్తుకొస్తున్న శిల్ప కనబడింది. నిస్త్రాణగా పడిపోయిన శిల్పను ఇంటికి తీసుకు వచ్చారు విజ్జూ, సస్య. పెళ్ళి చేస్తే శిల్ప మనసు కుదుట పడుతుందని సస్య తండ్రితో అంటారు శివశంకరంగారు ప్రకాష్ మనసులో సస్య తన నసలు ప్రేమిస్తూందా? అనే ప్రశ్న ఉదయించింది. ప్రకాష్‌లో మార్పు సస్య పసిగట్టింది. శివశంకరంగారు శిల్పకు పెళ్ళి కొడుకుగా ఒక అబ్బాయిని చూసారు. అతని పేరు శ్రీనాథ్. మొదట శిల్ప వివాహానికి నిరాకరించినా తుదకు అంగీకరించింది శ్రీనాథ్ శిల్పల వివాహం జరిగి పోయింది. రజియాకు కూతురు పుట్టింది.

రజియా మామగారి ఆలోచనలు గ్రహించింది కానీ అప్పటికేమీ అనలేదు. అక్కడ్నుంచి తను గదిలో కెళ్ళిన తర్వాత సంజయ్‌పై కోప్పడింది.

"మీకసలు యింట్లో విషయాలేమీ పట్టవు!"

"కొత్తగా అదేం అభియోగం? నేనిప్పుడు చెయ్యాల్సిన పనులేం చెయ్యలేదు. లేక చేయకూడనివేం చేసాను పట్టించుకోక?"

"ఊ, మాటల్లో ఏం తక్కువలేదు!"

"మరింకెందులో తక్కువంటావోయ్ యిప్పుడు?" అల్లరిగా అడిగాడు.

"ఈ డబుల్ మీనింగ్ పదాలకేం బాగానే వాడుతారు. సినిమా కవులై ఉండాల్సింది మీరు. ఈ మధ్య వచ్చే మాటలు, పాటలు యిలాగే ఉంటున్నాయి!" వెక్కిరింతగా అన్నది.

"పాపం వాళ్ళు మామూలుగానే వ్రాస్తున్నారు. డబుల్ మీనింగ్‌లు వెతుక్కునే వాళ్ళకు అన్నీ అలాగే వుంటాయి." సమర్థింపుగా అన్నాడు

"మాటలు నేర్చిన వాళ్ళు ఎలా అయినా చెపుతారు కానీ అసలు విషయానికి రండి ముందు."

"వద్దామనే ఉంది కానీ డెలివరీ అయిన మూడు నెలలన్నా కనీసం దూరంగా ఉంటే మంచిదని...." అతని చిలిపి మాటలని మధ్యలోనే అడ్డుకుని "ఆపండి" అన్నది వస్తున్న నవ్వు దాచుకుంటు.

"నేను సస్య విషయం మాట్లాడుతున్నాను." అన్నది.

చెల్లెలు పేరు వినగానే అతను తన మూడ్ మార్చుకున్నాడు.

"ఏమిటిప్పుడు కొత్తగా సస్య విషయము?" తను మంచం పక్కనే వున్న ఉయ్యాల కదుపుతూ అడిగాడు.

"అరె, లేస్తుందేమో అది" వారించింది.

"లేవనీ, కాసేపు ఆడుకుంటుంది"

"ఆ రోజులు ముందువున్నాయి కానీ ముందు ఇది వినండి" అన్నది.

"ఏమిటి?"

"ప్రకాష్ సస్య సరిగా మాట్లాడుకోవటంలేదు. చూడబోతే విషయం కొంచెం తీవ్రంగానే ఉన్నట్టుంది!"

సంజయ్ విస్మయంగా చూసాడు." ఎప్పట్నుంచి?"

ప్రకాష్ సస్య కోసం రావటం, విజ్జూ దెబ్బవిని సస్య అతనితో చెప్పకుండానే వెళ్ళిపోవటం చెప్పింది.

"అప్పట్నుంచీ యిద్దరూ ముభావంగానే ఉంటున్నారు."

"మరిన్ని రోజులు నాతో చెప్పలేదేం?"

"అతను ఇన్ని రోజులు ఊరికి వెళ్ళే ఉన్నాడుకదా. వచ్చిన తర్వాత అయినా అన్ని రోజులు ఒకరి నొకరు చూసుకోక దూరమైతే మనసులు దగ్గరవుతాయి కదా అలుకలు, కోపాలన్నీ పోయి దగ్గరవరా అనుకున్నాను. కానీ అలా ఏం జరిగినట్టులేదు. సస్యకీ సంవత్సరంతో పరీక్షలయి పోతే సెలవుల్లోనే పెళ్ళి అని మనందరమూ అనుకుంటున్నాము కదా. ఇంతలో వీళ్ళిద్దరి మధ్యా యీ గొడ ఏమిటో? కాస్త మీరూ కనుక్కొని చూడండి!" అన్నది.

"ఏం అడగమంటున్నావు?"

"బాగుంది అదీ నేనే చెప్పాలా? ఏమయ్యా ఈ కోపతాపాలు ఉత్త ప్రణయ కలహాలేనా లేక సీరియస్‌గా ఏదైనా నిర్ణయానికొచ్చారా అని అడగండి. ముందు అనునయంగానే అడిగి చూడండి. మంచి అబ్బాయి, ఈడూ, జోడూ బాగుంది అని మామయ్యగారూ ఎంతో మెచ్చుకుంటూ పడేవారు. ప్రకాష్ కూడా సస్యంటే ప్రాణమన్నట్టు ఉండేవారు. మరెందుకో యిద్దరూ యిలా ప్రవర్తిస్తున్నారు.?" బాధగా అన్నది రజియా.

"సస్యకీ ప్రకాష్‌కీ నిశ్చితార్థం లాంటివేం జరక్క పోయినా అతనే యింటికి కాబోయే అల్లుడిగా అందరూ అనుకుంటున్నారు. మరిప్పుడు యిదేమిటి? ఇంతకీ యీ విషయం గురించి సస్య ఏమంటుందో. నాన్నకీ తెలుసా యీ సంగతి? పెళ్ళికాక మునుపే యిలా పంతాలు, అలుకలు అనే వీళ్ళిద్దరూ




పెళ్ళయితే ఎలా ఉంటారు?" ఆలోచిస్తూనే "నాన్నతో మాట్లాడి వస్తాను ముందు" అన్నాడు సంజయ్.

"మీ ఇష్టం !" అన్నది రజియా.

*　　*　　*

శ్రీనాథ్ తన పనులన్నింటిలో తీరిక చేసుకుని శిల్పతో చెప్పాడు తను వేసిన ప్రోగ్రామ్ గురించి.

శిల్ప ఎప్పటిలాగే మవునంగా తలవూపింది.

ఆ వార్త వినగానే శిల్ప ఎంతో సంతోష పడిపోయిందని, ఆ సంతోషం తాలుకు మెరుపులు కన్నుల్లో కనిపించాలనీ ఊహించుకున్న శ్రీనాథ్ ఆమెలో అలాంటి ఆనందం ఏమీ కనిపించక పోయేసరికి కాస్త ఉత్సాహం తగ్గినట్లయింది.

"అసలు యిలా వెళదామని నువ్వే అడుగుతావనుకున్నాను పోనీ నేను చెప్పినప్పుడయినా సంతోషపడతావనుకున్నాను!" అన్నాడు.

# ప్రేమించవే మనసా

"ఇప్పుడు నేను సంతోషంగా కాక ఎలా వున్నాను?" శిల్ప తెచ్చి పెట్టుకున్న నవ్వుతో అన్నది.

"మరి అన్నీ వేగం సర్దు. మావయ్యగారి దగ్గర కెళ్ళి చెప్పేసి వెళ్దాము." మరలా ఉత్సాహం తెచ్చుకుంటూ అన్నాడు.

శిల్పతో చెప్పేటప్పుడు పొరపాటున కూడా "మీ అమ్మగారు, మీ నాన్నగారు" అని అనడం అతని కలవడలేదు. ఎంతో మన్ననతో ఆప్యాయంగా "అత్తయ్యగారు, మావయ్యగారు" అని చెపుతాడు.

"అసలితనికి వివాహ జీవితంపై ఎన్నో అపురూపమైన కలలున్నాయి. తానితన్ని అనురాగంతో యిష్టపడలేనని తెలిస్తే తట్టుకోగలడా? పెళ్ళయిన నాటి నుంచీ చూస్తూనే వుంది కదా ఎంతో సున్నిత హృదయుడు. తను యితనికి సాహచర్యంలో సంతోషంగా ఉంటున్నట్లు కనిపించాలి లేకపోతే అనవసరంగా అతనికీ మనశ్శాంతి కరువు చేసిన దవుతుంది!"

ఆలోచనలకు కళ్ళెం వేస్తూ శ్రీనాథ్‌తో కలిసి యిద్దరికీ పదిరోజులకు సరిపడే బట్టలు, కావలసిన వస్తువులు సూటుకేసుల్లో సర్దింది.

భువనేశ్వరి, శివశంకరంగార్లు కూతురు అల్లుడూ అలావచ్చి తమ ప్రయాణం సంగతి చెప్పగానే ఎంతో సంతోషించారు.

"ముందుగా తిరుమల వెళ్ళి వెంకటేశ్వరుని దర్శించుకుని ఆ పైన మరెక్కడికైనా వెళ్ళిరండి బాబు?" అన్నది భువనేశ్వరి శ్రీనాథ్‌తో.

"అలాగేనండి?" అంగీకరించాడు శ్రీనాథ్.

శివశంకరంగారు ఫ్లయిట్ టికెట్ తీస్తానంటే శ్రీనాథ్ ఒప్పుకోలేదు "అక్కర్లేదేముంది. జాలీగా జర్నీ చెయ్యాలనుకుంటున్నాము. ట్రయినే బాగుంటుంది ఫస్ట్‌క్లాస్‌గా యిబ్బందేముంటుంది. నేనెప్పుడో బుక్ చేయించాను!" అన్నాడు.

"ఎప్పుడో రిజర్వేషన్ చేయిస్తే మరి మాతో ఎవరితోనూ చెప్పలేదే?" భువనేశ్వరి నవ్వుతూ అడిగినదానికి,

"శిల్పకి సర్‌ప్రైజ్‌గా చెప్పాలని!" నవ్వాడు శ్రీనాథ్.

అమ్మాయి అల్లుడు అన్యోన్యంగా ఉంటున్నందుకు పెద్దవాళ్ళిద్దరూ నిశ్చింతగా నిట్టూర్చారు.

ఫోన్‌లో కబురు అందుకుని ఆ రోజు స్టేషన్‌కు కావలసిన వారందరూ వచ్చారు. ట్రయిన్ మరి కొద్ది సేపట్లో కదలబోతోంది.

శ్రీనాథ్ శివశంకరంగారితో తన వ్యాపార విషయాలేవో చెపుతున్నాడు. భువనేశ్వరి కంపార్టుమెంటులో ఏదో సర్దుతుండగా విజ్జూ ఆమెకు సహాయం చేస్తున్నాడు.

శిల్ప, సస్య, భానుతేజ ఒక చోట నిలుచున్నారు.

"చిక్కిపోయావు శిల్పీ!" సస్య ప్రేమగా స్నేహితురాలి చెయి నొక్కుతూ అంటుంటే శిల్ప చిన్నగా నవ్వుతూ ఆ చేయి నలాగే పదిలంగా పట్టుకుంది.

"మరి మా శ్రీనూకి చిక్కిపోయారుగా శిల్ప. అందుకనే అలా కనిపిస్తున్నారు!" పక్కనే వున్న భాను ఆ మాటకి జవాబు చెప్పాడు.

"పాత చమత్కారమేనండీ యిది. నవ్వు రావటం లేదు" అన్నది సస్య వెంటనే.

"చమత్కారాలు, మమకారాలు ఎల్లప్పుడూ నిత్యనూతనంగా ఉంటాయట!"

"అబ్బో బరువైన డైలాగు! తెలుగు నవల లెక్కువ చదువుతున్నట్టుంది!" నవ్వింది సస్య.

"అవును ఒకసారి మీరే నాకు తెలుగు సరిగా రాదని వేళాకోళం చేసారుగా. అప్పట్నుంచీ ఎడాపెడా తెలుగు పుస్తకాలన్నీ చదివేస్తున్నాను. మరికొన్ని రోజులు పోతే నేనూ తెలుగులో కవిత్వం మొదలెడతామనుకుంటున్నాను." ధీమాగా అన్నాడు.

అతను చెపుతున్న తీరు చూసి శిల్ప కూడా నవ్వింది. శిల్ప నవ్వు చూసి ఆమెతో నూ మాటలు కలిపేందుకు ధైర్యం వచ్చింది భానుకి.

"చూడబో తే మీరు చాలా సైలెంట్ పర్సన్‌లాగ ఉన్నారు. మా వాడూ దాదాపు అంతే. ఇక మీ ఇంట్లో వినిపించేది ఎపుడూ నిశబ్ద సంగీతమే కాబో లు!"

"నిశబ్ద సంగీతమెలా ఉంటుందో?" సస్య కావాలని సందేహంగా అడిగింది అతన్ని యిబ్బందిలో పడేస్తూ.

"అంటే .... అంటే ....?" ఒక్క క్షణం ఏం చెప్పాలో తెలియనట్లు చూసాడు.

అతని అవస్థను తమాషాగా గమనిస్తున్నారు అమ్మాయిలు.

"అంటే శబ్దం లేని సంగితమేమిటి అనికదా మీ ప్రశ్న. పెదవి విప్పకుండానే మాట్లాడటం అన్నమాట!" అన్నాడు.

"అంటే కళ్ళతో మాట్లాడటము" వీళ్ళ వేపు వస్తూ భాను మాటలు విని అందించాడు విజ్జు.

"యా. యా. అంధులకు బ్రెయిలీలా యీ కళ్ళ బాష ప్రేమికులది. మాటల ఎకనమిస్టులది!" పూర్తి చేసాడు భానుతేజ.

"మొత్తానికి భలే చెప్పారండీ బాబూ మార్తాండతేజా!" ఆ వివరణకు తమాషాగా అన్నాడు విజ్జు.

"అదేమిటి పేరు మార్చేశారు. నా పేరు భానుతేజ!" అన్నాడు భాను.

"రెండూ ఒకటే తెలుగు నిఘంటువు చూడండి!" చెప్పింది సస్య నవ్వు దాచుకుంటూ.

"అంతేనంటారా? అయితే యిక మీదట తెలుగు నవలలు కాక తెలుగు నిఘంటువు చదవాలన్న మాట!" భాను కొంచెం తెల్లబోతూ అన్నదానికి అందరూ ఫక్కున నవ్వారు.

"భానుతేజ కూడా సస్యలాగ మంచి మాటకారి!" అనుకుంది శిల్ప. ఇంతలో రైలు బయలుదేరుతుండటంతో శిల్ప, శ్రినాధ్ వెళ్ళి ఎక్కేసారు. అందరూ చేతులూపుతుండగా రైలు ఆ పూట ఉత్సాహంగా కదిలి ముందుకెళ్ళిపోయింది.

★ ★ ★ ★ ★ ★

అనుకున్నట్లుగానే ముందు తిరుమలలో స్వామిని దర్శించుకుని అక్కడే కాటేజి తీసుకుని ఓ రోజుండి తర్వాత రోజు బెంగుళూరుకి బయలుదేరారు.

ఆ వేళ సాయంత్రం లాల్‌బాగ్, కబ్బన్ పార్కు చుట్టి వద్దామనుకున్నాడు శ్రీనాధ్. శిల్ప సన్నని చెక్స్‌కి ప్లెయిన్ బోర్డరున్న లేత నీలం సిల్కు చీర కట్టుకుని పొడవైన పైటకు భుజం దగ్గర జాకెట్‌కి పిన్ను పెట్టింది. హొటల్ రూమ్ లాక్ చేసి బయటకొచ్చారు. షాల్ కప్పుకుని శిల్ప తన పక్కన నడుస్తుంటే శ్రీనాధ్‌కి గర్వంగా అనిపించింది. అందమైన భార్య తనకున్నందుకు. అతనికి రెండు రోజులుగా శిల్ప కాస్త దగ్గరయినట్లనిపించింది కూడా.

పార్కులో తిరుగుతుండగా "అయిస్ క్రీం తిందామా?" అని అడిగాడు శ్రీనాధ్. శిల్ప తల వూపటంతో "నువ్వు మళ్ళీ నడవటం ఎందుకు. యిక్కడే వుండు తీసుకువస్తాను. అటు వైపున్నట్లుంది" అంటూ వెళ్లాడు.

చిన్నగా అడుగులు వేస్తూ చుట్టూరా కలియచూస్తున్న శిల్ప చూపులు ఓ చోట అలాగే నిలిచిపోయాయి.

అటు పక్క నుంచి శామ్ తల్లి, అక్క దోరతి మరింకిద్దరు ముగ్గురెవరో కలిసి వస్తున్నారు. శిల్ప చూసినపుడే సరిగా యిటు చూసిన దోరతి వడివడిగా ముందుకు నడిచింది శిల్ప వైపు చెయ్యి వూపి.

శిల్ప బొమ్మలా నిలుచుండిపోయింది

"బాగున్నారా? ఎవరితో వచ్చారు?" దగ్గరగా వచ్చి అడిగింది.

కష్టం మీద గొంతు పెగుల్చుకుని చెప్పింది శిల్ప.

"మా వారితో"

"ఓ." ఆవిడ కనులు పెద్దవయాయి. "పెళ్ళిచేసుకున్నారా?" అని మరలా తనే గతగడా చెప్పింది.

"శామ్ పోవటంతో అమ్మ మా దగ్గరే వచ్చి ఉంటుంది. అల్లుడింట్లో ఉండటము ఆవిడకు యిష్టం లేకపోయినా తప్పలేదు." యింకా ఏదో

# సుభాషితాలు

రూప యౌవ్వన సంపన్నా
విశాల కుల సంభవాః
విద్యా హీనా నశోభంతే
నిర్గంధా ఇవ కింశుకాః''




మంచి అందం, యౌవ్వనం కలిగి యుండినప్పటికీ, గొప్ప కులంలో పుట్టి యుండినప్పటికీ చదువు లేనివారు వాసనలేని మోదుగ పువ్వులవలె శోభించరు.

మనస్యేకం వచస్యేకం
కర్మణ్యేకం మహాత్మనామ్
మనస్యన్యత్ వచస్యన్యత్
కార్యే చాన్యద్దురాత్మానామ్''




మహాత్ములకు మనస్సులో నుండునట్టిదొకటే వారు చెప్పునదీ యొకటే, చేయునదీ యొకటే. దుర్మార్గులకైతేనో వారికి మనస్సులో నుండునట్టిదొకటి, వారు చెప్పునది మరొకటి, చేయునది వేరొకటి.

–ఆయుర్వేద శిరోమణి రాజ రాజేశ్వరశర్మ

# ప్రేమించవే మనసా

చెప్పబోతుండగా వాళ్ళూ దగ్గరకొచ్చేసారు. తల్లి వైపు తిరిగి చెప్పింది డోరతి. "అమ్మా శిల్ప! పెళ్ళి అయిందట. భర్తతో వచ్చింది యిక్కడికి. హనీమూన్ కాబోలు!"

ఆవిడ మింగేశాలా చూసింది ముందు కూతురి వైపు శిల్పతో మాట్లాడినందుకు కాబోలు. తర్వాత తిరస్కారంగా చూస్తూ అన్నది.

"ఎందుకు కాదూ? పెళ్ళి! బోలెడు డబ్బుందిగా తిరిగి చూసేసరికి దేన్నయినా కొంటారు. నాకంటే కొడుకు తిరిగి రాడు కానీ ఆవిడకి మొగుడెందుకు రాడు? చచ్చి ఏ లోకాన వున్నాడో బంగారు తండ్రి ఈవిడగారు లేకపోతే బ్రతకలేనన్నాడు. ఇది తెలుస్తుందా వాడికి? ప్రేమట ప్రేమ! వాడు పోయి ఆరు నెలలు కాలేదు పెళ్ళిట! ఛీ!" ఆవిడ యింకా గొణుక్కుంటూనే ముందుకెళ్ళి పోయింది ఒక వంక కన్నీళ్ళు ఒత్తుకుంటూ. పక్కనున్న వాళ్ళేదో చెప్పి ఓదారుస్తున్నారు.

"ఏమనుకోకండి. అమ్మ తమ్ముడి మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. అర్థాంతరంగా వాడలా ఏక్సిడెంట్‌లో చనిపోవటం యీవిడ స్వభావమే మారిపోయింది. వస్తాను". ముందు వాళ్ళు వెళ్ళిపోతూ ఉండటంతో డోరతి కూడా నడుస్తూ వెళ్ళిపోయింది వాళ్ళను కలుసుకునేందుకై.

శిల్ప నిల్చున్న చోటే భూమికి పాదాలు అతుక్కుపోయినట్లు అలాగే నిల్చిపోయింది. ఆ భూమి విచ్చుకుని సీతాదేవిని ఆనాడు తనలోకి లాక్కున్నట్లు లాక్కోకూడదు. ఆవిడన్ని మాటలు తన నంటుంటే అనిపించింది.

మనసులోని గాయం పూర్తిగా మానుదలకు రాక మునుపే మళ్ళీ అంతలో కర్కశంగా రేపినట్లయింది. ఒడ్డునే ఆదమరిచి పోతుండగా హఠాత్తుగా ఓ కడలి కెరటం ఉవ్వెత్తున లేచి వచ్చి ముంచేసినట్లుగా ఉక్కిరి బిక్కిరి అవుతుంది అంతరంగం.

శామ్ అమ్మగారన్న మాటలన్నీ పదే పదే ప్రతిధ్వనిస్తున్నాయి చెవుల్లో.

శ్రీనాథ్ రెండు చేతులలో అయిస్ క్రీమ్ పట్టుకుని వచ్చి మామూలుగా ఆమెకో కప్పు అందివ్వబోతూ ముఖం చూసాడు. అతనిలోని ప్రసన్నత ఎగిరిపోయింది.

ఆశ్చర్యంతోనూ, ఆందోళనతోనూ భార్యని కదిపాడు. చెంపలపై జారుతున్న కన్నీటిని తుడుచుకునే స్పృహ కూడా లేనట్లు, ఆ నిలుచున్న భంగిమ, ఆ చూపులు. అతనికేమీ అర్థం కాలేదు.

"ఇంతలో ఏమయింది?" అనుకున్నాడు.

"శిల్పా, శిల్పా"

"......"

"నిన్నే ఏం జరిగింది? ఆ కన్నీళ్ళేమిటి?" అతని చేతుల్నుంచి అయిస్ క్రీమ్ కప్పులెప్పుడో జారిపోయాయి.

శిల్ప నుంచి జవాబు లేదు సరికదా ఆ కన్నీరాగటం లేదు. ఇక ఆమె నక్కడే ప్రశ్నిస్తూ నిలబడటం చుట్టుపక్కల జనాన్ని ఆకర్షించటమే అనుకుని "నడువ్ రూమ్‌కి పోదాం!" అంటూ చెయి పట్టుకున్నాడు. అక్కడ్నుంచి గేటు దాకా ఎలా నడిచిందో, టాక్సీ ఎలా ఎక్కిందో, గదికి ఎలా చేరుకుందో శిల్పకే తెలియదు.

అప్పటికీ ఆమె కళ్ళు శ్రావణ మేఘాల్లా వర్షిస్తూనే ఉన్నాయి. రూమ్‌కి రావటం ముందు తలుపు గడియపెట్టి విసురుగా శిల్ప వంక తిరిగాడు శ్రీనాథ్.

"వెళ్ళేటప్పుడు బాగానే ఉన్నావుగా. అంతలో ఏం జరిగింది. ఏమిటంత దుఃఖం? చెప్పకుండా అలా ఏడుస్తుంటే నాకేం తెలుస్తుంది?" అరిచినట్లే అడిగాడు.

శ్రీనాథ్ కంఠంలో కోపం, అసహనం దాచినా దాగటంలేదు. అయినా శిల్ప నుంచి పలుకు లేదు. అతనిలో సహనం పూర్తిగా చచ్చిపోయింది.

"అసలిది చెప్పు. నువ్వీ పెళ్ళి యిష్టపడే చేసుకున్నావా? నేనూ అప్పటి నుంచి చూస్తూనే ఉన్నాను. ఎప్పుడూ అలా ఎవరో చచ్చినట్లు ఆ దిగులు ముఖం, విరక్తి, ఉదాసీనత! ఆ, ఊ, లు తప్ప మాటలే రానట్లు ఆ మూగతనం, మనిషి దగ్గరకొస్తుంటే ఏదో పులిని చూసినట్లే బెదిరిపోవటం. ఎన్ని రోజలని సర్దుకుపోను, ఎదురు చూడను? కొత్తనుకున్నాను కొన్ని రోజులు. ఇంకా బిడియం తీరలేదు కాబోలు అనుకున్నాను యిన్ని రోజులు. కాదు, యిదంతా అయిష్టత. ఏమిటసలు నీ ఉద్దేశం? అంత నేనంటే యిష్టం లేనప్పుడు పెళ్ళికెందుకు ఒప్పుకోవాలి. ఎందుకిలా నాతో ఆటలాడుకోవటం?"

అన్ని రోజులుగా అతనిలో వున్న ప్రశ్నలు, అనుమానం, ఆవేశం ఒక్కసారిగా బయటపడ్డాయి.

"మాట్లాడవేం?" శిల్ప భుజం దగ్గర గుచ్చి పట్టుకున్న అతని చేయి ఆమెని వూపి వేస్తుంది.

ఊహించని ఆ విసురుకి బిత్తరపోయిన శిల్ప యిక అతను కొట్టటమే తరువాయి అన్న ఆలోచనతో కనులు గట్టిగా మూసుకుని దానికీ సిద్ధపడినట్లు ఊపిరి బిగపట్టి ఎదురు చూడసాగింది.

శిల్పనలా చూడగానే ఒక్కసారిగా అతని ఆగ్రహం అంతా జారిపోయింది.

"ఏం చేయబోతున్నాడు తను?" తనని తాను కంట్రోలు చేసుకుంటూ ఆమెని గభుక్కున వదిలేసి పక్కనే వున్న సోఫాలో వాలిపోయాడు అలసటగా.

ఒక్కసారిగా ఆ గదిలో నిశబ్దము అలుముకుంది. నెమ్మదిగా కనులు తెరిచింది శిల్ప. శ్రీనాథ్ వైపు చూసింది.

పందెంలో ఓడిపోయిన ఆటగాడిలా కూర్చుని ఉన్నాడతను! మెల్లగా అడుగులు వేసుకుంటూ అతని దగ్గరగా వచ్చింది.

"తనని మనసారా కోరి వివాహం చేసుకున్నాడితను. ఫలితం తనితన్ని క్షోభ పెట్టడం న్యాయమా? నా ఖర్మకి మధ్యలో యితని అపరాధం ఏమిటి? యితన్నెందుకు బాధపెట్టాలి? భగవాన్ నాక్కాస్త నిగ్రహాన్ని ప్రసాదించు!" కాస్త ముందుకు వంగింది. శిల్ప చీర చెంగు తగిలి అతను ముఖానికి అడ్డుపెట్టుకున్న చేతులు తొలగించాడు.

"నన్ను .... నన్ను క్షమించండి" అస్పష్టంగా వచ్చిందా మాట శిల్ప పెదవులు దాటి.

శిల్ప చేతులు పట్టుకుని లాగి తన పక్కనే కూర్చోపెట్టుకున్నాడు శ్రీనాథ్.

"శిల్పా, ఆ మాట నేనూ అనాలి. అనవసరంగా ఆవేశపడ్డాను. నేనన్న మాటలన్నీ మర్చిపో. ఇప్పుడు చెప్పు ఏమయింది? ఉన్నట్లుండి అక్కడ ఎందుకలా అయిపోయావు?" లాలనగా అడిగాడు.

"ఏం లేదు!" మెల్లగా అన్నది శిల్ప.

ఇక ఆమె చెప్పదని తెలిసిపోయింది. ఒక్క క్షణం భార్య కళ్ళలోకి చూసి చేతులు వదిలేసాడు. లేచి నిలబడుతూ అన్నాడు.

"ఊరికి వెళ్ళి పోదాం!"

★ ★ ★ ★ ★ ★

పరిసరాలన్నీ జనవరి నెల చలిలో బద్ధకంగా ముడుచుకుని ఉన్నాయి. ఉదయం ఏడున్నర కావస్తున్నా యింకా రాత్రి కమ్మిన పొగమంచు ఉండనా, కరగనా అని తటపటాయిస్తూనే ఉంది.

బాల్కనీలో యీజీచైర్లో వాలి కనులు మూసుకుని ఉన్నాడు శ్రీనాథ్. పక్కనే టీపాయ్ మీద టేప్‌రికార్డర్ లోంచి సుబ్బలక్ష్మి స్వరం శ్రావ్యంగా వినిపిస్తుంది.

సెలయేరులా సాగుతుందామె గొంతులో పాట.

"భావయామి రఘునాథం"

"మనుజుడై పుట్టి, మనుజుని ప్రేమించి అనుదినమును దుఃఖపడనేల?"

"శ్రీరంగపుర విహార!"

ఒకదాని వెంట మరొకటి అదో రాగ ప్రవాహం.

"రాలనైన కరిగించు నీ గాన మాధురిలో

నేనోల లాగితి, నీ మ్రోల వాలితి!"

అనా- నిపిస్తుంది ఆ సంగీత సరస్వతితో.





















# సిక్కో కోక్
## వీలైన వంటకు పొదుపైన ఇంధనం

శాస్త్రీయ పద్ధతిలో సిక్కో కోక్ తయారు చేయువారు.

**ది సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్,**
**ఆంధ్రప్రదేశ్.**

Sista's/SCCL/230/85/Tel







# ప్రేమించవే మనసా

ఆ కౌసెట్ పూర్తిగా అయినా తర్వాత కూడా అతనికి అక్కడ్నుంచి లేవాలని పించలేదు ఆఫీసుకి వెళ్ళాల్సిన టైమ్ అవుతూందని లో నుంచి అనిపిస్తున్నా.

పక్కింట్లోంచి పిల్లల మాటలు. మారాములు, కేకలు గాలితో పాటు అపుడపుడూ తేలి వస్తున్నాయి.

"ప్చ్ తమ యిల్లు మాత్రం ఓ నిశబ్ద పర్వతంలా వుంది" అనుకున్నాడు.

నిశబ్దం ప్రశాంతంగానే ఉంటుంది. కానీ యిది మౌనం, భరించలేని మౌనం.

"పెళ్ళి అయితే!" అని అతను కన్న అందమైన కలలన్నీ చెదిరిపోయాయి.

ఆ స్వప్నలోకం అతని కందరాని దూరమై గేలిచేస్తుంది. బేంగ్ళూర్ నుంచి వచ్చిన తర్వాత భార్యాభర్తల మధ్య తెర దించేసినట్లుంది.

శ్రీనాధ్‌కి జీవితమంతా స్తబ్ద గా మారిపోయినట్లుంది. ఎంతో అవసరము అయితే తప్ప ఒకరితో ఒకరు మాట్లాడు కోవటం లేదు.

ఒకే మంచంపై నిదురిస్తున్నా పొరపాటున కూడా ఒకరి చేయి మరొకరికి తగలటం లేదు.

"ఆనందం అయితే పదుగురితో పంచుకో

వేదనలే అయితే నీలో నే ఉంచుకో!" అనే తత్వం అతనిది. అందుకే తన బాధ ఎవరితో నూ చెప్పుకోలేదు.

ఇక యిలా ఎంతో కాలం మాత్రం ఉండలేమనిపిస్తుంది శ్రీనాధ్‌కి.

శిల్పని మార్చాలంటే శక్తీ, ఆసక్తీ రెండూ లేవు యిప్పుడు. వ్యాపారం, బయటి పనులన్నా క్రమంగా ఉత్సాహం తగ్గిపోతుంది. జీవితంలో ఎవరు శాంతినిస్తారో, ఎవరశాంతిని తెస్తారో ఎవరూ ఊహించలేరు ఒక్కోసారి.

మనుషుల వేదనలు, వేడుకలు ఏ మాత్రం పట్టించుకోని కాలచక్రం తిరుగుతూనే ఉంటుంది. కాలంతో పాటు మనుషుల కదలికలు తప్పవు!

లేచి లోపలికి నడిచాడు శ్రీనాథ్.

స్నానం చేసి, డ్రెస్ చేసుకుని కిందకి వచ్చాడు. టేబిల్‌పై బ్రేక్‌ఫాస్ట్‌కి అరేంజి చేస్తున్న శిల్ప అతన్ని చూడగానే తన పని లోంచి తలెత్తకుండానే చెప్పింది.

"భానుతేజ మీ కోసం ఫోన్ చేసారు."

"నన్ను పిలవ లేదేం?"

"పిలవనా అంటే వద్దన్నారు. ఏం చేస్తున్నారు అని అడిగి తన పేరోసారి మీకు గుర్తు చేయమన్నారు."

కుర్చీ లాక్కుని టేబిల్ ముందు కూర్చుంటూ ఆలోచించాడు. "తన పేరు గుర్తు చేయమనటం ఎందుకు?"

హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది శ్రీనాధ్‌కి. చేతినున్న వాచ్ వంక చూసుకున్నాడు. జనవరి ఎనిమిది! భాను పుట్టిన రోజు!

"అరే తనెలా మర్చిపొయ్యాడీ సంగతి?" గభుక్కున కుర్చీలోంచి లేచాడు. టెలిఫోన్ దగ్గర కెళ్ళి నెంబర్ తిప్పాడు.

"హలో, భానూ? విష్‌యూ హేపీ మెనీ రిటర్న్స్ ఆఫ్ ది డే!"

అవతల్నుంచి భాను కంఠం కాస్త నిష్ఠూరంగా ధ్వనించింది.

"థాంక్యూ, బర్త్‌డే విషస్ నేనే గుర్తు చేసి అందుకోవాల్సి వచ్చింది కదూ?"

"సారీ భానూ, నిన్న కూడా అనుకున్నాను. పొద్దున్నే ఏమిటో ఆలోచనలో పడిపోయాను." శ్రీనాధ్ కంఠంలో నిజంగానే పశ్చాత్తాపం ఉంది.

భానుతేజ బర్త్‌డే ఘనంగా జరుపుకుంటాడు. ఆ రోజు ఉదయాన్నే అతనికి మొట్టమొదటి శుభాకాంక్షలు ఎప్పుడూ శ్రీనాధ్ చెప్పేవాడు. పదిహేనేళ్ళ బట్టి జరుగుతున్న దది.

"మనం స్నేహితులమై నప్పట్నుంచీ, అంటే పదిహేనేళ్ళ నుంచి వస్తున్న ఆనవాయితీ యీరోజు పోయింది. పెళ్ళి నాయనా పెళ్ళి! శ్రీమతిగారి సాన్నిధ్యంలో స్నేహం, గీహం వుష్‌కాకి అయినట్లున్నాయి. అసలు నువ్వు నన్ను కలుసుకుని ఎన్ని రోజులయింది. ఆ రామచంద్రాపురం దాటి రానంటుందా నీ మనసు?"

"అదేం లేదు భానూ. కారుకి చిన్న ట్రబుల్!" సర్ది చెప్పబోయాడు.

"తొయ్యకోయ్ నెపం కొత్త కారుపైన. సరే యిప్పు డెన్నింటి కొస్తున్నావు?" అడిగాడు.

"సాయంత్రం వస్తాను."

"తంతాను!"

"మరేం చెయ్యమంటావు?"

"ఓష్, అదీ మర్చిపోయావా ఏమిటి? నువ్వు మరేం మాట్లాడకుండా వెంటనే బయలు దేరు. మమ్మీ నీ కోసం పెసరట్లు ప్లస్ చీవాట్లతో రెడీగా ఉంది! ఆ, అన్నట్లు శిల్ప అక్కడే అయ్‌మీన్ ఆ పక్కనే ఉన్నారా?"

"ఆ!" అంటూ పక్కకు చూసాడు శ్రీనాథ్.

టేబిల్ అంచులపై చేతులుంచి యిటే చూస్తుంది శిల్ప.

"ఓ నిముషం ఫోన్ అందుకోమను" తాను అనటంతో కళ్ళతోనే శిల్పని దగ్గరకు రమ్మన్నాడు శ్రీనాధ్.

దగ్గర కొచ్చిన శిల్పకి రిసీవరిచ్చి అక్కడే నిలుచున్నాడు. అంత క్రితమే తలంటుకున్నట్లుంది శిల్ప. ఇంకా కొద్ది కొద్దిగా తడి ఆరని కురులలోంచి షాంపూ పరిమళం అలలా తేలి వస్తోంది అతని మీదకి.

(ఇంకా ఉంది)

రివ్వున దూసుకొచ్చిన ఆటోను చూసి చిన్నపిల్లలా కేరింతలు కొడ్తూ ఆటో కడ్డం వచ్చింది అందులో ఎక్కించమని అభినయిస్తూ పిచ్చి మంగి.

తల్లి గర్భంనుండి బయల్పడ్డ శిశువులాగే... వో కొత్త సృష్టిలాగే కన్పిస్తుం దెప్పుడూ వెంకటేశుకు మంగి. అలా యెందుకన్పిస్తుందో అతడికి తెల్సు. యే ఆలనా పాలనా లేక గాలిలో, నీటిలో, దుమ్ములో, ధూళిలో పెరిగిన వో ప్రాణిగా మంగి తెలుసతడికి. దాని వెర్రితనం, అమాయకత్వం అంతకన్నా బాగా తెల్సు. వొంట్లో వయసు తెచ్చిన మార్పులు మనసులో మార్పు తేలేకపోయాయి మంగిలో. అందుకే యే తల్లో యేక్షణంలోనో దయతల్చి కట్టబెట్టిన లుంగీ వంటి పాత చీరస్థానే చీర వుండక, పురి తీయబడ్డ శవంలా పైట నేలపై వ్రేలాడుతూ... నుడికట్టులోని గడి చెదిరిన అక్షరంలా చనుకట్టుపై ముడివీడిన మూరెడు రైక కొసలు విరబోసుకున్న ముందుకు పడ్డ ఆ నాలుగు రాగి తల వెంట్రుకలతో పోటీ పడ్తుంటాయి. ఎప్పుడూ బొట్టులేని దాని బోడి నుదురు గుడిలో లేని, పూజకు పోని శివలింగంలా కన్పించేది.

దాని ఆకృతి పూర్తిగా... మొండి కుంచెతో... అర్థం తెలీని పిల్లాడు ఆడుకోను గీసిన తమాషా బొమ్మలాగే వుంటుంది.

తనకు వయసొచ్చిందని దానికి తెలీదు. ఆ చూసే వాళ్ళకూడా తెలీదని అనుకుంటాడు వెంకటేశు.

గర్భస్థ శిశువులా కన్పించే ఆ అమాయకురాలు నవ్వితే ప్రకృతే పులకించినట్టు ఫీలవుతాడు. పసిపాపలా ఆ పిచ్చిముండని లాలిస్తాడు. దాని కళ్ళలోని ఆశ కనిపెట్టి మాటలు రాని ఆ మూగ మనసు కోర్కె తీరుస్తూ... అడిగిందల్లా కొనిపెడ్తాడు. ఆ పిచ్చిది అతడికేమవుతునదో మనలాగే అతడికీ తెలీదు.

కొత్తలో వొకనాటి మాట....

ఆ పిచ్చి దాని వొంటి నిండా గాయాలు...

పిచ్చికుక్కల్లా వెంటబడి రాళ్ళతో కొడ్తూ వెంటబడి తరుముతున్న మంచి మంచి వాళ్ళ పిల్లల్ని కళ్ళారా చూశాడు వెంకటేశు. అందర్నీ వెదరగొట్టాడు. ముళ్ళ కంచెలకూ, రాళ్ళకూ రప్పల కడ్డంపడి... కారుతున్న రక్తంతో రొప్పుతున్న ఆ పిచ్చిదాన్ని లేవనెత్తి యింటికి పిల్చుకొచ్చి, గాయాలకు మందు రాశాడు. అడుగంటిన ఆ పిల్ల కడుపుకింత అన్నం పెట్టించాడు.

అప్పట్నుండే... సరిగ్గా అప్పట్నుండే... విసిరి-కొట్టినా, కసిరికొట్టినా... చీమ కుట్టినట్టైనా ఫీలవక, కాళ్ళ కడ్డంపడి, ఆటో కడ్డంపడి, తన మూగ భాషలో, పిచ్చి సైగల్తో యేదో చెబుతూ, ఆటోలో ఎక్కించమని, చేతిలో వున్నది పెట్టమని, అదే పనిగా, పెంపుడు పిల్లిలా వెంట తిరుగుతున్న దాని బారి కేగలేక అలాగే చేశాడు. ఆ పైన దాన్నాపటం అతడి తరం కాలేదు. విధిలేక కొన్నాళ్ళు, విసుగుతో కొన్నాళ్ళు, జాలితో మరికొన్నాళ్ళు, అలా చేసిన ఆ అలవాటు క్రమేపీ తెలీని యేదో అభిమానంగా రూపొందిం దతడిలో.

ఎవ్వరో నవ్వుతారన్న బాధలేదు. విసుక్కుంటారన్న చింత లేదు. యెందుకంటే అవన్నీ యెప్పుడో అయిపోయాయి. లోకాన్ని గెలిచింది వెర్రిదాని అభిమానం. అన్నింటినీ అధిగమించి సృష్టిలోని ఆ అమాయక ప్రాణి అతడి దృష్టిలో కొచ్చింది.

ఆ పిచ్చిది... గౌన్లు తొడిగే వయసులో దిగంబరంగా, లంగాలు కట్టే ప్రాయంలో బొంది తెగి ముడేసుకున్న చిన్న చెడ్డీ ముక్కతో తెల్సు వెంకటేశుకు. పైట వేసే పరువంలో గజంపైనున్న అడ్డగుడ్డ వంటి ప్రస్తుతపు ఆచ్ఛాదనతో తెలుసు. అన్నింటికీ మించి ఆ పిచ్చిది అనాధగా కూడా తెల్సు. ఇలా యేదేదో దాని గురించి తెల్సిన వెంకటేశుకు దాన్ని కసురుకోవటం యిప్పుడు తెలీటం లేదు.

"ఇ..హ్హి...హ్హి"

ఆటో చుట్టూ చప్పట్లు కొడ్తూ ప్రదక్షిణం చేస్తున్న పిచ్చిదాన్నాపి ఆటోలో కూర్చోబెట్టు కున్నాడు. ఓ నాల్గు రౌండ్లు అలా అలా త్రిప్పి పిల్లాడి కోసం కొన్న, దాని కోసమూ కొన్న నాల్గు చాక్లెట్లలో వో రెండు దాని చేతిలో వుంచి, స్వర్గంలోని రంభలా ఆనందంతో నాట్యం చేస్తున్న



ఆ పిచ్చిదాన్ని చూస్తూ తెలీని సంతృప్తితో వెనక్కి తిరిగాడు.

తనింటి కెదురుగా వున్న ఆ పెద్ద మేడింటి ముందు ఆటో ను ఆపి అద్దె డబ్బులా యజమాని చేతిలో పోసి, మెల్లగా తనింటి వేపడుగులు వేశాడు వెంకటేశు.

* * * *

ఆ రోజు....

వెంకటేశు మనసులో యేదో అసంతృప్తి.

ఎప్పుడూ అక్కడి కెదురొచ్చి మారాం చేసే పిచ్చి మంగి జాడలేదు.

చుట్టూ సునిశితంగా పరిశీలించాడు.

అల్లంత దూరాన... కూలిపోయిన పాత దేవాలయం గోడ కానుకుని, కాళ్లార జాపుకుని కూర్చున్న పిచ్చిది... చెదలు తిన్న పుస్తకంలా... చెదిరిన తిలకంలా... కన్పించిందతడి కళ్లకి.

గబ గబా ఆ వేపడుగులు వేశాడు వెంకటేశు.

చేతిలోని మిఠాయి పొట్లం తీసి దాని కందించాడు. అందుకోలేదు పిచ్చిది. తలటు తిప్పుకుని, పాతిన బండరాతిపై వొరిగి అటు తిరిగి పడుకుంది. నోట్లోంచి యేవో వింత వింత శబ్దాలు... అది యేడుపో, అయితే అది యెందుకో... కాకుంటే అది పిచ్చినవ్వో తెలీలేదు వెంకటేశుకి.

కొత్తగా, వింతగా కన్పిస్తున్న దాని వాలకం అతడి కంతు పట్టలేదు.

"పిచ్చివాళ్ల నర్థం చేసుకోవటం పిచ్చివాళ్లకే తరమేమో!" అనుకుంటూ నిట్టూరుస్తూ వెనుదిరిగాడక్కణ్నుండి.

* * * * * *

ఆ మర్నాటి నుండీ మళ్లీ మామూలుగా కన్పిస్తున్న పిచ్చి మంగి మంచి వాలకం చూసి తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు వెంకటేశు.

# పిచ్చితల్లి

మేడింటి ముందు పెట్టిన ఫలహారం... పూరింటి ముందు పోసిన గంజినీళ్లూ యేకం చేసుకుని, కలిమి లేముల్ని కలబోసుకు తింటున్న పిచ్చి మంగి చిల్లులుపడ్డ సిల్వరు గిన్నెలోంచి కారుతున్న ధారల్ని నాకుతూ తోకాడిస్తూ కూర్చున్న కుక్క పిల్లను కూడా కంపెనీకి కూర్చో బెట్టుకునే ఆ పిచ్చి మంగి నెప్పుడు చూసినా...

యే రంగుల సినిమాల్లోనూ... మరే కథల పుస్తకంలోనూ... యెంత గొప్ప వుపన్యాసం లోనూ విన్పించని, కన్పించని "సమ సమాజం..." "సహజమైన జీవిత సత్యం" యేదో తీలగా కళ్లక్కట్టినట్టన్పిస్తుంది వెంకటేశులో.

* * * * * *

ఒకరోజు....

పరీక్షగా చూశాడు వెంకటేశు.

మరోనాడు మరికాస్త కుతూహలంగా చూశాడు.

ఇంకో నాడు... ఇంకోనాడు...

అలా పరికిస్తూనే వింతగా విచిత్రంగా వింత చిత్రంగా చూశాడు వెంకటేశు.

ఆ చూసిన దృశ్యాన్నే నెమరేసుకుంటున్నాడు ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు. ఇంటి ముందున్న అరుగుపై పడుకుని బీడీముక్క కాల్చుకుంటూ అతడు.

గాజు గ్లాసుతో టీ తీసుకొచ్చి మొగుడి ముందుంచింది వెంకటేశు భార్య.

అప్పుడే అటుకేసి వచ్చింది పిచ్చి మంగి.

మళ్లీ చిత్ర- గా చూశాడు వెంకటేశు.

"ఇదిగో... ఇది విన్నావా?"

తల తిప్పి చూశాడు వెంకటేశు.

వెంకటేశు పెళ్లాం పిచ్చిదాని వేపే చూస్తోంది తదేకంగా.

"పాపం! ఈ పిచ్చిదాని కెవరో కడుపు చేశారు!"

వులిక్కి పడ్డాడు వెంకటేశు.

"నీవు చెప్పింది నిజమేనా?"

దిగ్గున లేచి కూర్చుంటూ విభ్రాంతిగా అడిగాడు.

"అవును! దాని కిప్పు డైదో నెల కావచ్చు. పసిబిడ్డ లాంటి దాన్నెవరు పాడు చేశారో... వాళ్ల కెట్లా మనసొప్పిందో... మాయదారి కాలం... కళ్ళులేని కామం!"

బాధగా అంది వెంకటేశు పెళ్లాం.

"భగవంతుడా!"

అంతకంటే మరే మన్లేక పోయాడు వెంకటేశు.

తన అనుమానం నిజమైంది. సందేహం లేదు... పిచ్చిది తల్లి కాబోతోంది... ఆడదాన్నన్న సంగతే మరచి ఆడుతూ పాడుతూ, పసిపాపలా, పిచ్చి లోకంలో తిరిగే యీ వెఱ్ఱిముండలో ఆడదాన్నెలా చూడగల్గారు? యెలా పైన చేయి వేయగల్గారు? అంతటి నికృష్టమైన కామానికే మగాడు వారసుడయ్యాడు!

ఈ పిచ్చిది....

స్త్రీ అనుకుంటే....,

స్త్రీని గౌరవించే సాంప్రదాయంలో పుట్టిన,

ఓ పసి బిడ్డనుకుంటే...,

ప్రేమించి లాలించే దయాగుణంలో పుట్టిన,

రాయో రప్పో ననుకుంటే...,

తప్పుకు పోయే మనస్తత్వంలో పుట్టిన మన స్వచ్ఛమైన మగవాడు... వో పిచ్చి దాన్నెలా పాడు చేశాడు? యెలా చేయగల్గాడు?

కాదు... కాదు... అది కాదిప్పుడు మన సాంప్రదాయం...

సారా పీపాల్లో, విదేశీ విస్కీల్లో అదిప్పుడు మునిగిపోయి, తల్లినే రమించాలని చూసే, చెల్లి పైనే చేయి వేయించే, కన్నకూతుర్నే కాటు వేసిన త్రాగుడు మైకంగా మారిపోయింది.

అంతటి మహత్తర శక్తివంతమైన ఆ మైకానికింక పిచ్చిదానిపై... అప్పరాత్రి వో పిచ్చిదానిపై ... ఓ అనాథపై అభిమానముంటుందా? తన పిచ్చిగాని! ఆనాడు ...పిచ్చిదాని వింత ప్రవర్తన తను గుర్తించలేకపోయాడు. విచక్షణ మరిచి, మనిషి మృగమై జరిపిన పశువాంఛా పైశాచిక చర్య ఫలితమని!

అప్పుడు మనిషి పట్ల తన నిర్వచనం మరోలా వుండేది!

లేచి రెండడుగులు వేశాడు వెంకటేశు. ఆ అడుగులు ముంగిట్లో నిల్చున్న పిచ్చి మంగి వేపుగా పడ్డాయి.

వారగా పట్టుకున్న దాని గిన్నెలో టీనీళ్ళు పోశాడు కంట్లో కారే కన్నీళ్లతో.



గటగటా త్రాగేసింది. కిలకిలా నవ్వేసింది.

"ఎవరు? ఎవరీ పని చేశారు?"

కడుపుపై చేయి వుంచుకుంటూ యెత్తుగా చూపెడుతూ అడిగాడు వెంకటేశు.

నవ్వింది మంగి. గిన్నె తలపై బోర్లించుకుని నాట్యం చేయ నారంభించింది.

మళ్ళీ... మళ్ళీ అడిగాడు సైగల్తో తనకు తెల్సిన, దానికర్థమవుతుందనుకున్న రీతిలో.

"వ్వె..వ్వె..వ్వె" వెక్కిరిస్తూ అక్కణ్ణుండి పారిపోయింది. తననుకున్నట్టే ఆశించిన నిజం తెలీలేదు. అనుకున్న ఆశాభంగమే యెదురైంది!

"పాపం!" మరోసారి బాధగా అన్నాడు వెంకటేశు

"వయసు తెలీని, వలపు తెలీని, స్త్రీత్వం తెలీని, మాతృత్వం తెలీని యీ వెఱ్ఱిది కూడా కన్నుగానని కామానికి సమిధ కావల్సి వచ్చిందా! పరిణామం యెలా పరిణమిస్తుందో గదా!"

కంట్లో వూరిన నీటితో యింట్లోకి నడిచాడతను.

★ ★ ★ ★

"పిచ్చి మంగికి రాత్రనగా మొదలైన నొప్పులు యీ రోజుకూ అట్లాగే వున్నాయి. దాని బాధ చూడలేక పోతున్నాను. యెవరూ పట్టించుకోవటం లేదు కూడా. కాన్పు కష్టమైనట్టుంది. చచ్చిపోతుందేమో! ఆ పాడుబడ్డ శివాలయం పక్కన పడుంది పాపం!" దిగులుగా అంది వెంకటేశు పెళ్ళాం.

"అరె!"

తింటున్న ముద్ద జారిపడింది. వెంకటేశులో బాధ కదలాడింది.

ఆకలితో మధ్యాహ్న భోజనాని కింటికొచ్చిన వెంకటేశులో ఆకలి చచ్చిపోయింది.

మరొకప్పుడైతే కోప్పడే వాడతను అన్నం ముందు పెట్టి సమస్యల్ని ముందు పెట్టే పెళ్ళాన్ని.

కానప్పుడలా అన్లేకపోయాడు. పైగా మెచ్చుకున్నాడాలస్యంగా చెప్పనందుకు.

బట్ట లేసుకుని గబగబా బయటకొచ్చి ఆటో స్టార్టు చేశాడు.

శివాలయం ప్రక్కన ఆగింది ఆటో.

పిచ్చి పిచ్చి కూతల్తో....వెఱ్ఱి పెడబొబ్బల్తో, మాటరాని బాధతో అటూ యిటూ దొర్లుతోంది పిచ్చి మంగి.

అన్నెం పున్నెం ...సుఖం... దుఃఖం తెలీని అమాయకురాలికా యింతటి ప్రసవ వేదన? ఎవరి కర్థమవుతుందీ ప్రకృతి నివేదన?

కళ్ళు రుమాలుతో వొత్తుకుంటూ అక్కడున్న వారిద్దరి సాయంతో ఆటోలో ఆ పిచ్చిదాన్ని పడుకోబెట్టుకున్నాడు.

"అర్జంటుగా హాస్పిటల్‌కు తీసుకెళ్ళాలి. లేకుంటే నిన్నటి నుండే ప్రసవం కాని పిచ్చి మంగి చచ్చిపోతుంది. ఈ లోకపు నికృష్ట కామపు శాపానికి బలై పోతుంది. వొద్దు...వొద్దు... భగవాన్.. మంగి బ్రతకాలి. ఎవరికీ యే అపకారం చెయ్యని పిచ్చిది పిచ్చి ఆనందంతోనే బ్రతకాలి అన్యాయంగా చావకూడదు!"

ఆటో యాక్సిలేటర్‌పై బలంగా చేయి మోపబోయాడు.

ఇంతలో "వెంకటేశూ" అన్న కేక. వొక్క క్షణం ఆగాడు.

రొప్పుతూ సేఠ్ చమన్‌లాల్ గారి నౌఖరు ఆటోను సమీపించాడు

"అర్జంటుగా ఆటోతో యింటికి రమ్మన్నాడు సేఠ్‌జీ.. అదుగో గేటు కవతల నిల్చుని యిటే చూస్తున్నాడు పద..పద..!" తొందర చేశాడు నౌఖరు.

"ఎందుకు? యేమిటి? అని బాతాఖానీ పెట్టే టైం లేక ... తీలగా కన్పిస్తున్న యజమాని రూపాన్ని ధిక్కరించలేక ముందుకదిలాడు వెంకటేశు.

పిచ్చి మంగి పెడబొబ్బలతోనే ఆటో సేఠ్‌జీ యింటి ముందాగింది.

పులిలా ముందుకు దూసుకు వచ్చాడు చమన్‌లాల్.

"అర్జంట్ వెంకటేశూ ... అమ్మగారికి నొప్పులొస్తున్నాయట. ప్రొద్దుటే కారు రిపేరుకి వెళ్ళింది. తక్షణం ఆటోలో బయల్దేరాలి!"

అంటూనే యింట్లోకి కేకేశాడు త్వరగా తెమలమని.

ఆటోలోంచి వికృతమైన అరుపులు మలుపు తిరగబోయిన ఆయన్నొక క్షణం వెనక్కు తిరిగేలా చేశాయి. అంతవరకూ గమనించని అతడు ఆటోలోకి చూశాడు.

కనుబొమ్మలు ముడివడ్డాయి. ముఖంలో రంగులు మారాయి.

"ఎవరది?"

అడిగాడు సేఠ్

జవాబు చెప్పలేదు వెంకటేశు.

సేఠ్ చండశాసనుడని తెల్సు తనకి. అయినా ఆపత్సమయంలో అవన్నీ ఆలోచించలేకపోయాడు. పెదవి కదపలేదతను

"రోడ్లమ్మట తిరిగే ... యెవడితోనో తిరిగి, కడుపొచ్చిన ఆ ఎచ్చిది కదూ?"

గర్జించాడాయన.

అప్పటి ఆ పిచ్చిదాని అవతారం, దాని పిచ్చి అరుపులు సేఠ్‌జీకి **పిచ్చెక్కించాయి.**

అంతలో యిద్దరు ముగ్గురు పట్టుకుని సేఠ్‌గారి భార్య నాటో దగ్గరకు నడిపించుకొచ్చారు.

"ఊఁ దించెయ్ ఆ ముదనష్టపు ముష్టిదాన్ని!"

"సాబ్!" అంటూ అంతలోనే సేఠు ముఖంలోకి చూసే ధైర్యం లేక తలొంచుకునే ....

"సేఠ్ సాబ్! కాన్పు కష్టమై అది చావు బతుకుల్లో వుంది. దాన్ని కూడా ఆస్పత్రికి తీసుకెళ్తానండీ అమ్మగారితో పాటే!"

అనలేక ... అనలేక ధైర్యం చేసి అన్నాడు చివరికి. వువ్వెత్తున లేచాడు చమన్‌లాల్.

"షటప్! ఆ దరిద్రపు ముండతో పాటు అమ్మగార్ని తీసుకెళ్తాననటానికి నీకెన్ని గుండెలు? ఆటో నద్దెకిచ్చింది నీకిందుకేనా? అపురూపంగా పెరిగిన అమ్మగారికీ దానికీ పోలికా? లేక లేక పుట్టబోతున్న మా బిడ్డకూ, ఆ నికృష్టపు, చండాలపు దాని బిడ్డకూ ముడిపెడ్తావా?"

"అదికాదండీ! వైద్యం అందక అది ఛస్తే ... ?

"ఛస్తే చావనీ! అది ఛస్తే యెవడిక్కావాలి? బ్రతికితే యెవడిక్కావాలి? దాని అసహ్యపు కాన్పు కాన్పిటలు కావాల్సి వచ్చిందా? దాని ప్రాణాలతో పనిబడే దెవడికి? బురదలో పంది నెవరు పట్టించుకుంటారు? దించెయ్ తక్షణం. మరొక్క

చిత్ర కళా పరిషత్ (విశాఖపట్నం) వారి 19వ వార్షికోత్సవం సందర్భంగా జరిగిన చిత్ర కళా ప్రదర్శనకి ప్రారంభోత్సవం చేసిన శ్రీ వి. అనంతరావు, సన్మానితులు శ్రీ పి. ఆర్. రాజు, పరిషత్ అధ్యక్షులు శ్రీ డి. సుందరరావు, గౌరవాధ్యక్షులు శ్రీ పి. వేణు గోపాలరెడ్డి, కార్యదర్శి శ్రీ అంట్యాకుల పైడి రాజుగార్లని చిత్రంలో చూడవచ్చు.



క్షణం అదిక్కడుంటే సహించేది లేదు!"

గర్జించాడు సేఠ్‌జీ నిలువెల్లా కోపంతో వణికిపోతూ. అతడినెంతో ప్రాధేయపడ్డాడు వెంకటేశు. లాభం లేకపోయింది.

"ఈడ్చేయండిరా యీ పాడు ముండని!"

పనివాళ్లంతా ఆ పిచ్చి మంగిని బర బర్రా యీడ్చుకెళ్లారు.

బాధతో రెప రెపలాడింది వెంకటేశు హృదయం.

ఆటోలోని సీటును శుభ్రం చేయించాడు సేఠ్. వెంకటేశుకైతే తుడవక ముందు సీటూ, తుడిచాక **సీటూ ఒక్కలాగే కన్పించింది.**

"ఊఁ స్టార్ట్ చెయ్!" భార్యను పొదివి పట్టుకుంటూ అన్నాడు సేఠ్.

యాంత్రికంగా ఆ పని చేశాడు వెంకటేశు. అతడి మనసంతా పిచ్చిదాని పైనే వుంది.

"తను తిరిగొచ్చేసరికది చచ్చిపోతుందేమో!"

బాధగా, భయంగా, నిస్సహాయంగా ఆటోని రోడ్డెక్కించాడు వెంకటేశు.

★ ★ ★ ★ ★

హాస్పిటల్‌లో అడ్మిట్ చేశారు సేఠ్ చమన్‌లాల్ భార్యను.

లేక లేక పుట్టబోయే ఆ సంతానంపై సేఠ్‌గారి యెన్నో కలలు దాగున్నాయి. ప్రేమించిన పెళ్లాం కోసం, పెళ్లాం కాన్పు కోసం డబ్బు మంచినీళ్లలా

## పిచ్చితల్లి

ఖర్చు పెడుతున్నాడు.

అవసరమైన, అనవసరమైన మందులకూ, మాకుకూ అన్నింటికీ హడావిడిగా తిరిగాడతడి బంట్లు ఆటోలో.

ఎన్ని పనులు నిర్వహిస్తున్నా వెంకటేశు మనసు పిచ్చిదానిపైనే వుంది.

తాను వెళ్లే దాకా దాని ప్రాణాలు నిల్పమని దేవుడికి మొక్కుకున్నాడు.

"ఇంక నువ్వెళ్లొచ్చు!"

చాలాసేపటికి సేఠ్‌జీ అనుమతిచ్చాడు.

క్షణం ఆలస్యం కాకుండా అఘ మేఘాల మీద ఆటో నడుపసాగాడు.

"తను వెళ్లే వరకు అది ప్రాణాల్తో వుంటే చాలు. హాస్పిటల్‌లో అడ్మిట్ చేయించొచ్చు!"

అనుకుంటూ పది నిముషాల్లో అక్కడికి చేరుకున్నాడు. ఆ చుట్టుపక్కలంతా కలయచూశాడు. యెక్కడా ఆ పిచ్చిదాని కేకలుగాని, అరుపులు గాని విన్పించలేదు.

"చచ్చిపోయిందేమో!"

పిచ్చివాడిలా అటూ యిటూ పరికించాడు. అక్కడికల్లంత దూరాన ... ఓ మొండి గోడల దాపున మట్టి పెళ్లల నడుమ, చెత్తా చెదారం పైన ... నేలతల్లి ఒడిలో, చల్లగాలి విసురులో సేద దీరుతున్న ఆ పిచ్చిది ... అప్పుడే వుద్భవించిన వో కొత్త సృష్టి, కేరు కేరుమని యేడుస్తూ ఆ పిచ్చిదాని చేతుల్లో ఆ తల్లీ బిడ్డలిద్దరూ ప్రకృతీమతల్లి వెచ్చని చేతుల్లో ...!

టపా టపా ఆనందాశృవులు రాలాయి వెంకటేశు కళ్లలో నుండి. సృష్టిలోని అందమేదో అతణ్ణి వివశుణ్ణి చేసిందో క్షణం.

అంతవరకూ అతడు పడ్డ ఆత్రం ... ఆవేదన ... ఆ క్షణంలో తొలగిపోయి, మనసు నిశ్చింతగా, నిశ్చలంగా అయిపోయింది. అలా యెంతసేపుండిపోయాడో వెంకటేశు.

మెల్లగా పిల్లాడితో సహా పిచ్చి మంగి నాటోలో వేసుకున్నాడు.

ఆనందంగా ఆటో స్టార్ట్ చేశాడు.

సేఠ్‌జీ యింటి ముందు మంత్రించినట్లుగా ఆగింది ఆటో.

ఆ మేడింటి ముందు ఆగిన టాక్సీలోంచి యేడుపులూ, పెడబొబ్బలూ ...

"ఏమైందండి?"

అడిగాడు ... ఆతృత నిండిన స్వరంతో.

గొల్లుమన్నాడు టాక్సీ దిగ్గిన యజమాని.

"యెంతకీ కాన్పు కాక కష్టమైపోతే ... చివరకు ఆపరేషన్ చేసినా తల్లీ దక్కలేదు ... కడుపులో పోయిన పిల్లాడితో సహా తల్లీ పోయింది!"

అంటూ మరోసారి బావురుమన్నాడు సేఠ్‌జీ.

అంత బాధలోనూ కేర్ ... కేర్‌మంటున్న పసిబిడ్డ యేడుపుతో ఆటోలోకి చూశాడాయన.

"ఎవరూ ... ముష్టిది .. పిచ్చిది కదూ? చావలేదూ? పిల్లాడు పుట్టినట్టున్నాడే దానికి?"

"అవునండీ! రోడ్డు మీద పారేసిన దాన్ని దేవుడే కాపాడాడు. యే హాస్పిటల్, యే వాహనమూ యే డాక్టరూ ::: చివరికి యే డబ్బూ దానికక్కరర్లేక పోయింది. అది బ్రతికింది చిత్రంగా. అన్నీ వున్న అమ్మగారే పోయారు పిల్లాడితో సహా!"

కన్నీళ్ళొత్తుకుంటూ అన్నాడు వెంకటేశు.

"అన్నీ వుంటే అమ్మగారెందుకు పోతారు వెంకటేశూ? యెన్ని వున్నా మాలో వొక్కటి లోపించింది. ఆ లోపం వల్లే యిలా జరిగింది!

వణికే స్వరంతో అన్నాడు సేఠ్ చమన్‌లాల్.

"అదేంటండీ!"

"అవును వెంకటేశూ ... బాధలో వున్న ప్రాణి ఆక్రందన వినలేక ఆ బాధకు అంతస్థుల తేడా నిర్మించాను. ప్రకృతిలోని ప్రాణికీ, ఆ ప్రాణి అద్వితీయ సృష్టికీ తారతమ్యాన్ని కల్పించాను డబ్బు మదంతో. ఆడదాని ప్రసవ వేదన కర్థాన్ని మార్చాను ఆర్థిక బలంతో.

మానవత్వాన్ని మర్చాను. అదే ... అదే ... నేనిక్కడ చేసిన లోపం. యెంత తొందర్లోనున్నా, అర్జంటుగా వాహనాన్ని సర్దుకున్నా, జేబులో నోట్లన్ని సర్దుకున్నా వొక్క మానవతను సర్దుకోలేక పోయాను. అదొక్కటుంటే అన్నీ వాటంతటవే సర్దుకుంటాయని గ్రహించలేక పోయాను. ఆ విషయం ఇప్పుడు ... యిక్కడ యిలా నిరూపించ బడ్డ నిజం. మహా సృష్టి ముందు నేనెంత? నా ఆస్తెంత? అంతస్తెంత?"

జేబులోని నోట్ల కట్టల్ని పిచ్చిగా నిర్జీవమైన భార్య శరీరంపై వెదజల్లుతూ విలపిస్తున్నాడు సేఠ్‌జీ.

ఆ మేడింటినీ, ఆ ఆస్తినీ, ఆ అంతస్తునూ దాటి ముందు క్కదిలింది వెంకటేశు ఆటో.

ఆ మేడలోని యేడుపులు పిచ్చిదాని నవ్వుల్లో కలిసిపోయాయి.

★ ★ ★ ★

పిచ్చి మంగి నవ్వుతోంది కిలకిలా.

గదిలోకి తొంగి చూశాడు వెంకటేశు.

పాలతో పొంగులు వారే పిచ్చిదాని స్తన్యాన్ని బిడ్డ నోటి కందించింది వెంకటేశు పెళ్లాం.

అతడు చూసిన ఆ దృశ్యంలో సమస్త సృష్టి ప్రతిబింబించినట్టు తోచింది.

"పిచ్చి తల్లి బ్రతికింది. అవును! ఆమె పిచ్చిదైనా యిప్పుడో తల్లి. కన్ను గానని కామం కాలకూట విషం చిలికినా, అమృతంలా మోసిన, అనృతం కాని, మరో సృష్టికి ప్రతీక. జగతిని లాలించే నిండైన మాతృక!"

"ప్రకృతే ప్రాణం పోసిన, పంచ భూతాలే పురుడు పోసిన ఆ అమాయకపు పిచ్చి తల్లికే అద్వితీయ శక్తి తోచిందే?"

"అన్నీ వున్న, యెన్నో తెలిసిన తెలివి మీరిన మనిషి మానవతను మరిచాడు... అన్ని హంగుల్తో, మహామహులైన డాక్టర్ల చేతుల్లో కూడా చావు నధిగమించలేక పోయాడు!"

మరోసారి పిచ్చి తల్లి వేపు చూశాడు.

"సమతా మమతల మహా సృష్టి ముందు మానవతను కోల్పోయిన నేనెంత? నా ధనమెంత? నా అహమెంత?"

పశ్చాత్తాపంతో విలపించే సేఠ్ చమన్‌లాల్ కంఠం మరోసారి చెవుల్లో ప్రతిధ్వనించగా...

దానికి తోడుగా పిచ్చి తల్లి నవ్వు గదంతా మారుమ్రోగింది. ఆ ధ్వని తరంగాలు ప్రణవ నాదాలై దిగంత కుడ్యాల్ని తాకాయి.



సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

జరిగిన కథ–16: సంధ్య మధులు ప్రేమించుకొంటారు కాని పెళ్లి చేసుకోలేక పోతారు. తన చెల్లెలు భవిష్యత్తుకై మధు మాధవిని పెళ్లి చేసుకొంటాడు. అనుకోని పరిస్థితులలో ఇష్టం లేకపోయినా గీత కోసం సంధ్య, మధు స్నేహితుడు శ్రీకాంత్‌ను వివాహం చేసుకుంటుంది. గీత పెళ్లి మూర్తితో జరిగి పోయింది. మూర్తి మొదటి భార్య రాధ పిచ్చిలో తోయడం వల్ల మూర్తి తల్లి మరణించింది. మూర్తి రాధను ఆసుపత్రిలో చేర్పిస్తాడు. మూర్తి, గీత శ్రీకాంత్ ఇంటికి వచ్చారు. ఎంత సర్దుకున్నా సంధ్య మనసు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు. ఆమె మధుకి రాసిన ఉత్తరం శ్రీకాంత్ చదువుతాడు. మూర్తి, గీత ఊర్లు తిరగను వెళ్తారు. సంధ్య మళ్లీ ఉద్యోగంలో చేరింది కాని అక్కడి వారి సంభాషణలు భరించలేక మానేసింది. సంధ్య మనసు శ్రీకాంత్ పట్ల మృదువుగా మారుతుంది. మూర్తి భార్య మరణించింది మూర్తి ఇల్లు విడిచి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్లిపోతాడు. గీత తల్లితో బెంగుళూరు వెళ్లిపోయింది. శ్రీకాంత్ సంధ్యను భార్యగా కాకపోయినా ఒక స్నేహితురాలుగానన్న మసలుకోమని కోరుతాడు. శ్రీకాంత్ స్నేహితుడు ప్రకాష్ దగ్గర సెక్రటరీగా ఉన్నది మూర్తేనని తెలుసుకొంటారు. మూర్తి, గీతల జీవితం కుదుట పడింది. మధు భార్య బిడ్డతో శ్రీకాంత్ ఇంటికి వచ్చాడు. శ్రీకాంత్‌కు మధుకి సంధ్య మానసిక పరిస్థితి, ఆమె పడే వేదన చెప్తాడు. కాని అందుకు తనేం చేయలేనంటాడు మధు. మధు సంధ్యకు నచ్చచెప్పను ప్రయత్నిస్తాడు. మాధవిని పెళ్లి చేసుకోడానికి కారణం మధుని అడుగుతుంది సంధ్య.

(గత సంచిక తరువాయి)

మధు వాచి చూసుకున్నాడు. దగ్గర దగ్గర ఒంటి గంటన్నర కావస్తున్నది. చలిగాలి బాగా గడగడ లాడిస్తున్నది. సంధ్య కూడా కొంగు భుజాల చుట్టూ కప్పుకుని కూర్చున్నది. రెండు మోకాళ్ళ మీదా చేతులు వేసుకుని గడ్డం ఆన్చి కూర్చున్నదామె. పచ్చటి ఆమె పాదాల వేళ్ళకి మట్టెలు వెన్నెలలో మెరుస్తున్నాయి.

"అయిపోయిన పెళ్ళికి బాజాల్లా ఇప్పుడా విషయాలు పెద్దగా అవసరం లేదు–అయినా చెప్తాను విను. మాధవి తండ్రి–వయసు పొంగులో చాలా తక్కువ కులం అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. ఆయన తల్లిదండ్రులకీ విషయం తెలిసి ఆయన్ని గడప తొక్కనివ్వలేదు. పంచుకోవటానికి పెద్దగా ఆస్తిపాస్తులు లేకపోయినా కనీసం అండ కూడా లేకుండా పోయింది. ఆయన స్వశక్తి మీద పైకి వచ్చాడు. ఎన్నో కష్టాలు, నష్టాలు భరించి జీవితంలో వ్యక్తిగా నిలబడ్డాడు. మాధవి ఒక్కతే కూతురు ఆయనకు. ఎంతో గారాబంగా పెంచారు. పెళ్ళి సంబంధాల కోసం వాళ్ళ ప్రాంతం వెళ్ళేసరికి అన్ని సంవత్సరాల తర్వాత కూడా ఆయన వాళ్ళెవరూ ఆదరించలేదు. ఏడుగురు అన్నదమ్ములు వాళ్ళు. నలుగురు చెల్లెళ్ళు కూడా వున్నారుట. అందరూ కలిసి కట్టుగా మాధవికి ఎక్కడ సంబంధం చూచినా చెడగొట్టారు. అది అట్లా విషజ్వాలలా ఆవరించుకుని పోయింది. ఫలితంగా మాధవిని పెళ్ళి చేసుకోవటానికి ఎవరూ ముందుకు రాలేదు, పైగా మొదటి నుంచీ దూరంగానే వుండటంతో ఆయన ఆచార వ్యవహారాల్లో కూడా మార్పు వచ్చింది. భాషలో మార్పు వచ్చింది. వెళ్ళిన ప్రతి చోటా తీవ్రమైన అవమానానికి గురై నిస్పృహయంగా నాగపూర్ తిరిగి వచ్చాడు. భార్య దిగులుతో మంచం ఎక్కింది. ఆయన ఆఫీసు వ్యవహారాలు, భార్య అనారోగ్యం ఈ రెండింటిలో చిక్కుకుని తాత్కాలికంగా మాధవి విషయం మర్చిపోయాడు. అదే సమయంలో ఆయన ఆఫీసులో పనిచేస్తున్న బెంగాలీ యువకుడు మాధవిని పెళ్ళి చేసుకోవటానికి ఉత్సాహపడ్డాడు. మాధవిని ఒకటి రెండు పార్టీలలో చూశాడట. ఈ సంబంధాల విషయంలో విసిగిపోయిన ఆయన మాధవిని అతనికివ్వటానికి సిద్ధపడ్డాడు. అతనికి ఎవ్వరూ లేరు. మాధవి తనకొక్కతే కూతురు. ఇంట్లోనే ఉంచుకోవచ్చనుకున్నాడు. చాలా ఆర్భాటంగా ఎంతో డబ్బు ఖర్చు పెట్టి పెళ్ళి చేశాడు. మాధవి అదృష్టానికి తల్లీ, తండ్రీ పొంగిపోయారు. స్ఫురద్రూపి, బుద్ధిమంతుడు అయిన అల్లుడ్ని చూచుకుని మాధవి తల్లి తన అనారోగ్యం మర్చిపోయి కులాసాగా తిరగసాగింది. పెళ్ళయిన రోజు సాయంత్రం చాలా ఘనంగా విందు ఏర్పాటు చేశారు. విందు పూర్తయింది. అందరూ వెళ్ళిపోయారు. కూతురు, అల్లుడుతో కలిసి భోజనం చేస్తున్నారు మాధవి తల్లి, తండ్రి.– ఉన్నట్టుండి పెళ్ళికొడుకు పక్కకి ఒరిగిపోయాడు. ఎంతో ఆదుర్దాగా డాక్టర్లందర్నీ పిలిపించారు. కాని, మాధవికి పసుపు కుంకుమలు నిలువలేదు. తల్లి విరుచుకుని పడిపోయింది. మాధవి కొయ్యబారిపోయింది. ఆమెకు ఏడుపు రాలేదు. హృదయ విదారకంగా ఏడ్చే తల్లిని రక్షించుకోవటం ఎలాగో తెలియక బాధపడింది. తండ్రి దాదాపు సంవత్సరం మనిషి కాలేకపోయాడు. ఆ సంసారంలో భర్త పోయిన దుఃఖంతో ఒంటరిగా మాధవి నిలబడి ఎదుర్కొన్నది. తండ్రి నెమ్మదిగా కోలుకున్నాడు కాని, తల్లి మాత్రం మంచం దిగలేదు. అప్పుడే నాకు ఉద్యోగం రావటం, నాగపూర్ వెళ్ళటం జరిగింది. మాటల సందర్భంలో నేను తెలుగువాడ్నని, నాకు కాలక్షేపంగా వుంటుందనీ వాళ్ళ ఇంటికి నన్నాహ్వానించాడు. అమాయకమైన మాధవి నన్నాకర్షించింది. ఇరవై ఏళ్ళయినా లేని మాధవి బ్రతుకు నిరర్థకమైనందుకు నాలో సానుభూతి కలిగేది. ఒంటరిగా ఇంటెడు చాకిరీ చేసుకోవటం – నిద్రపోవటం – ఇదీ మాధవి దినచర్య. మాధవికేం లోటు? అందం వుంది. వయసు వుంది. బోలెడంత డబ్బుంది. ఆ డబ్బుకి ఆశపడయినా ఆమెను చేసుకోవటానికి ఎవ్వరూ ముందుకు రాలేకపోయారు. మా ఆఫీసరు గారు, అంటే మాధవి తండ్రి ఒకటి రెండు సార్లు మాధవి విషయం నా ముందు ప్రస్తావించి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు. ఆయనకు నచ్చజెప్పి రెండు మూడు సార్లు బలవంతంగా మాధవిని సినిమాకు తీసికెళ్లాను. దిగులుగా నిస్తేజంగా వుండే మాధవిలో క్రమంగా మార్పు రాసాగింది. ముఖంలో చిరునవ్వు, పెదవుల మీద మాటలు కనబడినయి. ఈ కాస్త మార్పుకే మాధవి తండ్రి సంతోషంతో పొంగిపోయాడు. నాగపూర్ రావటానికి ముందు రోజే శ్రీకాంత్ ప్రేమ వ్యవహారం తెలుసుకున్నాను. అతను నిన్నే భార్యగా భావిస్తున్నాడు. అతని దివ్య ప్రేమకు నిజంగా నేను చకితుడ్నయాను. అప్పుడు తెలిసింది నేను నిన్ను వివాహం చేసుకోవటంలో గల దోషమేదో! కొంతసేపు విల విలలాడిపోయాను. శ్రీకాంత్‌కి ఆ రోజు మన పెళ్ళి గురించి చెప్పాను. నన్ను నిశితంగా చూశాడు. 'సంధ్యను భద్రంగా, అపురూపంగా చూసుకోగలవా!' అన్నాడు. అతని కంఠం వణకటం గమనిస్తూనే వున్నాను. శ్రీకాంత్ చాలా గంభీరమైన మనిషి. ఓ పద్ధాన మనసులో విషయం బయటపెట్టడు. మన పెళ్ళి గురించిన విషయం అతనికి కొత్తేమీ కాదు. కాని, ఆ రోజు ఖచ్చితంగా చెప్పిన వెంటనే అతని ముఖంలో నెత్తురు లేకుండా పాలిపోయింది. నాకు చిత్రంగా అనిపించింది. 'సంధ్యకు కోపం ఎక్కువ. తొందరపాటు ఎక్కువ. ఆమెను అపురూపంగా పువ్వులా చూచుకోగలగాలి! ఆమెను కష్టపెట్టకూడదు –' ఇదే ధోరణితో చెప్పుకుపోతున్నాడు. నాకర్థం కాలేదు. శ్రీకాంత్ ఇట్లా ఎప్పుడూ మాట్లాడలేదు. నాకు పార్టీ ఇస్తానన్నాడు. నేను కాదనలేదు. హోటల్‌కి తీసికెళ్ళాడు. అది

హోటల్ కాదు. పేరు మోసిన బార్. సిగిరెట్ కూడా తాగని శ్రీకాంత్ డ్రింక్ చేస్తుంటే నిస్సహాయంగా చూస్తూ కూర్చున్నాను. ఆ రోజు శ్రీకాంత్ విపరీతంగా తాగాడు. వద్దని వారించినా వినే స్థితిలో లేదు.

ఆ తాగిన మైకంలో తన హృదయమంతా పుస్తకంలా తెరిచాడు. అతని హృదయం గానం చేస్తున్న హిందోళనం విన్నాను. అతని మూగ హృదయంలో పలుకుతున్న సావేరి స్వరాలు విన్నాను. నా కళ్ళ నుంచి ధారాపాతంగా కారుతున్న కన్నీటిని అదుపులో పెట్టుకోవటానికి విఫల ప్రయత్నం చేశాను. అతను హిమాలయ పర్వతం! గౌరీశంకర శృంగం! అతని ముందు నేను, నా ప్రేమ వ్యవహారం! తలకొట్టేసి నట్లయింది. భూమికి అతుక్కుపోయినట్లు ఫీలయాను. ఆ రాత్రి శ్రీకాంత్‌ని ఇంటికి చేర్చి వెళ్ళిపోయాను. చాలా తీవ్రంగా ఆలోచించుకుంటే నాకు తేలిన విషయం–నీకు చెప్పిందే. మన ప్రేమలో బలం లేదు. అంటే, పెళ్ళి చేసుకుంటే పెరిగేదే! చేసుకోకపోతే పెంచుకోకుండా వుండగలం! కాని శ్రీకాంత్ అట్లా కాదు. మర్నాటి నుంచి శ్రీకాంత్‌కి నెల రోజులు జ్వరం వచ్చింది. ఆ రాత్రి తను తాగినట్లు తనకే తెలియదు. ఆ జ్వర తీవ్రతలో మర్చిపోయాడు. తన ప్రేమ గురించి నాకు తెలుసని కూడా అతనికి తెలియదు. ఆ మనసుతో నాగపూర్ చేరిన నాకు మా డైరక్టరుగారి కుటుంబం చాలా రకాలుగా ఆదుకుంది. రమణి భర్త డైరక్టరుగారి తమ్ముడు కాదు. భార్య వైపు చుట్టాల పిల్లవాడు. చిన్నతనంలోనే అనాధ అయిన అతన్ని తెచ్చి తన తమ్ముడిగా పెంచారు. మాధవితో పరిచయం వృద్ధి పొందింది. నా దగ్గర వున్న రమణి ఫోటో అతనికి బాగా నచ్చింది. డైరక్టరుగారు బలవంతం చేసేవారు. అంత ఆస్తి, హోదా, ఫారెన్‌లో వున్న భర్తను రమణికి నేను తేలేను. నిన్నెలాగూ పెళ్ళి చేసుకోలేను. అటువంటప్పుడు మాధవిని ఎందుకు కాదనాలి. ఒక అమాయకురాలికి జీవితంలో ఆనందాల్ని రుచి చూపించవచ్చు! ఆ నిర్ణయానికి రావటానికి ఎంతగానో ఆలోచించాను. ప్రతిక్షణం నువ్వే కళ్ళముందు మెదిలే దానివి! నీ పక్కన వెంటనే శ్రీకాంత్ కనబడేవాడు. నాకు వేడి మీద నీళ్ళు చల్లినట్లుండేది. ఒక రకంగా రమణి పెళ్ళి ఖాయమయింది. ఆ సందర్భంలోనే ఒకసారి వాళ్ళింటికి వెళ్ళాను. మాధవి ఏడుస్తున్నది! కళ్ళు ఎఱ్ఱగా ఉబ్బి వున్నాయి. ఇంట్లో ఎవరూ కన్పించ లేదు. మాధవి తల్లిని డాక్టరు దగ్గరకు తీసికెళ్ళారట. మాధవి తల్లిని గురించి దిగులు పడుతున్నది. నేను ఆమెను ఎన్నో రకాలుగా అనునయించాను.

"నా పెళ్ళి గురించి అమ్మకు దిగులు – మానసిక రోగానికి మందివరిస్తారు?" అంటూ వాపోయింది.

వస్తున్న ఉద్వేగాన్ని ఆపుకుంటూ మాధవి దగ్గర కెళ్ళి ఆమె చెయ్యి పట్టుకుని చెప్పాను. "మాధవీ! నిన్ను నేను వివాహం చేసుకుంటాను!" మాధవి మొదట నమ్మ లేదు. తరువాత పెద్దగా ఏడవసాగింది. ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చాను. ఆమె నన్ను అల్లుకుని ఏడుపును మింగటానికి ప్రయత్నం చేసింది –"

మధు వింటున్నావా అన్నట్లు సంధ్య ముఖంలోకి చూచాడు. సంధ్య నిటారుగా కూర్చుని వింటున్నది.

"నేను సందిగ్ధం నుంచి బయటపడటానికా అన్నట్లు మాధవి సాన్నిధ్యం నన్ను ఉద్రిక్త పరిచింది. మాధవి అడ్డు పెట్ట లేదు. మర్నాడు నా నిర్ణయం చెప్పాను. మా డైరక్టరుగారు పొంగి పోయారు. మాధవిని యధేచ్ఛగా నా భార్యగా నా కట్టడిలో వుంచుకున్నాను. ఒకరోజు నీ విషయం చెప్పాను. ముందు మాధవి ఆశ్చర్యపోయినా వెంటనే మన దారికి తాను అడ్డురానన్నది. నాకు నీ మీద ప్రేమ వుంటే నిన్ను వివాహం చేసుకోమని తొందర పెట్టింది. అప్పటికే మాధవి నాకు మనసు, శరీరము అర్పించుకున్నది. నేను కావాలనే మాధవితో ఆ రకమైన సంబంధం పెట్టుకున్నాను. ఆ స్థితిలో ఆమెకు ద్రోహం చెయ్యటం అధర్మం కాదా! అందుకే మాధవిని మనస్ఫూర్తిగా స్వీకరించాను–"

సంధ్య రాతి బొమ్మలా కూర్చుండి పోయింది. మధు టైము చూసుకున్నాడు. తెల్లవారు జామున నాలుగు గంటలు కావస్తున్నది.

"సంధ్యా! టైమెంతయిందో తెలుసా! ఇంకో గంటలో తెల్లవారబోతున్నది. పద, పోదాం–"

మధు లేచాడు. మధు వెనకాలే సంధ్య కూడా బయలు దేరింది. మధు తన గదిలోకి వెళ్ళిపోయాడు. సంధ్య పైకి వెళ్ళబోతూ పక్కనే వున్న అత్తగారి గదిలోకి వెళ్ళింది. శ్రీకాంత్ నిద్రపోతున్నట్లుగా పడుకున్నాడు. నెమ్మదిగా అతని మంచం దగ్గర కెళ్ళి నిలబడింది. అయిదు నిముషాలు ఆ మంచం పక్కనే నిలబడి అతన్ని చూస్తుండి పోయింది. తొలగిపోయిన దుప్పటిని మెడవరకూ కప్పి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది. శ్రీకాంత్ ఆమె వెళ్ళిన వైపు చూస్తూ దీర్ఘంగా నిట్టూర్చాడు.

* * * * * *

సంధ్య నిద్ర లేచేసరికి గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. ఉలిక్కిపడి మంచం దిగి గబగబా పరుగు లాంటి నడకతో కిందకు వచ్చింది. వంట గదిలోంచి



మంగి కూని రాగాలు విన్పిస్తున్నాయి.

"అమ్మాయి గారూ! ఇప్పుడు లేచారా!రండి. కాఫీ తెస్తాను!" మంగి తరుగుతున్న కూరలు వదిలి కాఫీ చెయ్యటానికి లేచింది.

"అయ్యగారు లేచారా!" మంగి చేతిలోంచి కాఫీ కప్పు అందుకుంటూ అడిగింది సంధ్య.

"లేచారుగా! ఆ బాబుగారి మామగారికి బాగా లేదంట. ఫోనొచ్చింది. ఆ బాబుగార్ని దింపిరావటానికి ఎల్లారు!"

"మీ అయ్యగారికి జ్వరం తగ్గిందా!"

'ఏమో నండి! తిరుగుతానే వున్నారు!' విసుగ్గా అంది మంగి. మంగి ముఖం చూసిన సంధ్యకు నవ్వాగ లేదు. ఇంతలో బయట కారాగిన చప్పుడయింది. సంధ్య లేచి డ్రాయింగు రూములోకొచ్చింది. శ్రీకాంత్ అలసటగా సీరసంగా

# రాగసంధ్య

లోపలికొచ్చి సోఫాలో కూర్చున్నాడు. గుమ్మందగ్గర నిలబడి పోయిన సంధ్యకు అతన్ని చూస్తే జాలేసింది. మంగి చల్లటి నీళ్ళు గ్లాసులో పోసుకొచ్చింది. మంగి మాత్రం కూడా తనకి అతని విషయం తెలియదు. బయటకు వెళ్ళేముందు నీళ్ళు తాగి వెళ్తాడతను. మళ్ళీ ఇంటికి రాగానే తాగుతాడు. మంగి కూడా లేక పోతే అతనేమై పోయేవాడో!

"బాబుగారూ! జొరం తగ్గిందా!" ఖాళీగ్లాసందు కుంటూ అడిగింది మంగి.

తలెత్తిన శ్రీకాంత్‌కి ఎదురుగా గుమ్మం పట్టుకుని నిలబడిన సంధ్య కనప-డింది. స్నేహితుడి పెళ్ళి రోజు రాత్రి రిక్షాలో సంధ్య తన ఒళ్ళో నిద్ర పోయిన క్షణాలుగుర్తు వచ్చినయి. ఒక్క సారిగా అతని శరీరంలో రక్తం ఉవ్వెత్తుగా లేచింది. ముఖం ఎర్రబడ్డది.

"తగ్గిందిలే! నీరసంగావుంది!" సంధ్య వైపుకి అడుగులేస్తూ అన్నాడతను.

సంధ్య నాలుగడుగులు వెనక్కువేసి వంటింట్లోకి వచ్చింది. అతను మామూలుగా లోపలకొస్తున్నాడు. తనెందుకట్లా బెదిరిపోయింది?

అతనేమనుకుంటాడో! రెండేళ్ళు అతని గదిలో ఒంటరిగా నిర్భయంగా పడుకుంది. అతన్ని చూసినప్పుడు ఎప్పుడూ ఇట్లా తన ఒళ్ళు ఝల్లుమన




లేదు. రక్తం వేడెక్కలేదు. గుండెలు వేగంగా కొట్టుకోలేదు. ఎందుకు? ఎందుకట్లా భయపడింది తను?

"నేనేమన్నా రాక్షసుడ్నా! అట్లా బెదిరి పారిపోయావు!" సంధ్య వెనకాలే నిలబడి అంటున్న శ్రీకాంత్ మాటలకు చివ్వున వెనక్కు తిరిగింది సంధ్య. అమె భుజం మీద నుంచి అలమార్లో వున్న లవంగాల డబ్బా మీద మూత తీసి నాలుగు లవంగాలు నోట్లో వేసుకుని వెళ్ళిపోయాడతను. సంధ్య నిలబడ లేక అక్కడే పీట వాల్చుకుని కూర్చున్నది.

శ్రీకాంత్ కోసం మంగి చారు పెట్టింది. పాత నిమ్మకాయ పచ్చడి తీయించింది వేడిగా మెత్తగా వున్న అన్నం నిమ్మకాయ, చారుతో శ్రీకాంత్ చేత తినిపించింది. మంగి చెప్పిన పనులన్నీ యంత్రంలా చేసింది సంధ్య. భోజనాలయాక తను కాసేపు పడుకుందామని వెళ్తుంటే "అమ్మాయిగోరూ! అయ్యగార్ని నిద్రపోనీ మాకండి! ఏవైనా కబుర్లు సెప్పి నిద్ర సెడగొట్టండి! నిద్ర పోయారంటే మళ్ళీ వస్తది మాయదారి జరం!" వెనక నుంచి హెచ్చరించింది మంగి. కాని, సంధ్య వెళ్ళేసరికే శ్రీకాంత్ కళ్ళు మూసుకుని మంచం మీద వెల్లకిలా పడుకుని వున్నాడు. అతి ప్రయత్నం మీద గొంతు పెగుల్చుకుని "నిద్రపోతున్నారా!" అనడిగింది సంధ్య.

శ్రీకాంత్ సమాధానం చెప్ప లేదు.

మళ్ళీ అడిగినా శ్రీకాంత్ సమాధానం చెప్పలేదు. మంగి అన్నట్టు నిజంగానే జ్వరం వస్తుందేమో! సంధ్య అతని భుజం పట్టుకుని కుదిపి లేపింది. శ్రీకాంత్ కళ్ళు తెరిచాడు. ఎఱ్ఱగా విశాలంగా వున్న ఆ కళ్ళల్లోకి చూస్తుంటే సంధ్య గుండెలు దడదడ లాడినయి.

"నిద్రపోతే జ్వరం వస్తుందిట– మంగి చెప్పింది!"

శ్రీకాంత్‌కి నవ్వు వచ్చింది. అమాయకంగా వున్న భార్య ముఖం అద్భుతంగా వుందతనికి.

"మంగి ఇంకా ఏం చెప్పింది?"

"మీకు నిద్ర రాకుండా కబుర్లు చెప్పమంది!"

"చెప్పు మరి!"

అతని గొంతులో ఆ మాటలు పలికిన తీరుకి, ఆ మార్దవానికి సంధ్యకు అదోలా అనిపించింది. చెంపలు కెంపులయినయి. కళ్ళు వాలిపోయినయి.

"సంధ్యా!" అతను మృదువుగా అమె చెయ్యి పట్టుకున్నాడు.

"నో, నో......నో...." టచ్ మీ నాట్ లా ముడుచుకుపోయి దూరంగా పారి పోయింది సంధ్య. అమెకు ఎక్కడలేని దుఃఖం ముంచుకు వస్తున్నది. తను.... తను.... ఏదో అయిపోతున్నది. తనలో ఏదో కరడు గట్టిన ఏదో.... ఏదో.... ద్రవించి పోతున్నది ప్రవాహంలా. తను.... తను అట్లా కానివ్వదు. తన ఈ బలహీనతకి సంధ్య మనసు చాలా గాయపడింది. తన మనసు అతని వైపుకి జారిపోతున్నదా! కాదు, ఎన్నటికీ తను కానివ్వదు. సంధ్యకు కన్నీరు ఆగటం లేదు. అతను పడుకున్నవాడు లేచి వచ్చాడు.

"ఏడవకు? ఏం జరిగిందని?"

సంధ్య మరింత తల వంచుకుంది.

"చూడు, నాకు ఏడ్చేవాళ్ళని చూస్తే అసహ్యం! ప్రమాదా లేవీ జరగవు! వివేకంగా ప్రవర్తించు!"

ప్రమాదా లేవీ జరగవుట – ఏడవకూడదట – వివేకంగా ప్రవర్తించాలిట! ఏం జరిగిందంటున్నారు? ఏదో జరిగేదే! తను మేలుకొనకపోతే.....

అమ్మో, ఎంత జాగ్రత్తగా వుండాలి– సంధ్య మనసుని గట్టి చేసుకో సాగింది. శ్రీకాంత్ తన ముందునుంచే వెళ్ళిపోయాడు.

రెండు రోజులు ప్రశాంతంగా మౌనంగా గడిచి పోయినయి. నాగపూర్ నుంచి మధు ఫోను చేశాడు. అతని మామగారు పోయారట. మాధవి కొన్నాళ్ళు తల్లి దగ్గరే వుంటుందనీ, తను మాత్రం పది రోజుల తర్వాత వెళ్ళిపోతున్నాననీ చెప్పాడు. శ్రీకాంత్ నాగపూర్ పదో రోజుకి వెళ్ళాలను కున్నాడు. సంధ్యను రమ్మన లేదు. అత్తగారి దగ్గర నుంచి మనిషి వచ్చాడు. అవిడ అరోగ్యం బాగా లేదట. ఒకసారి శ్రీకాంత్‌ని వచ్చి వెళ్ళమని కబురు! సంధ్య ఒకరోజు పొద్దున కూర్చుని లెక్కపెట్ట సాగింది. తనకి ఇరవై మూడేళ్ళు. ఇట్లా పూలకుండీలలో పూలు సర్దుతూ, ఇద్దరు మనుషులకు వంట చేస్తూ నిశ్శబ్దంగా జీవితం గడవాలంటే ఎన్ని సంవత్సరాలు? ఎన్ని రోజులు? ఎన్ని గంటలు? ఎన్ని నిముషాలు గడవాలో! తనీ ఇంట్లో వుండగా అత్తగారు రాదు. అవిడకు తను చేసిన ద్రోహం ఏమిటో తెలియదు. అవిడ పట్ల తను గౌరవంగానే ప్రవర్తించింది. ఈ ఇల్లు, ఈ సుఖాలు వదిలి అవిడ ఆ తోటలో ఒంటరిగా ఎందుకుంటుంది? కేవలం తన నుంచి దూరంగా వుండాలనే!

శ్రీకాంత్ కాఫీ తాగి బయట కెళ్ళిపోయాడు. విసుగ్గా లేచి వంటగది నానుకుని వున్న వరండాలోకి వెళ్ళింది సంధ్య. వంటగది మందు నుంచి ఆ ఇంటి గదులన్నీ ఆ వరండాలోకి తెరుచుకుంటయి. గుండ్రంగా విశాలంగా ఇంటిని మొత్తం అనుకుని వున్న వరండా అది. గుండ్రటి స్తంభాలతో వున్న ఆ వరండాలో ఒకచివర నుంచి ఇంకో చివరకు నడవాలంటే కాళ్ళు నొప్పులు పుడతయి. ప్రతి స్తంభం దగ్గర పెద్ద పెద్ద గులాబీల తొట్లు అమర్చబడినయి. రోజూ శ్రీకాంత్ ఆ పూలను ఒక-సారి వచ్చి పరామర్శించి పోతుంటాడు. అతని దిన చర్యలో అన్నీ టైము ప్రకారం కరక్టుగా సాగవలసిందే!

తరిగిన కూరగాయల చెక్కులు పారబొయ్యటానికి మంగి వచ్చింది.

విశ్వనాధ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేలూరి
శివరామశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శ్రీశ్రీ, తల్లావఝ్ఝల శివశంకర
శాస్త్రి, కాటూరి వెంకటేశ్వరరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి,
మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర-
శర్మ, భావరాజు వెంకట కృష్ణారావు , రాయప్రోలు సుబ్బారావు,
పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర, పిలకా
గణపతిశాస్త్రి, విద్వాన్ విశ్వం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం,
వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీరంగం నారా
యణబాబు, గొబ్బూరు వెంకట రాఘవా

# భారతి

## సాహిత్య మాసపత్రిక

నందరావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పానుగంటి
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, జి. వి.
లక్ష్మీ నరసింహారావు,
కృష్ణారావు, కె. వి. రమణారెడ్డి, నిత్యేశ్వర్, మల్లంపల్లి శరభయ్య,
కొత్త సత్యనారాయణ చౌదరి, జాషువ, కవి కొండల వెంకటరావు,
చిలుకూరి వీరభద్రరావు, వేటూరి వెంకటరమణయ్య, వేదం
వెంకటరాయశాస్త్రి, వక్కల కాళిదాసు, ఆర్. ఎస్. సుదర్శనం,
చలం, రాచకొండ విశ్వనాధశాస్త్రి, బలివాడ కాంతారావు, చక్రవర్తి
రాజగోపాలాచారి, చేకూరి రామారావు, తుమ్మల సీతారామ
మూర్తి, బి. జి. ఎల్. స్వామి, నిడుదవోలు వెంకటరావు, హెచ్. ఎస్.
బ్రహ్మానంద, సర్దేశాయి తిరుమలరావు, ఆరుద్ర, కవికోకిల
దువ్వూరి రామిరెడ్డి, విక్రాల శేషాచార్యులు, దాశరధి, డా. సి.
నారాయణరెడ్డి, గుంటూరు శేషేంద్రశర్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్.

GANDHI

# రాగసంధ్య

చలికాలమేమో పగలు తొమ్మిదైనా ముసురుగానే వున్నట్టున్నది.

"మంగీ! వంటకి తొందరేమున్నది! కూర్చో కాసేపు!"

"పనేల కూకుంటే ఎట్టాగండీ! అయ్యగారు కోపగిస్తారు!" మంగి కూర్చుంటూనే అన్నది.

"ఉండండి! బియ్యం తెస్తా! రాళ్ళున్నాయేమో!" మళ్ళీ లోపల కెళ్ళింది మంగి.

పెళ్ళయిన తర్వాత మంగికి కాస్త ఒళ్ళొచ్చింది. దాని మామ మెకానిక్ షాపు పెట్టుకున్నాడు. శ్రీకాంతే పెట్టించాడు. వాడికి కొద్దిగా సైకిళ్ళు రిపేరు చెయ్యటం లాంటి పను లొచ్చు. కొన్నాళ్ళు ట్రైనింగ్ ఇప్పించి వాడిచేత షాపు పెట్టించాడు. ఆ వీధి మలుపు తిరిగితే షాపు.

చేటలో బియ్యం పోసుకుని వచ్చి కూర్చున్నది మంగి.

**"అమ్మగారూ! ఒకమాటడుగు తాను! కోపం తెచ్చుకోరుకదా!"**

**పడక కుర్చీలో వెనక్కు వాలి పడుకుంటూ అడగమన్నట్టు తలూపింది సంధ్య.**

**"మీకిష్టమైతే సమాధానం సెప్పండి! కాని, కోపగించమాకండి!"**

**"అడుగు–"**

**క్షణం ఆగి అంది మంగి.**

**"మీరట్టా మంచాలు దూరంగా ఏసుకుని ఎట్టా పడుకుంటారండీ! మా మామ పక్కన లేందే నాకు నిద్దరే పట్టదు–" బోలెడు సిగ్గు పడిపోతూ అంది మంగి.**

**సంధ్యకు నవ్వొచ్చింది.**

**"నువ్వే చెప్పావుగా! మీ అయ్యగారికి సీతమ్మ వారి లాంటి ఇల్లాలొస్తుందను కున్నామని! మరి, నేను సీతమ్మ వారి లాంటిదాన్నికాను– మీ అయ్యగారిని తాకే అర్హత నాకు లేదు!"**

**మంగి ముఖం పాలిపోయింది.**

**"మీకింకా ఆ మాటలు గుర్తున్నాయా! నేనప్పుడే మర్చిపోయాను. ఏదో** కోపంలో అన్నాను క్షమించండమ్మాయి గారూ–!" దీనంగా అంది మంగి.

**"వున్న మాటే అన్నావు! సరేకాని, మీ అయ్యగారు అంతకు ముందు ఎవ్వర్నీ పెళ్ళిచూపుల కంటూ వెళ్ళి చూడలేదా!"**

**మంగి ఎరగబడి నవ్వింది.**

"అయ్యో! అయ్యగోరెళ్ళి సూసేదాకా ఆగేవాళ్ళెవరండీ! పిల్లల అయ్యలు వాళ్ళ పిల్లల్ని ఇక్కడికే తెచ్చేవోరు! బాబుగారు కన్నెత్తి సూసేవోరు కాదు. అమ్మగారు గోలెట్టేవారు! ఎప్పుడూ అదే నవ్వు! ఏం మాట్టాడేవోరుకాదు! అమ్మగారెన్నన్నా నవ్వుతూ కూకుండి పోయేవోరు! సూత్తావుంటే మాకు భలే ఇచిత్రంగా వుండేది లెండి!" మంగి హుషారుగా చెప్పుకు పోతున్నది.

"ఎందుకని? మీ అయ్యగారంత గొప్ప ప్రవరాఖ్యుడా!"

"ఆ– ఆయనెవరండీ!"

సంధ్య మూతి ముడుచుకుని వస్తున్న నవ్వు ఆపుకుంది.

"మీరు సెప్పిన ఆయనెవరో నాకు తెల్దుగాని– అయ్యగారు మాత్రం మాగట్టోరు. ఆయమ్మ– మనోరమ – ఆయమ్మ వచ్చి ఇక్కడ ఆర్నెల్లో ఏడాదో వుందండి – భలే ఫార్సు లెండి– అమ్మగారు మనోరమమ్మను కోడల్ని సేసుకోవాలని మా ముచ్చట పడి పోయారు! ఎన్ని సీరెలు, ఎన్ని నగలు– ఎన్నికొన్నారో! ఆయమ్మ కూడా మంచిదే! గలగలా సెలయేరులా ఒకటే అడావుడి సేసేది. మమ్మల్ని నిలవనిచ్చేది కాదు. అయ్యగార్ని వూదర పెట్టి ఎన్నాళ్ళు తిప్పిందో! ఒక రోజే మయిందనుకున్నారు–"

మంగి సంధ్యకు దగ్గరగా జరిగింది. సంధ్య గడ్డంకింద చెయ్యి పెట్టుకుని వింటున్నది.

"ఆయమ్మ – అదేమనోరమమ్మ తానం చేస్తున్నారు. అయ్యగారు

# ధర్మపథం



## రాజు-ఆశ్రితుడు

ఐహిక సుఖాలమీదా, ధనం మీదా ఆపేక్ష ఉండకూడదనీ, మానవమాత్రుణ్ని ఆశ్రయించేక భగవంతుణ్నే ఆశ్రయించాలనీ, మోక్షానికి ప్రయత్నించాలనీ భాగవతం చెప్పుతూ ఉన్నది. పోతరాజుగారు ఆ విధంగానే జీవితం గడిపి ధన్యులైనారు. భాగవతం చదివినంత మాత్రాన ప్రయోజనంలేదు. అందలి విషయాలను అవగాహన చేసుకుని, ఆ విధంగా ప్రవర్తించాలి.

భాగవతాన్ని బాగా చదివిన పండితుడొకడు, అందలి విషయాలను రాజుగారికి వినిపించి, ఆయనవల్ల ఆర్థికంగా సహాయం పొందాలని సంకల్పించాడు. ఆతడు రాజుగారివద్దకు పోయి, భాగవతంలోని చక్కని విషయాలను వినిపిస్తాననీ, తనకు అవకాశం ఇవ్వాలనీ కోరాడు. బుద్ధిశాలి అయిన ఆ రాజు "మీరు ఒకసారి భాగవతాన్ని చదివి, వారం రోజుల తర్వాత రండి" అని చెప్పి పంపివేశాడు. ఆ పండితుడు ఒకసారి ఆ గ్రంధం తిరగవేసి, వారం రోజులు గడిచాక రాజ దర్శనానికి వెళ్లాడు. అప్పుడు కూడా రాజు "అయ్యా!మీరు మరొకసారి భాగవతం చదివి, వచ్చే-వారం రండి" అని అన్నాడు. ఆ పండితుడు కొంచెం విసుగుకొని యింటికివచ్చి, మరొకసారి భాగవతం చదివి, తాను కొత్తగా గ్రహించవలసినది ఏమీ లేదనుకొని తృప్తిపడి, వారం రోజులకు తిరిగి రాజువద్దకు వెళ్లగా, ఆయన వెనుకటి మాటనే చెప్పాడు. పండితునికి ఆశ్చర్యం కలిగింది. ఇన్నిసార్లు, రాజు ఇలా అనడంతో ఏదో నిగూఢార్థం ఉన్నదని, అతడు పరిశీలన దృష్టితో భాగవతం మరోసారి చదివి, ధనాశతో ఇతరుల నాశ్రయించరాదనీ, రాజులకు రాజైన భగవంతునే ఆశ్రయించి ముక్తి సాధనకు పూనుకోవాలనీ, ఇహ సుఖాలు నీశ్వరాలని గ్రహించి, ఇక రాజువద్దకు వెళ్లరాదని నిశ్చయించుకున్నాడు.

తర్వాత రెండు వారాలు గడిచినవి. పండితుడు తన వద్దకు రానందువల్ల, తత్వాన్ని గ్రహించినట్లు తెలుసుకుని, తానే స్వయంగా ఆ పండితుని యింటికి వెళ్లి, "ఎందుకు రాలేదు?" అని అడిగాడు. తత్వాన్ని గ్రహించిన పండితుడు భాగవతం నుండి తాను గ్రహించిన సారమును రాజునకు తెలియజేశాడు. రాజు, ఆతనిని అప్పుడు తగిన రీతిని సత్కరించి, ఆతని దారిద్ర్యాన్ని పోగొట్టాడు.

(శ్రీ హనుమత్కాళీ వరప్రసాద బాబుజీ ప్రసంగం చదివాక)

–బులుసు వేంకట రమణయ్య.

---

ఛిసురుగా లోపలి కొచ్చి అమ్మగారితో తగాదా పెట్టుకున్నారు. ఏమని? 'ఎక్కడ్నుంచి తెచ్చావో నా ప్రాణానికి! బిజినెస్ దెబ్బతిని పోతున్నది. అమ్మగార్ని రోజ్జమ్మట తిప్పలేక నా ప్రాణం పోతున్నది. దాన్ని పంపేయి నాకు మనశ్శాంతి లేదు!" అన్నారు అయ్యగారు."

అమ్మగారు ఛర్రున లేచారు.

"మనోరమ వెళ్ళటానికి రాలేదు! ఇక్కడే వుంటుంది. త్వరలో నే ముహూర్తం పెట్టించి మీ ఇద్దరికీ పెళ్ళి చేస్తాను! పిచ్చిగా వాగకు!" అన్నారు.

'ఏమిటి? ఆ బజారు మనిషితో నాకు పెళ్ళా? అది ఆడదేనా! సిగ్గు లేకుండా మగవాడి మీద పడి అసభ్యంగా ప్రవర్తిస్తూ, తన్ను ఆకర్షించాలని వెర్రి మొర్రి వేషాలు వేసే ఒక మామూలు చవక బారు ఆడదా నా పెళ్ళాం! ఇంతకంటే ఏ బజారుదాన్నైనా తెచ్చుకుని చేసుకుంటే చెడిపోయిన ఒక ఆడదానికి జీవితాన్నిచ్చిన వాడినైనా అవుతాను! స్త్రీ సహజమైన సిగ్గు గాని, బెరుకు గాని ఏవైనా ఆ పిల్లలో వున్నయ్యా! నీమీద గౌరవంతో ఇన్నాళ్ళూ ఊరూరా తిప్పి చూపించాను. ఇక నాకు ఓపికలేదు నావల్ల కాదు!' బాబుగారికి ఎన్నడూ రానంత కోపం వచ్చింది.

స్నానం చేసొచ్చిన ఆయమ్మ బాబుగారి మాటలన్నీ ఇన్నారు. ఎంత గోల సేసారమకున్నారు. నాలుగు రోజులు అన్నం నీళ్ళు ముట్టుకోలేదు. అమ్మగారు కూడా ముట్టుకోలేదు. సివరికి బాబుగారిచేత ఆమెకు క్షమాపన సెప్పించే దాకా అమ్మగారు వూరుకోలేదు. అప్పుడయ్యగారి ముఖం సూస్తే మాచెడ్డ దుఃఖం వచ్చింది!"

"మీ అయ్యగారికి ఆ అమ్మాయి మీద కొద్దో గొప్పో అభిమానం లేకపోతే క్షమార్పణ చెప్పుకుంటారా!"

"ఛ! అదేంలేదు! అమ్మగారికోసం – అంతే!" చాలా తేలిగ్గా అంది మంగి.

"మరి , అమ్మగారి కోసం పెళ్ళి చేసుకోవచ్చుగా!"

"ఇసం తాగుతాను గాని, పెళ్ళి సేసుకో నన్నారండీ!"

సంధ్య నిటారుగా అయింది.

"మీ అయ్యగారి కెందుకంత పట్టుదల?"

"ఏమోనండి! పెళ్ళి మాత్రం సేసుకోననేవోరు!"

"ఎందుకో మరి?"

"అమ్మగారు – అయ్యగారీ జన్మలో పెళ్ళి సేసుకోరనే అనుకున్నారండి! కాని, హఠాత్తుగా ఒక రాత్రి మిమ్మల్ని సేసేసుకున్నారు!"

సంబరంగా అంది మంగి.

(ఇంకా ఉంది)




# పాలకూర సీతాలత

# ఉంగర కొండు

"ఏరా ప్రసాద్.... రెడీయేనా?.... అడిగేడు వెంక ట్రావు కొడుకుని.

"ఆఁ...." అంటూ బయటకు వచ్చేడు పదహారేళ్ళ ప్రసాద్.

"పద....మామయ్య వాళ్ళు ఎదురు చూస్తూ వుంటారు. ఊళ్ళో వుంటూ టైముకి వెళ్ళకపోతే ఏం

బాగుంటుంది?" అంటూ ఇల్లు తాళం పెట్టాడు వెంకట్రావు.

వెంకట్రావు భార్య సుబ్బలక్ష్మి ముందే వెళ్ళిపోయింది అన్నగారింటికి. ఆ రోజు ఆమె అన్నయ్య సీతాపతి కొడుకు మూడో పుట్టిన రోజు. ఆర్థికంగా బలవంతుడైన సీతాపతి తన కొడుకు పుట్టినరోజు బ్రహ్మాండంగా జరుపుతున్నాడు. ఆ ఫంక్షన్‌కే ఈ తండ్రీకొడుకులు బయలుదేరింది

సీతాపతి, అతని భార్య అవనిజ గుమ్మందగ్గరే నిలబడి అతిథులను సాదరంగా ఆహ్వానిస్తున్నారు భారీ ఎత్తున జరుగుతున్న ఏర్పాట్లను చూసి వెంక ట్రావు ఆశ్చర్యపోయాడు అంతలోనే సం పెట్టుకున్నాడు సీతాపతి లక్షాధికారి అందుకు తగ్గ ఎత్తులోనే ఫంక్షన్ నడిపించాలి అంతేకాదు ఇలాంటి వాళ్ళు ఈ ఫంక్షన్సు వ్యాపారాభివృద్ధి దృష్టిలో పెట్టుకుని చేస్తారు. పెద్ద పెద్ద వాళ్ళని ఆహ్వానించి వాళ్లని మొహమాటంలో పెట్టేస్తే, ఆ తర్వాత వాళ్లవల్ల పనులు తేలిగ్గాజరిగిపోతాయి

"రా బావా... ఊళ్లోవుండి నువ్వు కూడా ఇంత ఆలస్యం చేస్తావా?" అన్నాడు సీతాపతి వెంకట్రావును ఆహ్వానిస్తూ

చిరునవ్వు నవ్వేడు వెంకట్రావు.

"మీ చెల్లెలు ముందే వచ్చేసిందిగా అన్నాడు

'అయితే మాత్రం?. ఏరా ప్రసాద్. బాగా చదువు)తున్నావా? అడిగేడు మేనల్లుడిని తల ఊపాడు ప్రసాద్

అందరూ వచ్చాకా కేక్ కట్ చేయించాడు కొడుకు 'వంశీకృష్ణ' చేత. అందరూ చప్పట్లు కొడుతూ "హాపీ బర్త్‌డే టుయూ. .' అంటూ పాడేరు

మూడేళ్ళ వంశీకృష్ణ కూడా ఉత్సాహంతో చప్పట్లు కొట్టాడు.

ఆ తర్వాత విందు ప్రారంభం అయ్యింది.

ఫంక్షన్ అయిపోయేకా తనూ బయలు దేర బోయాడు వెంకట్రావు. మిగిలిన వాళ్ళతో "ఉండు బావా. .. రేపు వెళ్ళవచ్చుకదా.. అన్నాడు సీతాపతి

"అవునండీ .. పొద్దుట్నుంచీ వచ్చే చాకిరితో సరిపోయింది అడుగుతీసి అడుగు వెయ్యలేక వుండిపోదాం. అంది సుబ్బలక్ష్మి

చల్లగాలి వీస్తుంటే అందరూ వచ్చి లాన్‌లో కూర్చున్నారు.

హీరో ఆఫ్‌ది డే వంశీకృష్ణని ఒకచోట అని వుంచకుండా అందరూ వాడ్ని ఎత్తుకుని ముద్దులు పెట్టుకుంటున్నారు.

ఒంటినిండా ఆభరణాలతో , వాడు మెరిసి పోతున్నాడు.

మెడలో రెండు గొలుసులు, చేతికి మూడు ఉంగ రాలు–

ప్రసాద్ వంశీకృష్ణను ఎత్తుకుని వాడి కుడిచేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు.

ఆ తర్వాత వంశీకృష్ణను కొడుకు చేతిలోంచి వెంకట్రావు అందుకున్నాడు.



మదరాసు తెలుగు అకాడమి ఆధ్వర్యంతో తమిళ ఉగాది సందర్భంగా 14-4-85న మదరాసులోని స్వామి శంకర్‌దాస్ ఆడిటోరియంలో ప్రదర్శించిన కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీ వారి నృత్య నాటకంలో ఒక దృశ్యం రసవత్తరమైన ఈ నృత్య నాటకాన్ని డా. వెంపటి చినసత్యం రూపొందించారు.

అప్పుడే సరిగ్గా అప్పుడే వంశీకృష్ణ చేతికి వదులుగా వున్న ఒక ఉంగరం ప్రసాద్ చేతిలోకి వచ్చింది

ఆ క్షణంలో ఏం అన్పించిందో తెలీదుగానీ . ఆ ఉంగరాన్ని తక్కున్న తన చొక్కా జేబులో వేసుకున్నాడు ప్రసాద్ మరొక రెండు నిముషాల దాకా ఆ ఉంగరం ఏం చెయ్యాలో తెలియలేదు. ఆ తర్వాత ఆలోచించాడు ప్రసాద్.

అంత చిన్న కుర్రవాడికి ఉంగరాలు పెట్టమని ఎవరు చెప్పారు డబ్బు వుందికదా అన్న అహం కాకపోతే తన చేతిలోకి రాకపోయినా . అది ఎక్కడో క్రింద పడిపోగలదు అప్పుడు ఏం చేస్తారు? చిన్న ఉంగరాన్ని వెతకడం మాటలుకాదు ఇలా ఒకటి రెండు వస్తువులు పోతేగానీ వీళ్లకు బుద్ధిరాదు. తను ఆ ఉంగరం వుంచుకొని 'మంచిపని చేశాడు ప్రసాద్ మేనమామ కలిమికి అప్పుడప్పుడు అసూయ చెందుతూ వుంటాడు . నిజమె మరి. ... మధ్య తరగతి వెంకట్రావు ప్రసాద్ కోరికలన్నీ తీర్చలేక పోతుంటాడు అందుకే కొంచెం అసంతృప్తితో బ్రతుకుతున్నడు ప్రసాద్ ఎదుగుతున్న కుర్ర

వాడు.... తన వయసులో వున్న ఇతర కుర్రవాళ్ల జల్సాలు చూసి తనకు ఆ అదృష్టం లేనందుకు బాధపడుతూ వుంటాడు. దానికి తోడుగా గొప్పలకు పోయే అవనిజ అత్తయ్యను చూస్తే కొంచెం కన్నెర్రగా వుంటోంది. అందుకే కాబోలు..... ఆ ఉంగరం తన స్వంతం చేసుకోవాలన్పించి....... జేబులో పెట్టుకున్నాడు. ఆ మనసులో తనకు ఉంగరం దొరికిందన్న సంతోషంకంటె అత్తయ్య కొడుకు ఒక ఉంగరం పోగొట్టుకున్నాడన్న తృప్తే ఎక్కువగా వుంది ఆతనిలో.

ఆ తర్వాత ఆ ఉంగరంతో ఏం చెయ్యాలన్న ఆలోచన వచ్చింది ప్రసాద్‌కి.

ఉంగరం తన స్వంతం అయినట్టే. అది తన దగ్గరున్నదన్న విషయం ఎవ్వరికీ తెలియదు. దాన్ని మూడో కంటివాడికి తెలియకుండా అమ్మితే.... వంద రూపాయలు కనీసం వస్తాయి. వంద రూపాయలు అనగానే ఆ రోజు ఉదయం తండ్రితో జరిగిన సంభాషణ గుర్తు వచ్చింది. "నాన్నా!....మా క్లాసు పిల్లలందరూ ఎక్స్కర్షన్ వెళ్తున్నారు. వంద రూపాయలు అవుతుందట. వెళ్లదల్చుకున్నవాళ్ళు నాలుగు రోజుల్లో డబ్బుకట్టాలి...." అన్నాడు ప్రసాద్

"అయితే ఏమంటావ్?" అన్నాడు వెంకట్రావు.

"నేను కూడా వెళ్తాను" అన్నాడు చిన్నగా.

"అక్కర్లేదు. మానెయ్యి. నెల మధ్యలో నన్ను వందరూపాయలు తెమ్మంటే ఎక్కడ్నుంచి తేను? ఇక్కడ డబ్బులు చెట్టుకి కాస్తున్నాయనుకుంటు న్నావా? శ్రద్ధగా కూర్చుని చదువు.... ఎక్స్కర్షన్ పేరుతో తిరుగుళ్ళు అక్కర్లేదు...." అన్నాడు వెంకట్రావు.

ముఖం మాడిపోయింది.

"తిరుగుళ్ళు కాదు నాన్నా!..... వినోదయాత్ర. దానివల్ల విజ్ఞానం కూడా పెరుగుతుంది అన్నాడు.

# ఉంగర కాండ

ఆ విషయం వెంకట్రావుకి తెలియక కాదు.. కానీ డబ్బు చేతిలో లేనప్పుడు దాన్ని తిరుగుళ్ళుగానే భావించడం ఒక రకమైన తృప్తి. ఆ విషయం కొడుక్కి తెలియదు.

"పోనీ.. పంపించరాదుటండీ.. అడక్క అడక్క అడిగేడు.." అంది సుబ్బులక్ష్మి.

వెంకట్రావు కోపం సుబ్బులక్ష్మి మీదకు మళ్ళింది.

"ఏం చెయ్యాలో.. ఏం చెయ్యకూడదో నాకు బాగా తెలుసు.. ఒకళ్ల సలహాలు అక్కర్లేదు.. నాదగ్గర డబ్బు లేదు.." అన్నాడు కోపంగా.

పోనీ.. మా అన్నయ్యను అడగనా?"

"అక్కర్లేదు.. అంతకంటె అవమానం మరొకటి వుండదు.. ఆర్థికంగా దిగువ మెట్టుపై వున్న మనల్ని మీ అన్నయ్య నన్ను ఏమాత్రం గౌరవంతో చూస్తున్నాడో తెలుసు..పైకి చిరునవ్వుతో మాట్లాడతాడు తప్ప నేను అంటే గౌరవంలేదు.. అలాంటప్పుడు నువ్వు వంద రూపాయల అప్పుకి వెళ్తే.. ఇక నేను ఆత్మహత్య చేసుకున్నట్టే..." అన్నాడు వెంకట్రావు.

సుబ్బులక్ష్మి ఆ మాటలు విని తలదించుకుంది.. ఎందుకంటే అతను నిజమే చెప్తాడు కనుక.

ఆ తర్వాత వెంకట్రావు శాంతంగానే అన్నాడు.

"చూడులక్ష్మీ!... వాడంటే నాకు ప్రేమ లేకకాదు. నిజానికి ఒక్కగానొక్క కొడుకు అయినందుకు వాడిని ఎంతో గారం చెయ్యాలి.. కానీ నా ఆర్థిక స్థితి నీకు తెలియనిదికాదు. చదువుకోమని నాన్న చెప్పిన మాటలు అలక్ష్యం చేశాను. అందుకే చిన్న ఉద్యోగంతో సరిపెట్టుకోవల్సి వస్తోంది.. అందుకనే ఈ పాట్లు మరి.."

భర్త గొంతులోని పశ్చాత్తాపం గమనించింది సుబ్బులక్ష్మి.

"అవును నాయనా.. మన స్థాయికి తగ్గట్టు మనం వుండాలి.. అందరాని ఎత్తులకు ఎగిరి క్రిందపడటం కంటె ఊరుకోవడం మేలు.." అని నచ్చచెప్పింది.

నిరాశగా అక్కడ నుంచి వెళ్ళిపోయాడు ప్రసాద్.. పరిస్థితులు అర్థం చేసుకోలేదు కనుక కొంచెం చిన్నబుచ్చుకున్నాడు.

ఆ తర్వాత సుబ్బులక్ష్మి అన్నగారింటికి బయలు దేరింది – వంశీకృష్ణ పుట్టిన రోజు ఏర్పాట్లకూ-

"డబ్బు విషయం అడగకు..."అన్నాడు వెంకట్రావు.

"ఒకసారి చెప్పారుగా... అడగను లెండి.." అంటూ గుమ్మందిగింది సుబ్బులక్ష్మి.

ఇప్పుడు ఈ ఉంగరం అమ్మి ఆ డబ్బుతో ఎక్స్కర్షన్‌కు వెళ్తే?....

ఆ ఆలోచనలకే మనసు పులకించింది ప్రసాద్‌కి.

నిజమే. అలాగే చెయ్యాలి. తన స్నేహితులతో పాటు తనూ వెళ్లవచ్చు. ఎంజాయ్ చెయ్యవచ్చు.

తృప్తిగా జేబులో వున్న ఉంగరాన్ని తడుము కున్నాడు. ప్రపంచంలోని సంపద అంతా తనవశం అయినట్టు తోచింది. తెల్లవారి లేచి ఎవరిముఖం చూశాడో కానీ. తను చాలా అదృష్టవంతుడు. తనకు ఉంగరం దొంగిలించా లన్న ఆలోచన లేదు కానీ ఆ ఉంగరం తనంత తాను తన చేతిలోకి వచ్చింది. తన సమస్య దానికి తెల్సింది కాబోలు. అందుకే అది తన దగ్గరకు వచ్చింది. లోలోపలే సంతోషపడి పోయాడు.

తను ఎక్స్కర్షన్‌కు రాలేనని టీచరుతో చెప్పడం ఎలాగా అని బాధపడిపోసాగాడు.

తన స్నేహితులు తనురావటం లేదని తెలిసి నవ్వితే ఏంచెయ్యాలా అని ఆలోచించసాగాడు. ఇప్పుడు ఆబాధ నుంచి తనను తప్పించడానికే భగవంతుడు తనచేతిలో ఉంగరం పెట్టాడు.

ఇక తను తన తండ్రికి బాధ కల్గించకుండానే హాయిగా మిత్రులతో వెళ్ళి రావచ్చు.

ప్రసాద్‌కి ఒక విషయం అర్థం అయ్యింది. ప్రపంచంలో అన్నింటికీ మూలం డబ్బు.

ఆ డబ్బు లేనందువల్లనే తండ్రి తన కోరికను తీర్చలేక పోతున్నాడు. ఆడబ్బు ఉండటం వల్లనే మూడు సంవత్సరాల గుంట వెధవ చేతికి మూడు ఉంగరాలు పెట్టుకోగలిగాడు.

తను కూడా కష్టపడి చదివి బోలెడు డబ్బు సంపాదించాలి. అప్పుడే తనకు తృప్తి...శాంతి.

ఇంతకీ ఉంగరం బంగారానిదేనా?... ఆ... అందులో ఎంతమాత్రం అనుమానం అక్కర్లేదు.

లక్షాధికారి మామయ్య కొడుక్కి బంగారం ఉంగరం చేయించక రోల్డుగోల్డు చేయిస్తాడా?

మంచి జరీచీర కొనుక్కుంటే వీధంతటికీ ఆవిషయం చెప్పిరానిదే నిద్రరాని అత్తయ్య తన కొడుక్కి రోల్డుగోల్డు ఉంగరం చేయిస్తే ఊరుకుంటుందా?

మరోసారి వంశీకృష్ణని ఎత్తుకున్నాడు. వాడి



చేతికి వున్న మిగతా రెండు ఉంగరాలూ ఎవరూ చూడకుండా ఒకసారి లాగి చూశాడు. అవి బిగుతుగా వున్నాయి. అంత తేలిగ్గారావు..అయినా తను అలా దొంగతనం చెయ్యకూడదు. ఆ ఉంగరం అయినా తనంతతాను ఊడివచ్చింది కాబట్టి తీసుకున్నాడు కానీ.....

అందుకే ఇక మిగతా ఉంగరాల గురించి పట్టించుకోలేదు.

"వాడిని ఇలా ఇచ్చెయ్యరా.. ఇప్పటికే వాడిని అందరూ ఎత్తుకుని నలిపేశారు.

అలిసిపోయి వుంటాడు బుజ్జిముండ..." అంటూ ప్రసాద్ దగ్గర్నుంచి అవనిజ తీసుకుంది.

అత్తయ్యకు ఇచ్చేశాడు. మనసులో కసిగా అనుకున్నాడు–

"డబ్బుందని ధీమా. పిల్లవాడు నలిగిపోయాడట. వాడేమన్నా గులాబీ పువ్వా?"

మరో అయిదు నిముషాలు గడిచాయి.

అప్పుడే... సరిగ్గా అప్పుడే...

అవనిజ కంగారుగా అంది–

"అరె... వీడి చేతికి మూడు ఉంగరాలు పెట్టాను... ఒకటి లేదు...."

రైలు ప్లాట్‌ఫారం మీదకి వచ్చినప్పుడు అంత వరకూ నిద్రపోతున్న ప్లాట్‌ఫాం ఒక్కసారి సందడి పుంజుకుంటుంది. అలాగే ఒక్కసారి కలవరం మొదలయ్యింది.

సీతాపతి మాత్రం తాపీగా అన్నాడు.

"సరిగ్గా చూడు.. ఎక్కడికి పోతుంది?" అన్నాడు.

అందరూ కలిసి ఇల్లంతా వెతకసాగారు. బాబు ఎక్కడెక్కడ తిరిగాడో గుర్తు చేసుకుని మరీ వెతుకుతున్నారు అందరూ. వాళ్ళ ఇంటి నౌకరు వీరయ్య కూడా హడావుడి పడిపోయాడు.

"లేదండీ...." అంది అవనిజ బాధగా.

"అప్పుడే అలా నిరాశ పడిపోతావేం?.... ఎక్కడికి పోతుంది. శ్రద్ధగా వెతికితేసరి.... ఎవరో పట్టుకు పోయారని అనుకుందుకు వీల్లేదు. అతిథులంతా పెద్దమనుషులే....."అన్నాడు సీతాపతి.

అవనిజ చాలా అనుమానం మనిషి... డబ్బులేని వాళ్ళందరూ అవినీతి పరులే అనుకుంటుంది.

ఆమెకు అడపడుచు అంటే పడదు.. లోకానికి భయపడి పెదాలపై తేనె పూసుకుని మాట్లాడుతుంది తప్ప.

"దాందేముంది.... అందరూ శ్రీవైష్ణవులే... కానీ ... బుట్టలో రొయ్యలన్నీ మాయం అన్నట్టు....." అంటూ సుబ్బలక్ష్మి వైపు చూసింది అవనిజ.

వదిన గారి ఉద్దేశ్యం గ్రహించక పోలేదు సుబ్బలక్ష్మి.

"అంటే?" అంది కొంచెం బాధగా.

నవ్వుకుంది అవనిజ.

"ఏదో మాట వరసకు అన్నాను... అంతమాత్రానికే గుమ్మిడికాయ దొంగ అంటే భుజాలు తడుము

# 36 గంటల నిర్విరామ నృత్యప్రదర్శన!



'శ్రీ వినాయక కౌతము' నృత్య ప్రదర్శనలో నాట్యాచార్య శ్రీ ఆనెం లక్ష్మణరావు

ఇటీవల తణుకులో 36 గంటలు నిర్విరామంగా నృత్యం చేసి దేశ ప్రఖ్యాతి గాంచిన శ్రీ ఆనెం లక్ష్మణరావు,1946 సంవత్సరంలో శ్రీకాకుళం జిల్లా రాజాం సమీప గ్రామమైన పుల్లెలుమామిడిపల్లిలో దేవాంగుల కుటుంబంలో జన్మించారు.

శ్రీ లక్ష్మణరావు తండ్రి కుమారుని విద్యాభ్యాసము పట్ల తగిన శ్రద్ధ వహించని కారణంగా వీరి చదువు 4వ తరగతితోనే ఆగిపోయింది. వీరికి చిన్నతనమునుండి నృత్యమంటే అభిలాష మెండు. సినిమా పాటలకు తదనుగుణంగా నాట్యం వేయుచు ప్రేక్షకులను ఆనందింప చేసేవారు. శాస్త్రీయ పద్ధతిలో నాట్యం అభ్యసించాలనే ఉద్దేశ్యంతో అందులకనువైన ప్రదేశం కోసం తన 12వ ఏట కూచిపూడి, తెనాలి, విజయవాడ, ఏలూరు పట్టణాలు తిరిగారు. చివరికి ఏలూరులో కుమారి లక్ష్మి సహాయంతో శ్రీ గంటా కనకారావు వద్ద విద్య నభ్యసించుటకు ఉపక్రమించారు. అదే సమయంలో ఉదర పోషణకై రైల్వేస్టేషనులో వంద్యవిప్ర, బిర్లాభవన్ అనే కాఫీహోటలులో పనిచేసి 9 సంవత్సరములు విద్య నభ్యసించి భరతనాట్యంలో ప్రావీణ్యత సంపాదించారు.

1969లో సామర్లకోటలో స్థిరపడి శ్రీ వేణుగోపాల కళాక్షేత్రంలో నాట్యాచార్యులుగా ప్రవేశించి 3 సంవత్సరములు పనిచేశారు. పిదప 1972లో కాకినాడకు మకాం మార్చి "నటరాజ కళామందిర్" సంస్థను స్థాపించి వందలాది సంఖ్యలో విద్యార్థినీ విద్యార్థులను నాట్యంలో ప్రవీణులను చేశారు. అక్కడి నుండి వచ్చి తణుకులో 1983న "నటరాజ కళామందిరము" ఏర్పాటుచేసి విద్యార్థినీ విద్యార్థులను నాట్యంలో ప్రవీణులను చేశారు. తణుకు ప్రజలు కూడా తగిన ప్రోత్సాహము ఇచ్చారు. దీనికి తోడు ప్రభుత్వ సహకారం కూడా లభిస్తే దేశ గౌరవము కళామతల్లి ప్రతిష్ఠ యినుమడిస్తాయి. శ్రీ లక్ష్మణరావు సుమారు 200 భంగిమలలో నాట్యప్రదర్శన లివ్వగలరు. వీరి ప్రదర్శన వినాయక శబ్దముతో ప్రారంభమవుతుంది.

–ఇ. నారాయణమూర్తి

కున్నట్టు......"

వెంకట్రావుకి కూడా బాధ కల్గింది.

"లక్ష్మీ... పద... వెళ్ళిపోదాం...." అన్నాడు.

"వద్దండీ... వద్దు.... ఇలా అర్థాంతరంగా వెళ్ళి పోతే మావదిన అనుమానం నిజమే అనుకుంటారు....

ఆ ఉంగరం ఎక్కడ పోయిందో వెతకాలి. అది దొరకాలి.... అంతవరకూ వెళ్ళద్దు...." అంది సుబ్బలక్ష్మి అదీ నిజమే అనుకున్నాడు వెంకట్రావు.

"ఒరేయ్... వీరయ్యా... అమ్మాయిగారి ఉంగరం కాని చూసేవా?" అడిగేడు సీతాపతి.

"లేదు బాబా... నేను కూడా అదే వెతుకుతున్నాను.... ఇన్ని సంవత్సరాలుగా పని చేస్తున్నాను.. నేను ఏరోజూ ఇలాంటి నేరం చెయ్యలేదు....." అన్నాడు తన నిర్దోషిత్వం బయట పెట్టుకుంటూ.

ప్రసాద్ ఇవన్నీ ఒక పక్క వింటూనే మరోపక్క వెతుకుతున్నాడు.

ఛీ.... అత్తయ్య ఎంత ఘోరంగా మాట్లాడుతోంది...తమంటే ఎంత చులకన?....

ఆ ఉంగరం తన దగ్గరే వుందన్న విషయం బయట పడిపోతే ఎంత అవమానం?

"మీరు చెయ్యలేక మీకొడుకుచేత చేయించారు" అనరూ? ఈ విషయం తెలిశాకా తల్లి దండ్రులు ఎంత బాధ పడతారు? వాళ్లకు తలవంపులు తెచ్చేలా తను ప్రవర్తించవచ్చా? ... ఇంటికి వెళ్లాకొ తండ్రి తనను క్షమిస్తాడా? పరువు నాశనం చేశావంటూ చచ్చేలా కొట్టడూ? తను తీసుకోవడం ధైర్యంగా తీసుకున్నాడు కానీ రహస్యంగా తను అమ్మగలడా? కొట్టు వాడికి సందేహం కలిగి ఆవిషయం తండ్రితో చెప్తే ఇంకేమన్నా వుందా? . ఏనాడూ కలగని పాడుబుద్ధి ఈ రోజు ఏందుకు కల్గింది . ఇక్కడి వ్యవహారం చూస్తుంటేనే గుండెలు రెట్టింపు వేగంతో కొట్టు కుంటున్నాయి. పిరికితనం కలుగుతోంది తన వారిని అవమానిస్తున్న అత్తయ్య ధోరణికి ఒళ్లు రగిలి పోతోంది

ఇన్ని అనర్థాలకు కారణం అవుతున్న ఆ ఉంగరం వుంచుకోవడమా లేక తిరిగి ఇచ్చెయ్యడమా..

తిరిగి ఇయ్యడం ఎలాగ?.. నీ దగ్గరే వుంచుకుని మాట్లాడలేదేమని అందరూ తనని అడిగితే?..

సీతాపతి వీరయ్యతో అంటున్నాడు

"ఒరేయ్ వీరిగా. నిజంచెప్పు వెధవా నువ్వే తిసివుంటావు తోలు ఒలిచేస్తాను.."

వీరయ్య ఒణికిపోతూ చెంపలు వేసుకున్నాడు.

"లేదు దొరా నాకేం తెలియదు." అన్నాడు.

అనవసరంగా వీరయ్యను కూడా అనుమానిస్తున్నారు ఆ తప్పు వాడు చెయ్యలేదని తెలుసు తనకి ఎందుకంటే ఉంగరం తన దగ్గరే వుంది.... పనివాళ్ల విషయంలో మామయ్య చండశాసనుడన్న విషయం తనకు తెలియనిది కాదు. ఇప్పుడు ఆ ఉంగరం తీసుకుని తను వెళ్లిపోతే . రేపు వీరయ్యమీదే తనకు అనుమానం ఉందని రిపోర్టు ఇచ్చినా ఇస్తాడు మామయ్య పోలీసులు వాడిని చచ్చేలా కొడుతారు ఈ ఆలో చనకే వణికిపోయాడు ప్రసాద్.

- ఛ తను ఎంతనీచమైన పని చేశాడు.. తను

# ఇదేమి న్యాయం?

బట్టల
మురికిని
తొలగించే
'దోబీ'ల
బ్రతుకుల్లో
బండలు!
సమాజం
బట్టలకు
మురికిని
అంటిస్తున్న
నాయకుల
బ్రతుకుల్లో
బంగారం!

—పి. మోహన్

## ఉంగర కాండ

ఎక్స్కర్షన్‌కి వెళ్లడంకోసం చేసిన తప్పు ఎందరి జీవితాల్లో అశాంతిని రేపుతోంది. దొంగతనం చెయ్యకూడదని తెలిసి తను తప్పు చేస్తున్నాడు. తన కోరిక తండ్రి తీర్చలేకపోతే తనకు అదృష్టంలేదని సరిపెట్టుకోవాలి కానీ.. ఇలా తప్పుదారిలో తన కోరిక తీర్చుకోవడం ఏం సబబు?

నిజమే.. తను చాలా పాపపు పని చేశాడు ఆ పాపం వదుల్చుకోవడం ఎలాగ? తన మనసులోని బరువు తగ్గించుకోవడం ఎలాగ? అపార్థం చేసుకోబడిన తనవారిని, వీరయ్యను రక్షించడం ఎలాగ?

అవనిజ తన సహజధోరణిలో ఏదో ఒకటి సణుగు తోంది

'తొందర పడకండ్రా. వెతికితే దొరకదా?' అన్నాడు ప్రసాద్.

సీతాపతి మేనల్లుడి వైపు చూశాడు.

"మామయ్యా. టార్చివుంటే ఇయ్యి.. లాన్‌లో వెతుకుతాను. అక్కడ పడివుండే అవకాశం లేక పోలేదు." అన్నాడు

సీతాపతి ఇచ్చిన టార్చ్‌తో బయటకు వచ్చాడు

నేలమీద దాన్ని ఫోకస్ చేసి అటు, ఇటు వెతికినట్టు నటించాడు

జేబులోంచి ఉంగరం తీసి చేతిలో పట్టుకున్నాడు.

"దొరికిందర్రా." అంటూ గట్టిగా కేకవేశాడు బయటకు వచ్చారు అందరూ

"అనవసరంగా కంగారు పడ్డారు లాన్‌లో పడివుంది.. ఇదిగో." అంటూ సీతాపతి చేతులో పెట్టాడు ఉంగరాన్ని, అంతవరకూ తన జేబులో వున్న ఉంగరాన్ని.. దేన్నయితే అమ్మి ఎక్స్కర్షన్‌కు వెళ్లాలనుకున్నాడో ఆ ఉంగరాన్ని..

అవనిజ ముఖంలో వంద ట్యూబ్‌లైట్ల కాంతి.

"మాబాబే మా ప్రసాద్ కళ్ళు చాలా మంచివి. . థాంక్స్‌రా.. నిజంగా మేం అదృష్టవంతులం..... అందుకే నీకంట పడింది" అంది అవనిజ.

చిన్నగా నవ్వి ఊరుకున్నాడు ప్రసాద్

సుబ్బలక్ష్మి, వెంకట్రావు, వీరయ్యలముఖంలో అనంతమైన రిలీఫ్

సుబ్బలక్ష్మిని అనుమానించినందుకు అవనిజ, వీరయ్యను అనుమానించినందుకు సీతాపతీ క్షమార్పణలు చెప్పుకుంటారని ఆశించాడు ప్రసాద్.

కానీ వాళ్ళు ఏం మాట్లాడలేదు.. అది కలిమి తెచ్చిన అహంకారం కావచ్చు.

వెంటనే వెళ్లిపోదామన్న భర్తకు అభ్యంతరం చెప్పలేదు సుబ్బలక్ష్మి. సీతాపతి వద్దంటున్నా వినకుండా బయటకు వచ్చేశారు వెంకట్రావు, సుబ్బలక్ష్మి, ప్రసాద్.

ఆ చీకట్లో ఇంటివైపు నడుస్తున్నారు.

"మాష్టారూ . నేను అందరితో పాటు వినోద యాత్రకు రాలేను..." అని రేపు టీచర్‌తో చెప్పాలని నిర్ణయించుకున్నాడు ప్రసాద్.

అలా చెప్పడంలో అవమానంకానీ చిన్నతనంకానీ ఏమీ వుండదు అన్పించింది ప్రసాద్‌కి. 

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## ప్రముఖులకు గౌరవభృతి :–

సాహిత్య సంగీత నాటకాది రంగాలకు జీవితాన్ని అంకితం చేసిన పలువురు ప్రముఖులకు 'రాష్ట్ర ప్రభుత్వం యావజ్జీవ గౌరవభృతిని ఏర్పాటు చేసింది. దీని ప్రకారం ప్రముఖులకు నెలకు 500, రూపాయలు గౌరవభృతిగా చెల్లిస్తారు. ఈ ప్రముఖులలో కవులు, పండితులు, పరిశోధకులు, నటులు, నాటక రచయితలు, పత్రికా రచయితలు మొదలయిన వారున్నారు. గౌరవభృతి పొందిన వారు వీరు : ఆచార్య గంటి జోగి సోమయాజి (ప్రముఖ భాషా శాస్త్ర పరిశోధకులు). శ్రీ లంకా సీతారామశాస్త్రి (సంస్కృత విద్వాంసులు, కవి). శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి (ప్రముఖ వైయాకరణులు). శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి – కరుణశ్రీ (ప్రముఖ కవి). శ్రీ బుద్ధవరపు చినకామరాజు (ప్రముఖ పత్రికా రచయిత, కథా రచయిత). శ్రీ తిరుమల రామచంద్ర, డాక్టర్ బోయి భీమన్న (ప్రముఖ కవి). శ్రీ బులుసు చినవేంకటేశ్వరులు (ప్రముఖ పరిశోధకులు). శ్రీ జమ్ముల మడక మాధవ రామశర్మ (ప్రముఖ అలంకార శాస్త్రజ్ఞులు). కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ (ప్రముఖ రచయిత్రి, వక్త్రి). శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (ప్రముఖ విద్వాంసులు, విమర్శకులు). గడియారం రామకృష్ణశర్మ (ప్రముఖ చరిత్ర పరిశోధకులు, పురాతత్త్వజ్ఞులు), మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి (ప్రముఖ కవి, కవి చరిత్రకారులు). డాక్టర్ కొండూరు వీరరాఘవాచార్యులు (ప్రముఖ శిల్ప శాస్త్రజ్ఞులు). శ్రీ బులుసు వేంకటరమణయ్య (ప్రముఖ పరిశోధకులు, వ్యాఖ్యాతలు, విద్వాంసులు). శ్రీ పైదిపాటి సుబ్బరామశాస్త్రి (ప్రముఖ విద్వత్కవి, నవలా రచయిత). శ్రీ చిమ్మకుర్తి శేషగిరిరావు (ప్రముఖ పరిశోధకులు, తెలుగు విజ్ఞాన సర్వస్వం ప్రధాన సంగ్రాహకులు). శ్రీ కొర్లపాటి గంగాధరరావు (ప్రముఖ నాటక కర్త). శ్రీ పీసపాటి నరసింహమూర్తి (ప్రముఖ నటులు). డాక్టర్ చంద్రశేఖరం (ప్రముఖ బహు రూపధారి, నటులు, నేపథ్య శాస్త్రజ్ఞులు). శ్రీ దివాకరుని వేంకట సుబ్బారావు (సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రవేత్తలు). శ్రీ ఇంగువ కృష్ణయ్య (ప్రముఖ వైణికులు) మున్నగు వారు ఉన్నారు.

వీరందరకు దాదాపు 70వ పడిలో వున్నవారు. కొందరు 80వ పడిలోను వున్నారు. వీరిని ఉత్తర వయస్సులో ఆదరించినందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని, ప్రత్యేకించి రాష్ట్ర సాంస్కృతిక శాఖ కమిషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ గారినీ- సాంస్కృతికశాఖ డైరెక్టర్ శ్రీ ఇ. వి. సుబ్బారావు గారినీ ప్రశంసించాలి. గౌరవభృతి పొందిన వారు తమ జీవిక కోసం బాధ పడకుండా తమ తమ రంగాలలో పరిణత బుద్ధితో విశేష కృషి చేసి తమ జ్ఞానంతో ఆంధ్రావళిని అలరించడం బాధ్యతగా భావించాలి.

## వైభవంగా డాక్టర్ రామరాజు షష్ట్యబ్దపూర్తి :–

ప్రముఖ పరిశోధకులు, జానపద వాఙ్మయానికి విశ్వవిద్యాలయ స్థాయిలో గౌరవం కలిగించిన వారు, బహుభాషాకోవిదులు, పరిపాలనా దక్షులు, వివిధ సాహిత్య సంస్థల నిర్వాహకులు, బహుగ్రంథ రచయితలు, స్థానిక విశ్వహిందూ పరిషదధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ మాజీ అధ్యక్షులు డాక్టర్ బిరుదురాజు రామరాజు గారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవాన్ని ఆయన శిష్యులు, అభిమానులు, మిత్రులు ఘనంగా జరిపారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో ఏప్రిల్ 11వ తేదీ సాయంకాలం జరిగిన ఈ ఉత్సవానికి అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ సి. నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టర్ నాయని కృష్ణకుమారి స్వాగతం పలికారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు సభను ప్రారంభించారు. డాక్టర్ రామరాజు రచించిన 'చరిత్ర కెక్కని చరితార్థులు' అనే వ్యాస సంపుటిని ఆచార్య డాక్టర్ కె. గోపాలకృష్ణరావు ఆవిష్కరించారు. డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ సన్మానపత్రం పఠించి, సమర్పించారు. ఆచార్య ఎం. కులశేఖరరావు సందేశాలను వినిపించారు. రాష్ట్ర దేవాదాయధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ యతిరాజారావు డాక్టర్ రామరాజును, ఆయన సతీమణి శ్రీమతి సూర్యాదేవిని నూతన వస్త్రాలతోను, ఫలపుష్పతాంబూలాదులతోను సత్కరించారు. దాదాపు 50 సాహిత్య సంస్థలు, విద్యాలయాలు, అభిమానుల బృందాలు రామరాజు దంపతులను పుష్పమాలలతో గౌరవించాయి. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య తూమాటి దోణప్ప, శ్రీ కాళోజీ రామేశ్వరరావు, శ్రీ కాళోజీ నారాయణరావు, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి శుభాకాంక్షలు అందజేశారు. డాక్టర్ రామరాజు దంపతులు ఇంకా 60 ఏళ్ళు, అంతకన్నా ఎక్కువగాను జీవించి సాహిత్యాన్ని సంపన్నం చేయాలని వారంతా కోరారు. అధ్యక్షులు, సభా ప్రారంభకులు మొదలయిన వారందరూ తమకు డాక్టర్ రామరాజుతో గల చిరకాల పరిచయాన్ని, విద్వత్తును, పరిపాలనా దక్షతను వివరించారు. శ్రీ వనం రామరాజనే బాలుడు తాను గీచిన రామరాజు చిత్రాన్ని బహూకరించారు. మంత్రి శ్రీ యతిరాజారావు తమ ప్రసంగంలో తమకు రామరాజుకు మధ్య ఉండదగిన పరిచయాన్ని వివరిస్తూ, ఆయన ఒకప్పుడు ప్రయత్నించిన పాంచాలరాజు దేవాలయ పునరుద్ధరణకు ప్రయత్నిస్తానని వాగ్దానం చేశారు. డాక్టర్ రామరాజు సన్మానానికి కృతజ్ఞత తెలిపారు. తమ గురువులు శ్రీ లక్ష్మీరంజనం, ఆచార్య రఘునాథ చక్రవర్తి మున్నగు వారిని సగౌరవంగా స్మరించారు. సన్మాన సంఘ కార్యదర్శి డాక్టర్ రవ్వా శ్రీహరి వందన సమర్పణతో ఉత్సవ కార్యక్రమం సమాప్తమైంది.

## ఉపశ్రుతి :–

డాక్టర్ రామరాజు షష్ట్యబ్దపూర్తి ఉత్సవంలో కవితల్లజుడు శ్రీ శేషేంద్రశర్మ డాక్టర్ రామరాజుకు అమూల్య వస్తువు ఏదో బహూకరిస్తుండగా, అధ్యక్షులు డాక్టర్ నారాయణరెడ్డి 'శేషేంద్రులు తమ హృదయాన్ని కానుకగా అర్పిస్తున్నారు' అని ఛలోక్తి విసిరారు. హృదయం అర్పిస్తే, ఇక హృదయేశ్వరికి ఏమి మిగులుతుంది ? – అని సంశయం వెలిబుచ్చారు నాతో డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు. తెలుగులో గుండెలు అని బహువచనంగా వాడుతారు గదండీ. ఒక గుండె (హృదయం) ఇచ్చినా, మరొక గుండె వుంటుంది చాలు – అన్నారు పక్కన వున్న ఒక తెలుగు భాషా శాస్త్రవేత్త. □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna,
Phones : P. B. X. : 61247, 61248 & 75667.

# నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.




## బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లు నొప్పులకు.

ELL-1508

మీ చేతుల వెచ్చని, సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి—ఇవే మీ కుటుంబానికి కావలసినవి అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే, అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరిఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండు సార్లు రెండింతలు గుణకారి**

నొప్పి తగ్గే వరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండు సార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్లపట్లు, లేదా ఒళ్లు నొప్పులతో బాధపడడం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండు సార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్® – నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.**

SK+F – ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

